సాగర చిత్ర

# స్నేహం

ఆర్వోకలర్





సృష్టిలో తీయనిది

సాగరచిత్ర తీసినది!

స్నేహమేనోయీ!

దర్శకుడు బాపు

నిర్మాత
C.H. సీతారామరావు

మాటలు
ఎమ్వీయల్

కెమెరా
ఇషాన్ ఆర్య

ఏప్రిల్ 1977



సంపుటి· 15
సంచిక 3

సచిత్ర మాసపత్రిక

సంస్థాపకులు:
కీ.శే. వి. వి. రాఘవయ్య

మేనేజింగ్ ఎడిటర్:
శ్రీమతి వి. లీలావతి రాఘవయ్య

సహకార సంపాదకుడు: వేమూరి సత్యనారాయణ

# విషయసూచిక



ముఖచిత్రం లక్ష్మి ఫోటో ఎస్ డి ఆర్ మూర్తి

జ్యోతి, 40/1 మూసాసేట్ స్ట్రీట్, టి నగర్, మద్రాసు-600017.
ఫోన్. 440548. సంవత్సర చందా (ప్రత్యేక సంచికతో) రు 42/-.

# కథా రచయితలకు రచయిత్రులకూ
# ఆకర్షణీయమైన ప్రత్యేక పథకం
# ప్రకటిస్తోంది జ్యోతి!

జ్యోతిలో ప్రచురితమయిన కథలలో ప్రతినెలా రెండు ఉత్తమ కథల నెన్నికచేసి జ్యోతి మామూలుగా యిస్తున్న పారితోషికం కాక అదనంగా ఆ రెండు కథలకూ ఒక్కొక్క కదకూ రు 75/ చొప్పున ప్రత్యేక పారితోషికం అందజేస్తుంది జ్యోతి

అంతేకాదు— అలా ప్రత్యేక బహుమతులు పొందిన కథలలో మూడింటికి— సంవత్సరాంతాన— జ్యోతి సంవత్సర బహుమతులక్రింద (మొత్తం 12 నెలలలో ప్రత్యేక పారితోషకం పొందిన 24 కథలలో)

**ఉత్తమ కథకు రూ 500/-, ద్వితీయ ఉత్తమ కథకు రూ 250/-, తృతీయ ఉత్తమ కథకు రూ 116/- ప్రత్యేక బహుమతులు అందజేస్తుంది జ్యోతి**

జ్యోతిలోని ఉత్తమ కథల ఎన్నిక జ్యోతి సంపాదకశాఖ కాకుండా అయిదుగురు ప్రముఖ రచయితలతో కూడిన ఒక కమిటీ చేస్తుంది

ఈ పథకం ఎప్రయల్ (ఈ సంచిక) నుంచే ప్రారంభించబడుతోంది

ఉత్తమ రచనలకు ప్రత్యేక ప్రోత్సాహం ఇచ్చే ఉద్దేశ్యంతో ప్రారంభించబడిన ఈ పథకం రచయితల రచయిత్రుల అభిమానం పొందుతుందని విశ్వశిస్తున్నాము

—ఎడిటర్

# తొలిమాట

మహిళాభ్యుదయానికి ఉడుతాభక్తిని తోడ్పడాలన్న ఆకాంక్షతో "మహిళా జ్యోతి" శీర్షికను ప్రవేశపెడుతున్నాం అందుకు తెలుగునాట మహోద్యమాన్ని నడిపిన మహనీయుడు స్వర్గీయ కందుకూరి వీరేశలింగంగారు అయినందున, వారి 130 వ జయంతోత్సవ సందర్భంగా ఆ శీర్షికను ప్రారంభిస్తున్నాం

కందుకూరివారు అసాధారణ ప్రజ్ఞాశాలి. తెలుగు సాహిత్యంలో అన్ని ఆధునిక రూపాలను, పోకడలను ప్రవేశపెట్టిన నవయుగ వైతాళికుడు. అయితే తన ప్రతిభను పాండిత్య ప్రకర్షకోసమో, రాజపోషకుల ఆనందంకోసమో వినియోగించ లేదు ఆయనొక గొప్ప సాంఘిక సంస్కర్త ముఖ్యంగా అణగారిన మహిళాభ్యుయం కోసం ఆయన తన జీవితాన్నే అంకితం చేశారు. కనుకనే తన రచనా శక్తినంతటినీ ఆ మహనీయుడు అదే ప్రయోజనకోసం ప్రయోగించారు

స్త్రీ జనాభ్యుదయం కోసం ఆయన, ఆయన సతీమణి రాజ్యలక్ష్మమ్మగారు చేదోడువాడుగా జరిపిన కృషి, నిర్మించిన ఉద్యమం, చేసిన త్యాగం, నడిపిన పోరాటాలు అద్వితీయమైనవి. అస్పృశ్యతా నివారణకు, కులవిచక్షణనూ మూఢ నమ్మకాలను ఛాందస ఆచారాలను వదిలించడానికీ ఆయన పాటుబడ్డారు. బాల్య వివాహాల బెడద వదిలించి, సంస్కరణ వివాహాలను వర్ణాంతర వివాహాలను ప్రవేశ పెట్టడానికి అమోఘమైన కృషి సల్పారు. దేశంలో సతీసహగమన రాక్షసాచారం నుండి మహిళను విముక్తి చేసిన ఘనత రాజారామమోహన్‌రాయిది కాగా, తెలుగునాట పునర్వివాహ హక్కు కొరకు పోరాడి, దాన్ని అమల్లోకి తెచ్చి, వైధవ్య బానిసత్వం నుండి మహిళను విముక్తి చేసిన ఘనత వీరేశలింగంగారిది ఛాందసులు దౌర్జన్యంతో ఆయన్ను అడ్డుకునేందుకు ప్రయత్నిస్తే విద్యార్థులను సమీకరించి వలంటీరు దళాన్ని ఏర్పరచి తన కార్యక్రమాలను సంరక్షించుకున్న ధీరోదాత్తుడు ఆయన

దురదృష్టవశాత్తూ దాదాపు శతాబ్ద కాలంనాడు మహిళాభ్యుదయాన్ని గురించి ఆయన గన్న కలలు ఇంకా కొన్ని ఆచరణలోకి రానేలేదు. ఆయన 1919 లో అస్తమించారు. ఆనాటి బ్రిటిషుపాలన నేడులేదు, ఆనాడు లేని స్వాతంత్ర్యం యీనాడు మనకు వున్నది అది వచ్చికూడా ముప్ఫయి సంవత్సరాలైంది. అయినా స్త్రీ విద్యలో మనదేశం, రాష్ట్రం చాలా వెనకబడే వున్నాయి సమానత్వం అమల్లోకి రాలేదు,

మూఢాచారాలను మూఢనమ్మకాలను తుదముట్టించకపోగా అధికార అనధికార సంస్థలనేకం వాటిని ప్రోత్సహిస్తూనే వున్నాయి. విజ్ఞానశాస్త్ర పట్టభద్రులు కూడా వేదోక్తంగా చేసుకున్నదేగాని పెళ్ళిగాదన్న అజ్ఞానాన్ని ప్రదర్శించడం, కట్నాలకు కానుకలకు బేరాలాడి పెళ్ళిళ్ళు చేసుకోవడం మధ్య యుగాలనాటి మన స్తత్వాలకు ప్రతిబింబాలు, మానవులు చంద్రమండలాన్ని దర్శించి, విశ్వాంతరాళంలో విహరించగల విజ్ఞానాన్ని సాధించిన యీ రోజుల్లో సైతం మానవాళిలో సగభాగంగా వున్న స్త్రీ జాతిని తక్కువ చూపు చూడటంగాని, స్త్రీలూ ఆదే మనస్తత్వంలో వుండటంగాని అందుకే చిహ్నాలు.

సాంఘిక దురాచారాలను తుదముట్టించేందుకు, స్త్రీకి తన హక్కును కాపాడు కొనే కృషికి తోడ్పడే చైతన్యాన్నివ్వగల రచనలను ప్రోత్సాహించాలన్నది "మహిళా జ్యోతి" ధ్యేయం అందుకు రచయితలు, ముఖ్యంగా రచయిత్రులు తోడ్పడాలన్నది మా విజ్ఞప్తి మహిళ మహిళగా మేల్కొని తన హక్కును తాను అమలు జరుపు కునేందుకు పోరాడాలి. సమాజంతో శ్రుతిగలిపి మౌలికమైన మార్పుకూ పాటుబడాలి.

కట్నాలూ కానుకలూ, అవినీతి అక్రమం, వంటింటినరకం, ఆర్థికంగా పురుషుడిపై ఆధారపడుండడం నేడు స్త్రీలను వేధిస్తున్న పీడలు ఈ పీడల విరగడకు దోహదంచేసే రచనలు మహిళకు కావాలిప్పుడు

కార్ఖానాల్లోనూ కార్యాలయాల్లోనూ, గనుల్లోను, వనుల్లోనూ, కష్టజీవులుగా వున్న స్త్రీలు పడుతున్న గాథలను బాధలను వర్ణించి, వివరించి కర్తవ్యాన్ని చూపగల మహిళను మేల్కొలపగల రచనలు కావాలిప్పుడు

చట్టాల్లోనూ సంప్రదాయాల్లోనూ గల అసమానత్వాన్ని చీల్చి చెండాడుతూ మహిళకు మార్గదర్శకంగా వుండే రచనలు కావాలిప్పుడు

ప్రపంచంలోని ఇతరచోట్ల ఆర్థిక సాంఘిక రాజకీయ సాంస్కృతిక సమానత్వాన్ని అనుభవించి అభివృద్ధి చెందుతున్న మహిళల తీరును ఆశాజనకంగా మన మహిళల ముందుంచగల సమాచారం అందించాలిప్పుడు

ఆ ఆశయాలతో మహిళా జ్యోతిని ప్రారంభిస్తున్నాం అందుకు అనుగుణమైన తమ రచనలతో రచయిత్రులూ, రచయితలూ మమ్మ ప్రోత్సహిస్తారని ఆశిస్తున్నాం.

వె. సోమాన్విరావమ్మ

FREE !!　　　　　　　　　　　　　　　　　　　　　　　　　　ఉచితం !

# ప్రేమ గుడ్డిదికాదు

అనాదికాలంనుండి యథార్థమైన ప్రేమ చూపే భక్తి విశ్వాసములనుబట్టి, ప్రేమను గుడ్డిదన్నారు ప్రేమించినవాడు త్రాగుబోతైన, వ్యభిచారియైన, దురాచారియైన, కట్టుకొన్న భార్య మాత్రం విడిచిపెట్టి పోకుండ అన్నిటినీ మౌనంగా భరిస్తుంది ఇలా అర్హత లేనివారిని ప్రేమించడం చూసి ప్రేమను గుడ్డిదన్నారు ప్రేమకున్న మహోత్తరశక్తి క్షమాగుణం ఓర్పు, సహనం కన్నకుమారుడు పరమ దుర్మార్గుడని తెలుసు తరచుగా ఇనప్పెట్టె తాళాలు తీసి ధనాన్ని అపహరిస్తున్నాడని తెలుసు పరమ నీచుడని, దుర్మార్గుడని, తల్లితండ్రులకన్నివిధంగా అవిధేయుడని, వారి రొమ్ముమీద కుంపటివంటివాడని తెలుసు. అయితే ఏ తల్లి తండ్రులైన, కన్నకుమారుడ్ని పట్టి స్వచేతులతో పోలీసుల కప్పగించడం ఎన్నడైనా చూచారా?

ఇహలోకపు తండ్రి ప్రేమ ఇంత గొప్పదైతే పరలోకపు తండ్రి ప్రేమ మరీ గొప్పది కదా? ఆదిమానవుడు తనకు తిరుగుబాటుచేసిన నాటినుండి దేవుడు పాపములో పడ్డ ఈ మానవ సంతానాన్ని ప్రేమిస్తూనే వచ్చాడు తన్ను కాదనీ దూరంగా వెళ్ళి పోయినా, తన బిడ్డలని పిలిచే అర్హత పోగొట్టుకున్న ఈ మానవాళిని రక్షించి తిరిగి తన దగ్గరకు రాబట్టుటకు తన అద్వితీయ కుమారుడైన ఏసుక్రీస్తును ఈ లోకానికి పంపించాడు ఈనాడు విశ్వసించిన, ప్రతి విశ్వాసి హృదయంలో నివాసం ఏర్పరచు కొని యున్నాడు. నిన్న, నేడు, నిరంతరం ఏకరీతిగా నుండే క్రీస్తు గూర్చి తెలుసు కున్నారా?

—చదలవాడ చంద్రమతీదేవి

ఉచితం!　　　　　　　ఉచితం!　　　　　　　ఉచితం!

మీకు బైబిల్‌కు సంబంధించిన ఉచితంగా లభించే అందమైన పుస్తకాలు కావాలనుకుంటే, ఒక పోస్టు కార్డుమీద మీ అడ్రసు స్పష్టంగా వ్రాసి మాకు పంపండి పోస్టు ఖర్చులు కూడ మేమే భరించి మీకు ఉచితంగా పుస్తకం పంపుతాము

ఇదీ అడ్రస్

FAR CORNERS
Post Box - 315
Vijayawada - 2

ఫార్ కార్నర్స్
పోస్టు బాక్స్ 315
విజయవాడ-2

Gospel Message Inserted by FAR CORNERS, Post Box 315, Vijayawada - 520002

'జ్యోతి' మహిళా జ్యోతి శీర్షికను ప్రారంభిస్తున్న
శుభ సమయాన ఆంధ్ర మహిళా లోకానికి
మా శుభాకాంక్షలు!



శుచికి, రుచికి
ఇంటిని మైమరపించే
కమ్మని భోజనమునకు
ఆంధ్రా పచ్చళ్ళు ప్రత్యేకం



ఫోన్: **52532**



# హోటల్ స్వాగత్

శాఖాహార భోజన హోటలు

హైదరాబాద్

# ఉత్తరాలు

## శ్రీశ్రీగారూ కరుణరసమూ

కరుణ రసంమీద వ్యాసం రాసే ఉద్దేశం లేదు శ్రీశ్రీగారి "కన్నీటి కబుర్లు" చదవగా కొన్ని సందేహాలు కలిగేయి అవి ఇవి

(1) తెలుగునాట (సాహిత్యంలో అని సూచన?) భక్తిరసంలాగే కరుణ రసం కూడా తెప్పలుగా తేలుతూంటే అందుకు కొంతగా శ్రీశ్రీగారి రచనలు కారణం కావా?

(2) "ఆధునిక కవి కృష్ణశాస్త్రిగారు ఏడుపు కోసం ఒక కావ్యమే రాసి మనమీద విసిరేశారు" నిజంగానా? ఏడుపు కోసమే కృష్ణశాస్త్రిగారు "కృష్ణ పక్షం" రాశారా? లేక కృష్ణశాస్త్రిగారి ఏడుపు "కృష్ణపక్షం" అయిందా?

(3) శృంగార కరుణ రసాలు మాత్రమేనా పశుపక్షాదులకూ మనకూ సామన్యమైనవి? వీర రసం-కాదా?

(4) నవరసాలను విడివిడిగా చర్చించటం ఎలా ఉన్నా ఏకకాలంలో అనేక రసాలను ఉప్పొంగింపజేసే దే ఉత్కృష్ట రచన- అనే శ్రీశ్రీగారి సాహిత్య సిద్ధాంతానికి ఈ వీరరస పట్టాభిషేక ప్రయత్నం ప్రతిబంధకం కాదా?

(5) ఈ వృద్ధ ప్రపంచానికి శ్రీశ్రీ ఇచ్చిన టానిక్‌లో నెత్తురూ కన్నీళ్ళూ కలిసున్నాయన్నారు చలం "భిక్షువర్షీయసి" "బాటసారి" వంటి కరుణ రస ప్రధానమైన శ్రీశ్రీగారి కవితా ఖండికల మాట ఏమిటి? "క్రిష్ణశాస్త్రి బాధ ప్రపంచానికి బాధ ప్రపంచపు బాధ అంతా శ్రీశ్రీ బాధ" అనే చలంగారి diagnosisని convenientగా మరిచిపోతారా శ్రీశ్రీగారు?

—కేఎస్వీ, తిరుపతి.

మార్చి నెల జ్యోతిలో 'కాశీ గుర్రం' కథ కదను తొక్కుతూ నడిచి, నవ్విస్తే, 'స్తన్యం' ఒక్క పట్టులో చదివించి, merciless గా సాగి, హృదయాన్ని కలచివేసింది "ఎవరు ఫూల్" ఎదురు చూసిన మలుపులే తిరిగింది. "మరో సీత కథ"లో పాయింటేమిటో బోధ పడలేదు. 'పచ్చ పువ్వుల పట్టు చీర' నవ్వించబోయి, నిటూర్పు విడిచేలా చేసింది. శ్రీ శ్రీ గారి నవరసాలు ఎప్పుడయిపోతాయా అని ఎదురు చూసే పాఠకుల మైనారిటీలో అగ్రస్థానం నాదే కాబోలు!

—చాయ, మద్రాసు.

మార్చి నెల జ్యోతిలో ప్రచురింపబడిన, జ్వాలాముఖి గారి కథ పత్రికకే హైలెట్ మెడికల్ కాలేజీల్లో జరిగే ఘోరాలను వాస్తవికతో చాలా చక్కగా చిత్రించారు రచయిత. కరుణ రసంపై శ్రీశ్రీ గారి వ్యాఖ్యానం అద్భుతంగా ఉంది వారికి మా హృదయ పూర్వక కృతజ్ఞతలు

—డి అంజిరెడ్డి, హైమావతి, గద్వాల్.

# ఎన్నికల సజిన్లో.....

ధనవంతుడి ఓటు—అది సోమరిపోతు ఓటు




బీదవాడి ఓటు—దాని వెల పది లేక పరక




నిరుద్యోగి ఓటు—అది ఏజంటుకు



# ......ఓటర్ల రీజన్లు

ఉద్యోగి ఓటు—అది ప్రత్యేకమైన వాళ్ళకే







తాతయ్య ఓటు—దానికి కారు కావాలి




శవంగారి ఓటు—అది అందరిదీను!!






# మహిళా జ్యోతి

సంపాదకులకు
బహిరంగ లేఖ!

## మహిళా జ్యోతి ఎందుకు?

కె. రామలక్ష్మి

జ్యోతి మాస పత్రికలో 'మహిళా జ్యోతి' వెల్గించనున్నట్టు- ప్రకటన చూపి తెలుసుకున్నాను. ఒకవిధంగా సంతోషం ఇంకో విధంగా దుఃఖం కల్గాయి ఎందుకో చెప్పనా?

ఇన్నాళ్ళూ జ్యోతి మాసపత్రిక ఎన్ని రకాల వ్యాసాలు వేసినా కథలు వేసినా- కొన్ని ప్రత్యేక శీర్షికలిచ్చి-'వాటి కింద యివే ప్రచురిస్తాం' అని మడికట్టుకోలేదు అలా అని వివిధ సమస్యల గురించి తల బద్దలు కొట్టుకోకా పోలేదు-ఇటు మహా కవులిద్దరి తిట్టు కవితల దగ్గరనుంచి అటు బిల్లీ జీన్ కింగ్ గెలుపు దాకా ఎంతో ఉత్సాహంగా వర్తమాన వార్తా వ్యాఖ్యల్లో కుతూహలం కనబరచి మాలాంటి వారికి ఆనందం కల్గించారు.కథలలో వైవిధ్యంతో పాటు 'గర్భిణీ' నవలను సులభంగా పిజేరియన్ చేసి దాచుకునే దాకా పాఠకుల కోర్కెలను మన్నిస్తూ దినదిన ప్రవర్ధమాన మవడమే కాదు కాపీ కాపీ ప్రవర్ధమాన మవుతూ ఈ రోజు జ్యోతి పత్రికని హైబ్రోలో బ్రో తేడాలు లేకుండా-అందరూ చదివేలా రూపు దిద్దారు. అందుకు సంతోషంగా వుంది

కాని ఇప్పుడీ మహిళా జ్యోతి కోసం అర్జెంటు దేనికి? మహిళలకో శీర్షిక అంటూ వుండకపోతే నష్టం ఏమిటి? మీరా శీర్షిక ఏ ధ్యేయంతో ప్రారంభించాలనుకుంటున్నారన్నది చూచాయగా మీ

అందుకే ఈ లేఖ రాయడానికి సాహసిస్తున్నాను.

గత పాతికేళ్ళుగా యీ దేశంలో మహిళల కనేసరికి-ఇల్లూ వాకిలీ, వంటా వార్పూ, యింక కాలక్షేపానికి లలిత కళలూ తప్పించి యింకేం లేకుండా చేసిన పాపం-యిప్పటికి చాలామంది పంచుకున్నారు. ఎక్కడైనా కొత్త పత్రికలో మహిళల శీర్షిక వస్తూందంటే భయం వేసే స్థితికి పాఠకులని తయారుచేసేశారు. దీనికి పత్రికాధిపతులను నేను తప్పు పట్టడం లేదు. రాసే రచయితలనూ తప్పు పట్టడం లేదు. కారణం ఏమిటంటారా? అచ్చువడమే రచనకు ప్రధానం అయినప్పుడు-ఏది అచ్చు వేసుకుంటారంటే-దాన్నే తయారుచేయడం అత్యాశ కాదు కదా? అమ్మగల్గిన సరుకే కద బజారు కెక్క కల్గేది!!

గత పాతిక సంవత్సరాలలో-అనేకానేక పత్రికలు-వచ్చాయి పోయాయి చాలా మటుకు వున్నాయి కూడా. వీటిలో ఒక్క పార్టీ రాజకీయాలకీ, కొన్ని 'ఎడం' నమ్మకాలకీ కట్టుబడిన పత్రికలూ రచయితలూ, తప్పించి అంతా-కాలక్షేపం బటాణీలతో కాలమ్ నింపిన వాళ్ళే. పై వాళ్ళతో వచ్చిన పెద్ద చిక్కే—రాజకీయం. వీళ్ళు సమస్యలని సమస్యలుగా-మనిషికి వచ్చే కష్టసుఖాలుగా కాక-అదొక పార్టీ సమస్యగా రంగు కళ్ళద్దాల లోంచి తప్పించి చూడకపోవడం వల్ల - ఈ రచనలకి ప్రాచుర్యం అంతంత మాత్రంగానే కల్గింది. ప్రపంచ సమస్యలకి కదలని వాళ్ళు అయిదాకా వచ్చేసరికి-పీడిత జనావళి, స్వేదం, కండలు కరగడం అంటూ ఆవేశ పడ్డమే తప్పించి చేసింది కించిత్తు కూడా లేదు. ఎంతసేపూ ఎక్కడో స్త్రీ పురోభివృద్ధి గురించే గాని మన పక్కింటి స్త్రీ తిండి లేని సంగతికి కారణం వీరు కనిపెట్టరు - వ్యక్తికి సానుభూతి లేని వ్యవస్థలో వచ్చే చిక్కులే యివి-అందుకే మహిళల శీర్షికల్లో-ఎటూ పోకుండా సేఫ్ సైడ్ అన్నట్టు-అల్లికలు కుట్లు పక్కింటి బామ్మగారి కబుర్లు-పచ్చళ్ళు పోపులు-శృంగారం సింగారం-యివే వీటిలో చోటు చేసు కూర్చుంటున్నాయి.

ఒక్కొక్కప్పుడు నాకేం అనిపిస్తున్నదో తెలుసా? ఈ దేశంలో ఆడవాళ్ళకి మొగుడూ పిల్లలూ వంటా వార్పూ కుట్లూ అల్లికలూ-అత్తలూ ఆడబిడ్డల కబుర్లు తప్పించి యింకేం అసలు తోచవా? లేవా? అని. ఈమధ్య యిదే ప్రశ్న ఓ స్నేహితురాలిని అడిగితే-లేకేం? 'సెక్సు' వుంది కదా అంది. నిజమే. ఈ కాలంలో ఆడదానికిక వేరేం సమస్య లేనట్టు సెక్సుని సినిమా వాళ్ళు గుత్తకి పుచ్చుకున్నారు. తీరని కోరికలు, రెచ్చిన కోరికలు తెలియని కోరికలు-నిర్మాతలను కల్లోలపెట్టి స్త్రీలు సిగ్గుపడే విధంగా తెలుగు సినిమా స్త్రీ యీ రోజు వెండి తెరమీద నగ్న తాండవం చేస్తూంది. ఇదివరలో యిదొక్క జ్యోతిలక్ష్మి ఒక్క విజయలక్ష్మి ఒక్క హాలం ఎవరో చేసేవారు. కాని, వారిని సెన్సారు దొంగ కత్తెర తొలగించడం వల్ల కాబోలు. యీ వేషభాషలే కాదు వెర్రి మొర్రి కామోద్రేక చర్యలు సహితం

నాయిక పాత్రలకే వదిలేస్తూ-హాల్లో స్త్రీలు కూర్చుని చూడలేని స్థితికి దిగజార్చేస్తున్నారు. మన కర్మ! సెన్సారు వాళ్ళకేం పోయింది? డబ్బుచ్చుకు సినిమాచూస్తారు-మనదే నష్టం మనం డబ్బిచ్చి యీ స్త్రీ శీల హత్యల్ని చూస్తున్నాం. చుట్టూ వున్నవాళ్ళు ఈలలు వేసి చప్పట్లు కొట్టి అసభ్యంగా కామెంటు చేసినా మనం ఏం అనడానికి లేదు—ఏమేనా అంటే ఎదురుతిరిగి 'రచయిత గారు వాడిన ద్వంద్వార్థపూరిత డైలాగు కంటేనా' అని మననే ఎదురుప్రశ్న వేస్తారు' అంతేకద—మంచి మనిషిని తిడితే నోరు మూసుకుని లోపలకి వెళ్ళి



పోతుంది. అదే చెడిన మనిషిని తిడితే పైబడి దెబ్బలాటకి దిగుతుంది స్త్రీ హత్యాకాండ ఇటు ప్రకటనలలోనుంచి అటు సినిమాలలోనుంచి, ఇటు సాహిత్యంలో నుంచి—సాగిస్తూన్నా తెలుసుకోకుండా—మనం ప్రత్యేకించి ఏర్పరచే యీ మహిళా శీర్షికలు కూడా వాటికి దోహదం చెయ్యడమే—చాలా శోచనీయమైన స్థితి.

అసలివి ఎందుకుండాలి? లేకపోతే ఏం? మామూలుగా ప్రచురించుకోవచ్చు కదా? అంటే, అదీ కష్టమే—మందలో

ఒకరుగా పడేపి అసలు—వీలైతే ఆడ కంఠం వినబడకుండా చేయాలనే తాప త్రయపడతారు అందరూ మీరీ సంగతి ఏ రంగంలో చూసినా యిట్టే గ్రహించ గలరు

పబ్లికుగా వచ్చి ఆడది ఏ పని చేసినా ఆమెని అవమానించడం ఎంతో సులభం. ఎంత ధీర గంభీరవతి అయినా సరే— చటుక్కున చౌకబారు కామెంటు విన్నా, అసభ్య ప్రవర్తనకు గురి అయినా— కుంచించుకుపోతుంది. దానికి కారణం ఆమె బలహీనత కాదు—మగవారిలా రాటుపోటుల కాగలేని సౌకుమార్యంకాదు. మానసికంగా ఇలాంటి పరుష ప్రవర్తన ఆమెను యిట్టే కృంగజేస్తుంది, అది తెలిసి అంత సులభంగా ఆమె శీలంమీద, ప్రవర్తనమీద, వ్యక్తిత్వంమీద దెబ్బ తీసేట్టు ప్రవర్తిస్తారు—సానుభూతి లేని వాళ్ళు ఆడదాని వ్యక్తిత్వంమీద, ఆడ దాని సామర్థ్యంమీద గౌరవం లేనివాళ్ళు! ఇటువంటి బాధపెట్టే విషయాలను పట్టించుకోలేని స్థితికి ఆడది ఎదగాలంటే నిజానికి చాలాకాలం పడుతుంది. చాలా కాలం ఏమిటి—చాలా తరాలు పట్టవచ్చు. తరాలు మారినా సమస్య మారకపోవ డానికి కారణాలు—ఒక్కటే—ఏ తరం ఆ తరం పని చూసుకోవడమే తప్పించి కనీసం పై తరమేనా మెరుగయ్యే ధోర ణికి పునాదులేనా వేయడానికి సాహపించక పోవడం.

ఈ పని న్యాయంగా తెలుగు పత్రికల్లో ప్రత్యేక స్థానాలని అలంకరించే మహిళల శీర్షికలు చేయవలసింది. కాని ఇన్నాళ్లుగా యిన్నేళ్లుగా ఏమీ చేయలేదని తెలుస్తూనే వుంది కదా?

అందుకే మీరూ మరో మహిళల శీర్షిక అంటూంటే—భయం వేసింది. ఇప్పటికి ఆడవాళ్ళ పత్రికలం అని చెప్పుకొంటూ అందాల పోటీలమీదా అమ్మమ్మల పేజీల మీదా, ఎవరూ వేసుకోని దుస్తుల నమూ నాలమీదా డబ్బు చేసుకుంటున్నారు. కొన్ని పత్రికల్లో అయితే — ఆడదానికి అవమాన కరమైన విషయాలు కూడా రాయడం జరుగుతోంది కనీసం మీరైనా ఈ శీర్షిక ఉద్దేశ్యంలో మార్పులు తేరా? అని అడగా లని వుంది.

దేశం ఎన్నో విధాలుగా వికసించింది, అంతర్జాతీయ మహిళా సంవత్సరం ఆడ దాని అధ్వాన్న స్థితిని ప్రపంచపు కళ్ళ ముందు (కళ్ళంటూ వుంటే!) పెట్టింది, స్త్రీలకై చట్టాలు చేశారు. చట్టాలు సవ రించారు. ఇవన్నీ చేస్తూన్నా జరుగు తున్నా—మహిళా లోకంలో మార్పు వస్తూందా? పెళ్ళి బేరం, సంతానం బేరం. ఆస్థి బేరం ఆఖరుకి ఉద్యోగం కూడా బేరమాడి బ్రతికి బట్టకడుతోంది నేటి స్త్రీ—వ్యక్తిగా చదువుకుంది. వ్యక్తిగా ఉద్యోగం చేస్తూంది. కాని వ్యక్తిగా చూడబడుతోందా? ఇంట్లో ఆమె మాటకి విలువెంత? వీధుల్లో ఆమె వ్యక్తిత్వానికి విలువ ఎంత? ఏ పిచ్చివాడి చేతిరాయి అయినా- ఆమె పెంచుకున్న వ్యక్తిత్వాన్ని- స్వాతంత్ర్యాన్ని. గౌర వాన్ని- ఒక్క త్రుటిలో నిర్మూలించ కలదు. ఇది ఎందువల్ల? సంఘంలో మగా ఆడా అన్ని రంగాలలో సమానమే కదా?

ఒక సృష్టి విషయంలో తప్పించు. అంత మాత్రం చేత ఆడది యింత తీసి కట్టు ఎలా అయింది? ఈ ప్రత్యేకత కామెకి అధిక గౌరవం లభించడం పోయి— సంఘంలో వ్యక్తిగా నిలబడే అవకాశం కూడా లేకుండా చేసే హక్కు ఎవరు యిచ్చారు?

స్వాతంత్ర్యం సమానత్వం కోరడం అంటే- ఆడది బరితెగించాలని చూస్తోందనే యీ సంకుచితపు మనస్తత్వపు యినుపగోడలు పగలకొట్టడంలో - కొన్ని అవమానాలు జరిగినా- పని ప్రారంభించక తప్పదు. అందుకు దర్పణంగా వుండేలా మీ మహిళా జ్యోతిని తీర్చిదిద్దండి. నేడు ఆడది సినిమాలలోనే కాదు ఆఫీసుల్లో కార్ఖానాల్లో- ఎక్కడికి వెడితే అక్కడే. విలాస వస్తువుగానే చూడబడుతోంది. దానికి తోడు నవలా సాహిత్యంలో కూడా రేపులూ అధికాధిక శృంగారాలూ, తెలిసి తెలియని సెక్సు పెర్వర్షన్స్ రాస్తూ దొంగపేర్ల అసలుపేర్ల రచయిత్రులు అంచీలమీద కీర్తి కెరటాల అంచుల కెక్కేయాలని చూస్తున్నారు. ఇదికూడా ఆడదాన్ని సెక్సు వస్తువుగా చూడడానికీ సెక్సుకు మినహా మహా సమస్య లేనట్టు- కథలల్లడానికీ దోహదం యిస్తోంది. ఈ పోకడలు మనమే అరికట్టలేకపోతే- ఇతరులకేం పట్టింది? మన దుస్థితికి హాయిగా నవ్వుకొంటారు. వేళాకోళం చేస్తూ హేళన చేస్తూంటారు.

మీ మహిళాజ్యోతి మహిళా లోకాన్ని కొత్త పుంతలవైపు కళ్ళుతెరిచి చూసే జ్యోతిగా మలచండి. కనీసం ఆడదానికి



కూడూ గుడ్డా తలదాచుకోడానికి నీడా వుంటే చాలదు- మెదడుకి మేత కూడా కావాలని ఆలోచింపచేసే కరదీపికగా చేయండి. సంఘంలో ఆడది ఆడదై పుట్టినందుకు సిగ్గుపడక్కరలేదు- తన సమస్యలను తెలుసుకోలేని గుడ్డిదైనందుకు సిగ్గుపడాలని- కాస్త వెల్గు చూపండి. ఈ గత దశాబ్దంలో ఎన్నో రంగాల అభివృద్ధి చెందిన మహిళా జగత్తు- కనీసం మీ మహిళా జ్యోతిలో ప్రతిబింబించనివ్వండి. మనం ఎక్కడున్నాం? మనం ఎటు పోతున్నాం? మనతోపాటు మన పిల్లల్ని ఎటు తీసుకెడుతున్నాం? యీ గమ్యం సరైనదేనా అని ఆలోచించేలా- చేసే ఉత్తమ శీర్షిక కావాలి మీ మహిళా జ్యోతి. స్త్రీ స్వాతంత్ర్యం అంటే సమానత్వం అంటే- 'నువ్వు వండు నేను ఉద్యోగం చేస్తాన'నే భార్యల కార్టూనులతో, జోకులతో సంతృప్తిపడుతున్న సగం చచ్చిన నల్లుల్లాంటి వ్యక్తిత్వం లేని మనుష్యుల వెన్నుతట్టి- ఆడది యిది. ఆడదాని లోకం యీనాడిలా వుంది- కాస్త చూడండి- అని ఓ చురకవేసే కరదీపికగా వెల్గనివ్వాలి మీ మహిళా జ్యోతిని. లేకపోతే- యిప్పటికే సన్నగిల్లిపోయిన యితర శీర్షికల లాగానే యిది మరీ పీలగా అయిపోతుంది. ఇప్పుడు చీకటి లేదు. కాని వెల్గు తెలియడంలేదు మహిళా లోకానికి. మీ శీర్షిక ఆ వెల్గుకు ప్రతినిధి కానివ్వండి. లేకపోతే అనవసరం. ***

# బానిసకు-బానిస నేటి స్త్రీ!

— శ్రీమతి పి. మమత

ఏ దేశంయొక్క ఔన్నత్యమైనా ఆ దేశంలోని స్త్రీల స్థితిగతులపైనబట్టి-భావి పౌరులుగా అభివృద్ధి చెందవల్సిన బిడ్డలపట్ల తీసుకుంటున్న శ్రద్ధనుబట్టి అంచనా కట్టవల్సివుంది. అయితే ఆధునిక యుగంలో దీన్ని గీటురాయిగా పెట్టుకొని చూస్తే ఎంత వెనుకబడివున్నామో? గుర్తించి, భవిష్యత్‌కి బాటలు వేసుకోవాలి

నేడు మహిళాసంవత్సరంఅయిపోయి మహిళా యుగంగా నడుస్తున్న యీ రోజుల్లో—పత్రికలలోను, రేడియోలలోను, మహిళా అభ్యుదయ ప్రాముఖ్యతను, అవసరాన్ని గూర్చి ప్రపంచ వ్యాప్తంగా అనేక వ్యాసాలు—ప్రసంగాలు వస్తున్నాయి.

ఇంత కాలానికి మహిళలకు సమాజంలో గల స్థితిని గూర్చి ప్రపంచ వ్యాప్తంగా, చర్చకు రావడం సంతోషం. అన్ని దేశాల ప్రభుత్వాలు ఈ విషయంలో తాము చేయగలిగినదంతా, చేస్తామని ముందుకు రావడం, హర్షించదగినది.

కానీ యీ సమస్య ఒక్క స్త్రీల మేలు కొలుపుమీదే ఆధారపడిలేదు. సమాజ వ్యవస్థ మొత్తం అంతటితోనూ ముడిపడి వుంది.

ఇప్పటి సమాజంలో అసమానత్వం ప్రబలంగా వుంది. ఎక్కువమంది జనం దోపిడీ శక్తులకు, వారి లాభాలకు బానిసలై పోతున్నారు. ఆ ఎక్కువమందిలో సగం మందికిపైనే స్త్రీలుంటారు. గనుక మొత్తం స్త్రీలలో యీ ఆర్థిక దోపిడీకి, అత్యధిక సంఖ్యాకులుగా స్త్రీలు గురి అవుతున్నారు. సమాజంలోవున్న అసమానత్వానికి తోడు స్త్రీగా మరింతఅసమానత్వానికి పురుషునిచే గురిచేయబడుతున్నది అందుకనే బానిసకి బానిసగా స్త్రీ బ్రతుకుతోందనడంలో, అతిశయోక్తి లేదు

కనుక స్త్రీ తన బానిసత్వం పోగొట్టుకొనే పోరాటంతోపాటు—అత్యధిక సంఖ్యాకులైన జనం, బానిస విముక్తికి చేస్తున్న పోరాటం—గూడా తనదేనని, మరచిపోగూడదు.

## సమాజంలో స్త్రీగా ఎదుర్కొంటున్న సమస్యలు

అయితే స్త్రీజాతి మన సమాజంలో ప్రత్యేకంగా ఎదుర్కొంటున్న సమస్యలను పరిశీలిద్దాం

ఈ ప్రపంచంలో, నాగరికత అభివృద్ధిచెందిన మేరకు "స్త్రీ" దాన్ని అనుభవించలేకపోతున్నది దానికి ఉదాహరణలు అనేకం వున్నాయి

ఆధునిక నాగరికత ముందుగా వృద్ధి చెందిన దేశాలలో అగ్రస్థానంలో వున్న "ఫ్రాన్సు" ఇటీవలవరకు స్త్రీ పురుషుడితో పాటు ఓటింగు హక్కు గుర్తించబడ లేదంటే—ప్రపంచ వ్యాప్తంగానే స్త్రీ ఎంత అలక్ష్యంచేయబడిందో తెలుస్తోంది

మన దేశంలో ఓటింగు హక్కు అందరికీ వున్నది చదువుకునే హక్కు—ఉద్యోగంచేసే హక్కు, అందరికీ వున్నది అవి అక్కరకు వస్తున్నాయా? ఏ కొద్దిమందో తప్ప—ఇంటి యజమాని సంపాదనపరుడు చెప్పినట్లు ఓటు చేయడం తప్ప—ఆ హక్కును స్త్రీ సద్వినియోగం చేసుకొన్న తీరు కన్పడదు

చదువుకొన్న స్త్రీలుగా లెక్క లో కొచ్చినవారిలో నూటికి 40 మందికి సంతకం చేయడమే తప్ప చదువురాదు అని తేలింది మరీ అత్యధిక సంఖ్యాకులు నివశిస్తున్న గ్రామీణ ప్రాంతాలలో అక్షరాస్యుల శాతం అతి తక్కువగా వుంటోంది

మొత్తం చదువుకున్నవారి సంఖ్య తక్కువకాగా చదువుకున్న స్త్రీలలో ఉద్యోగాలు దొరికినవారి సంఖ్య మరీ తక్కువగా వున్నది 1968లో తేల్చిన లెక్కలనుబట్టి దేశంలోవున్న మహిళాపట్టభద్రులలో కేవలం35శాతంమందిమాత్రమే ఏదో ఒక ఉద్యోగంలో వున్నారు

కనుక మనకు చదువుకొనే హక్కు వున్నది కానీ ఆ హక్కును వినియోగించుకొనే అవకాశాలే లేవు మరి!

ఇందుకు తోడు కొందరు యువకులలో ఈర్ష్య కూడా పెరుగుతోంది "అసలు నిరుద్యోగులతో పురుషులు సతమత మవుతుంటే స్త్రీలు గూడా-చదువుకొని-వుద్యోగాలు కావాలని - పురుషులతో పోటీకి రావడం, అన్యాయం పురుషుడు కష్టపడి సంపాదిస్తుంటే-గృహిణిగా వంట చేస్తూ-బిడ్డల్ని కని సంసారం చక్కబెత్తే సరిపోతుంది ఆడవాళ్ళని ఇంటిపనికి పరిమితి చేస్తే - మొగవాళ్ళ వుద్యోగానికి కొంత మెరుగవుతుందని" అనే దురభిప్రాయాలు పెరుగుతున్నందుకు విచారంగా వుంది

## చదువుకొన్నా తప్పని సమస్య!

చదువుకున్న అమ్మాయిలకు ఉద్యోగం దొరక్కపోగా వివాహాల సమస్య పెద్ద సమస్యగా ఎదురైంది "స్త్రీ" చదువుకు గాని, ఉద్యోగానికి గాని, ఎటువంటి విలువా లేదు అబ్బాయిలకు—కట్నాల దాహం పెరిగిపోయింది అందుచేత ఆడపిల్లలు కన్న తలిదండ్రులకి ఇదొకటి తీరని బాధగా తయారయింది

ఆడపిల్లలకు చదువు చెప్పించినా ఉద్యోగాలు చేస్తున్నా-అదనంగా వరకట్న భారం ఎటూ తప్పడం లేదు అనే భావం

తలిదండ్రుల మనసులలో వ్యాపించి దాని ఫలితమే తలిదండ్రులే తమ ఆడపిల్లల చదువుల్ని ప్రోత్సహించలేని స్థితిలో ఉండటం।

ఇక వుద్యోగాలలో నున్న స్త్రీల పరిస్థితి చూస్తే వారికి ఎదురవుతున్న సమస్యలు అనేకం.

పెండ్లి కావడమే కష్టంగా వుండగా-పెండ్లి అయిన స్త్రీ స్థితి మరింత దుర్భరంగా వుంది.

ఉద్యోగాలులో వున్న భార్యా భర్తలిద్దరూ ఒకేచోట వుండే అదృష్టం లేని సందర్భాలెన్నో ఉన్నాయి. ప్రయత్నించీ ఒకచోట వేయించుకోలేక, అనేకమంది దంపతులు ఆర్థిక దుస్థితితో వుద్యోగం వదలుకోలేక,గత్యంతరంలేక,తప్పనిసరై ఇద్దరూ చెరియొక చోటా కాపురాలు పెట్టి జీవించటం జరుగుతోంది. వారికిదొక బాధాకరమైన సమస్య.

భార్యాభర్తలు ఒకేచోట వుద్యోగం చేసే స్త్రీలకే బాధలున్నాయి. వారిని చూస్తుంటే మరింత బాధగా వుంటుంది. భార్య, బిడ్డల్ని - సంసారం చక్కదిద్ది టైముకి ఆఫీసుకి చేరాలి. ఏకొంచెం లేటయినా అక్కడ చీవాట్లు తప్పవు. ఆఫీసులో పని చేసి, అలసిపోయి ఇంటికొస్తుంది. ఇంటికి రాగానే పుట్టెడు పని, పిల్లల బాధ్యత-వంటా తప్పవు. అలా రాత్రి 12 గంటల వరకూ విశ్రమించే అవకాశం వుండదు. అంటే స్త్రీ 17 లేక 18 గంటలు రోజుకు శ్రమిస్తుందన్న మాట. పగలంతా తల్లితో లేని పసిబిడ్డ బెంగతో ఆమె వదలిపెట్టదు. ఆ బిడ్డతో రాత్రంతా సతమతమవుతూ కలత నిద్రే ఆ తల్లికి దక్కేది.

## మహిళా జ్యోతి

ఏ రోజు అయినా బద్ధకించో ఆఫీసులో పని ఎక్కువయ్యో-ఓపిక లేకో-వంట్లో బాగుండకో-ఆ పూట బద్ధకించి కూరలు చేయకపోతే - ఆగ్రహించి, కలహించే భర్తలెందరో వున్నారు. జీతం మొత్తం చేతిలో పెడితే అందుకుంటారు గాని తనతోపాటు బయట శ్రమించి మరల ఇంట్లో ఇంత శ్రమ పడుతుందే తనకు, బిడ్డలకు, పరిచర్యలు చేస్తుందే అనే సానుభూతి కూడ లేని భర్తలు లేకపోలేదు.

ఆమె శ్రమలో భాగం పంచుకొని ఆమెకు సహకారం చేయడం చాలా తక్కువ. అలా సహకరించి ఆదుకొని ప్రేమతో గుర్తించే వారు కొద్ది మందే వుంటారు.

అంతేకాదు కొందరు భర్తలు, తాము సంపాదించిన డబ్బుతో, తాగి తందనాడలాడుతూ ఆర్థిక చిక్కుల్లో పడి భార్యలను తిట్టి-కొట్టడం గూడా జరుగుతోంది.

స్త్రీకి ఇంట్లో పనిభారం తప్పడంలేదు. ఉద్యోగం చేస్తున్నందుకు మరింత కష్టపడవల్సి వచ్చేసరికి అనేక మంది స్త్రీలకు, విరక్తి కలిగి "పురుషుడు సంపాయిస్తే-ఇంటి పనులు చూచుకుంటుంటే పోతుంది" అనే అభిప్రాయానికి వస్తున్నారు.

ఇంటి పని, పిల్లల పెంపకం కేవలం ఆడవాళ్ళ బాధ్యతలే కానక్కర లేదు. మగవాళ్ళు గూడా ఆ పనుల్లో భాగం పంచుకుంటే సంసారం సుఖమయం అవుతుందే తప్ప పురుషుడికి జరిగే అవమానమేమీ ఉండదు. స్త్రీ పురుషు లిరువరి మనస్థత్వం లోనూ మార్పు రానంత కాలం యీ సమాజం బాగుపడదు.

# మీరు విన్నారా?

మధ్య తరగతి కుటుంబం. వారికి ఐదు గురు పిల్లలు. ఆ ఐదుగురూ ఆడ పిల్లలే పాపం. మూడు ఎకరాల పొలంతో ఎదుగూ బొదుగూ లేని వ్యవసాయం. అయినా అలాగే అవస్థలు పడుతూ ఆర్థికంగా, పిల్లలకు చదువు చెప్పిస్తున్నారు. పెద్ద పిల్ల ఎలాగో స్కూలు ఫైనలు పూర్తి చేయగలిగింది.

ఆ తల్లిగూడా అస్తుబిస్తుగా వున్న ఆ సంసారం ఆర్థిక పరిస్థితితో, ఆవేదనతో అవస్థపడుతోంది. ఉన్నంతలో, విలువగా బ్రతకటానికే జీవన పోరాటం సాగిస్తోందా కుటుంబం.

పిల్లలు తప్పకుండా పాసవుతూనే యున్నారు. అధిక ధరలతో సంసారం సాగక-పిల్లలకు, తనకు, బట్టలకైనా వస్తుందని అనేక సమస్యలతో సతమతమౌతూనే, వేడినీళ్ళకు చన్నీళ్ళు తోడుగా. ఆ ఇల్లాలు, అప్పడాలు. వడియాలు చేసి ప్రక్కవార్కి అందిస్తూ పిల్లల ఖర్చులకు తోడ్పడుతుంది. అయినా అగచాట్లమారి కాపరంగానే ఉంది.

ఆ పరిస్థితులు చూస్తున్న పిల్ల, విశ్రాంతి లేని తండ్రి జీవితం, ఆర్థిక దుస్థితితో సంసారం యీదలేక అమ్మ ఆందోళన, ఆమె కన్నీరు చూచి తల్లడిల్లి పోతోంది. ఎలాగైనా కుటుంబానికి, ఆర్థికంగా అండగా నిలవాలని, నిర్ణయించుకొని, స్నేహితురాలి దగ్గరకు వెళ్ళి తన నిర్ణయాన్ని చెప్పి సహకరించమనికోరింది.

వారుంటున్న గ్రామానికి దగ్గరలోనే ఉన్న పట్టణంలో కొత్తగా ఒక పెద్ద పరిశ్రమ-ముఖ్యంగా స్త్రీలకు ఉద్యోగావకాశాలు కల్పించేది-ప్రారంభించారు ఆ విషయంచెప్పి ఆస్నేహితురాలు తానే అప్లికేషను వ్రాసి సంతకంపెట్టించి పంపింది.

ఇంటికి వెళ్ళి అమ్మతో తన నిర్ణయం చెప్పి తన తోటివారు చాలామంది చేరుతున్నారని నాన్నకు కూడా చెప్పి వప్పించాలని తల్లిని వేడుకుంది.

అనుకోని అదృష్టం స్నేహితురాలివల్ల కలిగింది. వుద్యోగంలో చేరమని ఆ పరిశ్రమాధికారుల నుండి వుత్తరం వచ్చింది. అది చూచిన ఆ అమ్మాయి ఆనందంతో పొంగిపోయింది.

తలిదండ్రుల్కూ - 22 సంవత్సరాలు వచ్చినా బిడ్డకు పెళ్ళిచేయలేని దౌర్భాగ్య స్థితికి ఎంతో క్రుంగిపోతూ,యీ కట్నాలు, కానుకలు ఇచ్చే తాహతులేక వేరే చేసేదీ లేక బిడ్డ తృప్తికోసం అంగీకరించక తప్పలేదు.

పచ్చని ఛాయ, పొడుగు అన్ని పొందికలతో చూచేవారిని ఎంతో ఆకర్షించే పర్వనాలిటీ విమలది. అందచందాలకు తగినట్లు అన్ని సుగుణాలు స్వంతం చేసు

'కవిత'

పనులు చేసుకెళుతూంటుంది 180 రూ జీతంతో-ఆ వుద్యోగ నిర్వహణ బాధ్యతగా నిర్వహిస్తూ-పనిలో నైపుణ్యతతో అధికారుల మన్ననలను పొందింది తోటివారి ప్రేమాదరణలకు పాత్రురాలైంది-త్వరలో ప్రత్యేకంగా ఇంక్రిమెంటు కూడా సాధించింది అందరిలో ప్రత్యేక స్థానం పొందగలిగింది

ఆ ఫ్యాక్టరీలో రవి అనే యువకుడున్నాడు అతనిది మంచి పర్సనాలిటీ-తెలివితేటలకు తోడు మంచి మనసు-ప్రక్కవార్కి సాయపడే సాంప్రదాయంతో అందరి మన్ననలను పొంది అందరి ప్రేమకు పాత్రుడయ్యాడు

రవికీ విమలకూ పరిచయమైంది పరిచయం ప్రేమగా మారింది

ఇద్దరూ మనసు విప్పి మాట్లాడుకున్నారు విమలలో నున్న సుగుణాలే సంపదగా భావించి కట్నం లేకుండా చేసుకుంటానన్నాడు రవి ఇద్దరకూ అంగీకారమైంది రవి చదువుకున్న యువకుడు మంచి ఆదర్శాలు గలవాడు అతను తనవాడు కావడం ఎంత అదృష్టం అనుకొంది విమల అయితే ఆఖరికి కులాలు వేరని తెల్సి విలవిల లాడిపోయారు పెద్దలు అంగీకరిస్తారా? అన్న భయం ఇద్దరికీ కలిగింది 'నేను సిద్ధమే విమలా నీవే ఆలోచించుకో మరి" అన్నాడు రవి తన దృఢ నిశ్చయం తెలియజేస్తూ విమల మనసులో తుఫాను రేగింది తండ్రి కోపిష్టి సనాతన పరుడు మనసులు కల్సిన తర్వాత యీ పాడు కులాల బెడద ఏమిటి అని వాపోయింది గుణం కావాలి గాని కులమేదైతేనేం? అని రవిని చేసుకుంటానికే నిశ్చయించుకొంది

అమ్మతో చెప్పింది అమ్మ విని అదిరిపడింది "అమ్మో! మీ నాన్న అంగీకరిస్తాడా?' అంది కూతురు చెప్పిన విషయాలు, నచ్చచెప్పిన తీరుతో—తను సమాధానపడిందిగాని తండ్రిని గురించే బాధ "చెప్పే సాహసం లేదమ్మా" అని క్రుంగిపోయిందా తల్లి చివరికి ఆ తండ్రికి చెప్పే సాహసం లేకపోయింది ఇద్దరికీ ఆలోచనలు ముసురుకొని వుక్కిరిబిక్కిరి అయింది విమల ముందుగాచెబితే తండ్రి ఒప్పుకోడని భయపడింది ఉత్తముడైన రవిని వదులుకోలేకపోయింది

మిత్రుల ప్రోత్సాహంతో ఇద్దరూ వివాహంచేసుకోవడానికే నిశ్చయించుకున్నారు తలిదండ్రులకు చెప్పకుండానే మిత్రుల సాయంతో కనకదుర్గ గుడిలో పెళ్ళి చేసుకొని స్నేహితురాలింట్లో మూడు నిద్రలుచేసి ఆ తర్వాత దంపతులు విమలగారింటికి వెళ్ళి ఆమె తలిదండ్రులను చూడాలనుకున్నారు

కనకదుర్గ గుడిలో మిత్రుల సమక్షంలో రవి-విమల దంపతులయ్యారు

నిజంగా చూడ ముచ్చటగా వున్నారు చక్కని ప్రేమ జంట వీరిది ఒకరినొకరు అర్థం చేసుకొని ఆదర్శంగా దంపతులయ్యారు తీయని దాంపత్యంతో ఆనందాలు పండించుకోవాలనే కాంక్ష వారిలో పుట్టిపడుతోంది మిత్రురా


వస్త్రములను
ఒకేచోట
మిల్లు ధరలకే
అందించగల
అధునాతన
షో రూమ్!
PHONE:
62420
కామధేను
టెక్స్‌టైల్ కాంప్లెక్స్
మిల్లు వస్త్రముల ప్రత్యేక షో రూమ్
బీసెంట్ రోడ్డు,
విజయవాడ -520 002

లింట్లోనే నూతన దంపతులకు [illegible], మూడు నిద్రలు ఏర్పాటు చేశారు.

నాల్గవరోజు విమల ఇంటికి సాగనంపారు ఆ మిత్రులు. వాకిట్లోనే వున్నాడు విమల తండ్రి—కులంగానివాడ్ని చెప్పకుండా పెళ్ళి చేసుకుందని గుండెలు మండాయి. చర్రున లోపలికి వెళ్ళాడు. దంపతులు విమల తల్లికి పాదాభివందన చేయడానికి వంగారు. వెనుకనుంచి పళ్ళు కొరుకుతూ, తిడుతూ, కర్రతో రవి తలపై బాదాడు విమల తండ్రి. దెబ్బల వర్షం కురిపించాడు. తల్లి కూతురు అడ్డుపోయినా ఆగలేదు. రవి తల పగిలి రక్తం ప్రవాహమైంది. అతను స్పృహతప్పి పడిపోయాడు. రవిని విడిచి విమలపై ఆ కర్ర పడింది బలంగా. దెబ్బపై దెబ్బ పడుతుంది. భరించలేక కేకలు బొబ్బలుతో మతిపోయి "నాన్నా! వారిని ఏమి చేయకండి, నన్ను కొట్టండి చంపండి" అని ఉన్మాదంగా కేకలు పెట్టింది విమల.

తండ్రి తరుముతూ బాదుతూ వెంటపడ్డాడు. విమల బయటకు పరుగెత్తింది. తల్లి అడ్డుపడినా కొట్టి త్రోసివేశాడు ఆ తండ్రి. వాకిట్లో బావి వుంది. ఆ బావి చుట్టూ తండ్రి కూతుళ్ళు పరుగులుదీస్తున్నారు. ఆ తండ్రి మానవత్వం కోల్పోయి రాక్షసత్వంతో, బావిపైనుండే కర్రతో బాదాడు. విమల తలపై బలమైన దెబ్బ తగిలింది. బాధ భరించలేని విమల అయోమయంగా బావిలోకి దూకేసింది. ఆ సంఘటనతో సనాతన సాంప్రదాయపు నిషాదిగి మానవత్వం, మమత వెలికివచ్చి కూలబడిపోయాడుతండ్రికన్నీరుగారుస్తూ.

మిత్రులకి తెల్పి రవిని హాస్పిటల్‌లో చేర్చారు. నెలరోజులకిగాని రవి హాస్పిటలు నుండి బయటపడలేదు.



విమల తల్లి మంచెం పట్టింది. "మనం పెళ్ళి చేయలేకపోయాం. దానంతట అది పెళ్ళి చేసుకువస్తే ఆదరించలేని కఠినాత్ములమయిపోయాం" అని ఏడుస్తుంటుంది. ఆ తండ్రి, "నాకు మాత్రం బిడ్డ ప్రేమ లేదా! ఐదుగురు ఆడపిల్లలు—దౌర్భాగ్యులం. వీరిని ఎలా కడతేర్చాలా అని సతమతమౌతుంటే కులంగాని కులం కుర్రవాడ్ని చేసుకుంటే యీ సంఘం మనల్ని బ్రతకనిస్తుందా? అన్న భయంతో, కోపం కట్టలు తెంచుకొని—రాక్షసుడినై చేతులారా నా బిడ్డని చంపుకునే రాక్షసుడిని" అంటూ కుమిలిపోయాడు.

ఇది కథగాదు. నిజంగా ఇది జరిగిన యదార్థం. కళ్ళతో చూసిన నిజం.

తీయటి దాంపత్యంతో జీవితాన్ని సాగించాలని కలలుగన్న విమలకి, మిత్రురాలు ప్రసాదించిన, ఆ మూడు రాత్రులే దక్కాయి. అంత అన్యాయంగా మూఢాచారాలకు బలియై పోయింది ఆ యువతి.

ఇలా ఎంతమంది సమాజంలో తమ జీవితాలను బలిచేసుకుంటున్నారో, మూఢనమ్మకాలతో, మతమూ, కులమూ అనే పిచ్చి భావాలతో ఇంకా ఇంత అజ్ఞానంలో వున్నవారు సంఘంలో చాలామందే వున్నారు మరి!

ఈ సమాజం మారేదెపుడు? యువతీ యువకులు మనసిచ్చి ఒకరినొకరు అర్థం చేసుకొని, కోరినవారిని వివాహమాడి వారి ప్రేమ పంటలు పండించే రోజుల ఎప్పుడు వస్తాయి?

("రవి, విమల అసలు పేర్లు కాద పేర్లు మాత్రం కల్పించబడ్డాయి. సంఘటనలు మాత్రమే యదార్థం. —రచయిత్రి.

# పలు రంగాలలో ఆంధ్రప్రముఖులు

భారతదేశంలో అత్యున్నత పదవిని అలంకరించిన డా॥ వి. వి. గిరి గారిని గురించి ప్రత్యేకంగా పరిచయం చెయ్యవలసిన అవసరంలేదు మేము. ఆయనతో జరిపిన ఇంటర్వ్యూ విశేషాలు తెలిపే ముందు చాలా క్లుప్తంగా ఆయన జీవిత విశేషాలు అందిస్తున్నాము.

తూర్పు గోదావరి జిల్లాకు చెంది, తర్వాత ఒరిస్సా లోని బెర్హాంపూర్‌లో నివాసం ఏర్పరచుకొన్న తెలుగువారు శ్రీ వి. వి. జోగయ్య పంతులుగారి పుత్రుడు శ్రీ వి.వి. గిరి. 1894 ఆగస్ట్ 10 న జన్మించిన ఈయన చాలా చిన్నతనానే ప్రజాసేవా కార్యక్రమాలలో ప్రవేశించారు. స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్నారు. కార్మిక సమస్యలపై ప్రత్యేక శ్రద్ధ తీసుకొన్నారు. శ్రీ గిరి సామర్థ్యం గురించి ప్రముఖ ఆర్థిక శాస్త్రవేత్త సి. డి. దేశ్‌ముఖ్ "కార్మిక సమస్యల గురించి శ్రీ గిరికి తెలియని విషయమేమైనా ఉంటే, అది తెలుసుకోను కూడా అవసరం లేనట్టిది మాత్రమే" అనడం శ్రీ గిరి కార్మిక సమస్యలపై ఎంత అథారిటీ గల వ్యక్తో నిరూపిస్తుంది. అతి చిన్న వయసు లోనే యంగ్‌మెన్స్ లైబ్రరీ అసోసియేషన్ ప్రారంభించి గ్రంథాలయోద్యమానికి శ్రీకారం చుట్టారు ఈయన. రైల్వే కార్మికులకు నాయకత్వం వహించి వారి సంక్షేమం కోసం శ్రీ గిరి జరిపిన కృషి, ఆయన నాయకత్వ ప్రతిభా ఆయనకు లేబర్‌లీడర్‌గా తిరుగులేని సమర్థుడన్న పేరు సంపాదించి పెట్టాయి. ఆ తర్వాత గిరి రాజకీయ జీవితంలో పలు రకాల పదవులు నిర్వహించారు. అనేక సందర్భాల్లో జైలు శిక్ష అనుభవించారు. రాష్ట్ర మంత్రిగా, కేంద్ర మంత్రిగా, సిలోన్‌లో భారత హైకమీషనర్‌గా, ఉత్తరప్రదేశ్, కేరళ, మైసూరు (ఇప్పటి కర్ణాటక) రాష్ట్రాలకు గవర్నరుగా, భారత ఉపరాష్ట్రపతిగా పదవులు నిర్వహించిన శ్రీ గిరి, రాష్ట్రపతి కావడం ఎంత సంచలనాత్మకంగా జరిగిందో పాఠకులకు తెలుసు. ఇప్పుడు శ్రీ గిరి మద్రాసులో నివసిస్తున్నారు. ఇప్పటికీ ప్రజాసేవా కార్యక్రమాలలో పాల్గొంటున్నారు.

* * *

'దారిద్ర్యమూ, నిరుద్యోగమూ నిర్మూలించడం మన ప్రధాన ధ్యేయం' అని అభిప్రాయ పడుతున్న శ్రీ గిరి 'ఆ సమస్యలు ఇంకా మనం పరిష్కరించుకోలేక పోయాం' అన్నారు. శ్రీ గిరి దైనందిన కార్యక్రమాలెలా ఉంటాయి. ఆయన సలహా కోసమూ, సహకారం కోసమూ రోజూ కనీసం పాతిక పైగా ఉత్తరా

---

ఇంటర్వ్యూ : వి. లీలావతి రాఘవయ్య



శ్రీ వి. వి. గిరిని ఇంటర్వ్యూ చేస్తున్న జ్యోతి మేనేజింగ్ ఎడిటర్
శ్రీమతి వి. లీలావతి రాఘవయ్య

లొస్తాయి ఆయనకు. కార్మిక సంఘాలు, రాజకీయ వేత్తలూ, విద్యార్థులూ అంతే కాదు వ్యక్తిగత సమస్యలు ప్రస్తావిస్తూ ఎంతోమంది రాస్తుంటారట. "24 గంటల లోపు ఉత్తరానికి జవాబు ఇచ్చేస్తాను" అన్నారు శ్రీ గిరి. ఎప్పుడయినా స్టెనో రాకపోయినా స్వయంగానే వ్రాస్తారాయన.

మైసూర్ గవర్నర్‌గా ఉండగానే ఆయన బెంగుళూరు నగరంలో ప్రారంభించిన 'సిటీ క్లీనింగ్ కాంపెయిన్' (నగర పారిశుధ్యం కోసం కృషి) ఇప్పుడు మద్రాసులో ఆయన చేపట్టి, ప్రభుత్వ సహకారంతో కృషి చేస్తున్నారు. మొదట ఆయన ఈ పథకం ప్రారంభించినప్పుడు ప్రజాసంస్థలూ, ప్రభుత్వమూ అంత ఉత్సాహం చూపలేదట. కాని పట్టు వదలని శ్రీ గిరి ఆ కాంపెయిన్ కొనసాగించారు ప్రజల సహకారంతో. ఇప్పుడు ప్రభుత్వమూ సహకరిస్తోంది. "మీ ఇల్లు, మీ వీధి శుభ్రంగా ఉంచండి, మీ నగరం నందనవనంలా ఉంటుంది" అన్నది శ్రీ గిరి సందేశం నగరవాసులకు.

"పత్రికల బాధ్యత ఎలా ఉండాలనుకుంటున్నారు మీరు." అన్న మా ప్రశ్నకు-

"పత్రికల అభిప్రాయాలు ప్రజాస్వామిక పద్ధతిలో ఉండాలి. తాము విభేదించే అభిప్రాయాలున్న వారి గురించి రాసేటప్పుడు పరుషమైన పదజాలం వాడకుండా, ఎదుటి అభిప్రాయాలకు కూడా గౌరవం ఇస్తూ ఉండాలి. విమర్శ సద్విమర్శగా ఉండాలి తప్ప, కువిమర్శలకు చోటీయరాదు." అంటూ జవాబిచ్చారు శ్రీ గిరి.

మన ఆర్థిక స్థితి మెరుగు పడాలంటే

మనకు లభ్యంగా ఉన్న ప్రతి నేల చెక్కా-పంట పండేదిగా" చేసుకోవాలంటారు శ్రీ గిరి. గాంధీజీ కలలు కన్న గ్రామీణ పరిశ్రమల అభివృద్ధి (భారీ పరిశ్రమల అభివృద్ధి అలక్ష్యం చెయ్యకుండానే) వైపు దృష్టి సారించి ప్రజలు ఉత్పత్తి చేస్తే, మార్కెటింగ్ సౌకర్యాలన్నీ ప్రభుత్వం సమకూర్చాలని అభిప్రాయ పడతారాయన. ఆంధ్రుల గురించి ప్రస్తావించినపుడు కొంచెం బాధగానే ఇలా చెప్పారు శ్రీగిరి.

"ఆంధ్రులు అన్నివిధాలా సమర్థులు. కాని దురదృష్టవశాత్తూ వర్గతత్వమూ,కుల మత విభేదాలూ, ఈర్ష్యాస్వభావమూ మనలో సమసిపోవడం లేదు. కలసి కట్టుగా ఉండలేని బలహీనత ఆంధ్ర జాతిని పీడిస్తోంది. ఈ 'చెడు'ను వది బయటికొస్తుంది. రాష్ట్రానికీ, దేశానికి కూడా ఎంతో మేలు జరుగుతుంది."

వయసు ఎనభై దాటినా ఉల్లాసంగా, ఉత్సాహంగా, ఆరోగ్యంగా కన్పిస్తారు శ్రీ గిరి. ప్రజాసేవ కూడా ఒక వ్యసనం లాటిదే. అందుకేనేమో రాష్ట్రపతి పదవి నిర్వహించిన ఈనాయకుడు వృద్ధాప్యంలో (ఆరు దశాబ్దాలకు పైబడిన యాక్టివ్ లైఫ్ గడిపి) కూడా రిలాక్సై అవలేక పోతున్నారు. నిరంతరం ప్రజల సమస్యల గురించి ఆలోచిస్తూ, తనకు సాధ్యమైన పరిధిలో ప్రజాసేవ కొనసాగిస్తున్నారు ఆయన ప్రారంభించిన "సిటీ క్లీనింగ్ కాంపెయన్" పూర్తి ఫలితాన్నిచ్చినప్పుడు సుందరమైన మద్రాసు నగరంలో ఆయన కృషి శోభిల్లుతూ కన్పిస్తుంది. ***

'కళావాహిని' 5వ వార్షికోత్సవ సభలో మంత్రి శ్రీ మండలి వెంకటకృష్ణారావును సత్కరిస్తున్న కళావాహిని వైస్ చైర్మన్ శ్రీ ఎల్. వి. రామయ్య.





ప్రశాంత

# అనర్హతకు హద్దు

కాలేజీ వరండాలో నిలబడి 'సైన్స్ టుడే' తిరగేస్తూ ఎందుకో తలెత్తి చూస్తే ఎదురుగా రాధ కనబడింది.

రాధా కాదా అని నాలుగయిదుసార్లు పరిశీలనగా చూశా.

అనుమానం లేదు. అదే రాధ!

ఏమిటి రాధ ఇక్కడికి ఎందుకు వచ్చింది? దేనికి వచ్చినట్లు? అసలు నేను చూస్తున్నది ఆమెనా కాదా?

ఇంకాస్త దగ్గరికి వచ్చాక మరోసారి చూశా. క్రీంకలర్ చీరమీద బంగారు గులాబీల ఎంబ్రాయిడరీ. భుజానికి వ్యానిటీ బాగ్. లోకంలో దేన్నీ లెఖ్ఖచెయ్యని అడుగుల వేగం. పోతన కందాలకి రాధ అడుగులకి రిథమ్ ఎప్పుడూ తప్పదు.

రాధ ఫిజిక్ లో మ్యాజిక్ ఏమిటోగానీ ఆమెను ఒకసారి చూస్తే అంత త్వరగా మరపలేరు. తలంటుకున్న వెంట్రుకలను చివరనుంచి పైకితీసి రిబ్బన్ తో కనిపించ కుండా లూజ్ గా పైన ముడివేసింది.

వానలో చిందులేసే పిల్లల ముఖంలో ఆనందం అవి భుజాలమీద గెంతడంలో కనిపిస్తున్నది.

మెడ కింద ఆర్క్ లా కట్ చేసిన

పాల్ గదిలోకి వెళ్ళింది.

బి. ఎస్. సి. ఫస్ట్ ఇయర్ క్లాసులో పాఠం చెప్తున్నా. మనస్సు నిలకడలేదు. ఎలాగో ముగించి లాబ్‌కి వెళ్ళా.

రాధతో పరిచయం రాధమీద ఆవేశం రాధకోసం ఆవేదన ఇవాళ్టిది కాదు.

ఒకే క్లాసులో కాకపోయినా ఒకే స్కూల్‌లో నాలుగేళ్లు చదివాం. ఆ రోజుల్లోనే ఆమెమీద అర్థంగాని ఆకర్షణ. ఎక్కడన్నా మాట్లాడుతుంటే కాస్త దూరంలో నిలబడి ఆమెను గమనించే వాడ్ని. స్కూల్‌ఫైనల్ రోజుల్లో ఆమెని ఫైనల్‌గా ప్రేమిస్తున్నానని అర్థం చేసుకొన్నా.

మళ్ళీ బి. ఎస్. సి. చదివే రోజుల్లో హఠాత్తుగా కాలేజీలో సాక్షాత్కరించింది. నేనేరోజుల్లోనూ పెద్ద మెరిట్‌తో పదిమందిలో గొప్పగా కనిపించేవాడ్ని కాదు. కాకపోతే అడపా దడపా కథలు రాసి పత్రికల్లో వస్తే కొద్దిమంది ఫ్రెండ్స్‌లో కాలరెత్తి మరువారం పత్రిక వచ్చేదాకా తిరిగేవాడ్ని. రాధ అన్న నందనరావు ఎల్. ఐ. సి. ఆఫీసర్. మా నాన్నగారు ఏజంటు. ఆ సందర్భంగా ఒకటి రెండు సార్లు వాళ్ళింటికి వెళ్ళడం తటస్థించినా అది మామధ్య పెద్దగా స్నేహాన్ని స్థాపించలేకపోయింది.

రాధలో గొప్పదనం ఏమిటోగానీ ఆమె వెనక తన గురించి ఎంత ఆరాటపడి ఆలోచించేవాడ్నో ఎదురుపడితే అంతగా మూగపోయేవాడ్ని.

రాధ ఒక్కర్తే ఉంది. ఎక్కడో బయటకి వెళ్ళబోతున్నది. వచ్చిన పని చెప్పి మర్యాదకోసం కాసేపు కూర్చున్నా. అంత హాయి అయిన వాతావరణంలో రాధతో ఏవేవో మాట్లాడాలని తపన. కానీ నా భావాలు అలల తాకిడికి ఇసుకలా జారిపోతున్నాయి.

'ఎక్కడికో వెళ్ళాలనుకుంటున్నట్లున్నారు?'

'అవును.'

'సినిమాకా?'

'సాయంత్రాల్ని సినిమా హాల్లో హత్య చెయ్యడం అంటే నాకు ఇష్టం ఉండదు. కానీ ప్రతివాళ్ళూ సాయంత్రం అయితే ఇంక అతొక్కడి ఉక్క దొరకదేమో అన్నట్లు సినిమాకి పరిగెత్తేస్తారు" రాధ సోఫా వీపుమీద మోచేత్తో అనుకొని మాగజైన్ తిరగేస్తున్నది.

'ఆ పత్రిక చదివారా?'

'ట్రాష్! ఏం ఉంది చదవడానికి' నా ఉత్సాహం చప్పగా చల్లారిపోయింది. చెప్పబోయింది చెప్పకపోవడం మంచిది అయింది.

'మోహన్ వస్తానని చెయ్యి ఇచ్చాడు.'

'పాపం ఎక్కడయినా అవసరం అయిన పనిమీద ఆగిపోయాడేమో!' ఆగిపోవాలని నా ఆశ కానీ లోలోపల ఆ పేరు నన్ను కాల్చేస్తున్నది.

'ఈ మగాళ్ళంతా అంతే! మీకేం పని లేకపోతే అలా షికారు వెళ్దాం. అయితే సినిమాకి మాత్రం కాదు'




రాధతో పార్క్‌కి బయలుదేరా. నాలుగు మొక్కలు రేడియో తలనొప్పి మధ్య ఆమెకి ఆనందం ఏమిటో నాకు అర్థంగాలేదు.

పార్క్‌లో కల్పన కనిపించింది. ఇద్దరూ మాటల్లో పడ్డారు అర్థగంటసేపు ఆహ్వానింపబడని అతిధి పాత్ర ధరించాల్సి వచ్చింది.

'ఏమిటి మూర్తిగారూ! బోర్‌గా ఉందా, ఏం మాట్లాడటంలేదు' కల్పన అంది. రాధమాత్రం ఏం అనలేదు. కాస్త పని ఉందని బయటకి వచ్చేసి అమ్మయ్య అని గాలిపీల్చా.

కాలేజీ యానివర్సరీ రోజులు. నేను రాసిన చిన్న స్కిట్‌కి రిహార్సల్స్ జరుగుతున్నాయి. రిహార్సల్స్ అయాక హాస్టల్‌కి ఆలస్యంగా చేరాం

రవి రంగనాథ్ విశ్వంనాయుడు సిగరెట్లు కాలుస్తూ పిచ్చాపాటీలో పడ్డాం. మాటలమధ్యలో ఎలాంటి ఆడది అందగత్తె అని టాపిక్ వచ్చింది. కారణం ఆవేళ ఊళ్ళో వైజయంతిమాల సినిమా ఆడుతున్నది

విశ్వం వైజయంతిని ఆకాశానికి ఎత్తేస్తున్నాడు. నాయుడు వహీదా, మీనాకుమారీ పర్‌ఫెక్ట్ బ్యూటీకి గీటురాళ్ళు అంటున్నారు. ఆ వ్యవహారం అలా అలా సాగి మా కాలేజీ అమ్మాయిలమీదకి మళ్ళింది.

లత సునంద అజంత రజని రాధ ఇలా ఎందరో మాటల్లో దొర్లారు. రవి వాదంలో అఖండుడు అవడంవలన లత సూపర్ బ్యూటీగా నిర్ధారింపబడే ప్రమాదం కనిపించింది.

'అందం అంటే రాధ! అంతే' నేను కల్పించుకున్నా. నాయుడు నన్ను సైడ్ చేశాడు.

కన్నా మన తెలుగుతెర హీరోయిన్ రాధిక నయం.'

'షటప్! రాధగురించి నీకేం తెలుసు. ఎలిజిబత్ టైలర్‌నుంచి మధుబాలదాకా అందరి కొలతలూ నాకు తెలుసు. రాధ మెజర్‌మెంట్స్ ఏ బ్యూటీ స్పెషలిస్ట్ అయినా అంగీకరించాలి. రాధ ఫిజిక్‌లో అందమేగాదు ఆమె టేస్ట్‌లు స్వభావం ఉషారు తత్త్వం తెలివితేటలు మేధస్సు- ఎవర్తో అయినా పోల్చుకో. తిరుగులేదు.'

'నీ మొహం! రాధ చురుకయినదని నువ్వు అనాలి.'

'తెలీకుండా వాగకు' అని ఆమెని ఎన్నోసార్లు కలిసినట్లు ఆ సందర్భాల్లో ఆమె ఎంతో తెలివిగా షార్ప్‌విట్‌తో మాట్లాడినట్లు చెప్పా. గంటసేపు ఆగకుండా సాగిన నా ధాటికి ఎవరూ కిక్కురుమనలేకపోయారు.

మా వేడి చల్లారేసరికి రాత్రి నాలుగయింది.

'ఎక్కడో పడుకుని హాయిగా నిద్రపోతున్న వాళ్ళకోసం నిద్రలు చెడగొట్టుకొని మనం పోట్లాడుకోడం ఏమిటి! ఇంక పడుకోండి' అని విశ్వం లేచాడు

ఫంక్షన్ జరుగుతున్నది. అవేళ ఆఖరి రోజు. నా పిక్చర్ అయిపోయింది. గ్రీన్ రూంలోనుంచి బయటకి వస్తుంటే రాధ కనబడి పిలిచింది.

'ఏమిటి మొన్న నా గురించి మాట్లాడారట?'

• •

'మీరింత సెన్స్‌లేని మనుషులనుకో మనిద్దరం కలిసి హైదరాబాదు వెళ్ళామా? బుచ్చిబాబులా మీరు రాస్తారన్నానా? నాకు జ్వరం వస్తే మీరు డాక్టర్ని తీసుకొచ్చారా? మా ఇంటికి పిలిచి పరీక్ష ప్యాసయినందుకు పార్టీ ఇచ్చానా? మీకు అసలు కొంచం అయినా బుద్ధి ఉందా' నా మెజర్‌మెంట్స్ మీకు తెలుసా? మీరు నా గుడ్డలు కుట్టారా? ఉతికారా?——

'రాధా.'

'షటప్!మరోసారి నా పేరు నాప్రశక్తి మీనోట వచ్చినట్లు తెలిస్తే మంచిదిగాదు. ఇది మన ఇద్దరి శ్రేయస్సుకోసంచెప్తున్నా' అనేసి రాధ అసహ్యకరంఅయిన ఓచూపు విసిరి వెళ్ళిపోయింది.

రాధమీద మంటకి లోపల్నుంచి సెగలు వస్తున్నాయ్. నడిరోడ్డు మీద కాలవలో పడి అవమానం పొందినంత కుంగిపోయా. గదికి వచ్చే సరికి జ్వరం వచ్చింది.

వారం రోజులు మంచం దిగలేదు

ఊళ్లోకి కొత్త సినిమా వచ్చింది. నేను ఐదింటికే వెళ్ళి నాలుగు టిక్కెట్లు సంపాదించి రవీ వాళ్ళ కోసం ఎదురు చూస్తున్నా. రాధ నావేపు రావడం చూసి కావాలని పెడమొహంగా నిలబడ్డా

'మూర్తిగారూ! ఊరునుంచి చుట్టాలు వచ్చారు. టికెట్లు దొరకలేదు. పరువు పోయేట్లుంది. ఏం చెయ్యడం?' పోయి గంగలో దూకమందామనుకున్నా. కానీ ఏం మాట్లాడలేదు. ఏం మాట్లాడకుండా చేసిందేమిటో తెలీదు.

చీకటి ఆకాశంలో నక్షత్రాల్లో నల్ల

సిగరెట్లు ఊల పాట్లు




చీరమీద చిమ్కీపూలు మెరుస్తున్నాయి. అష్టైశ్వర్యాలు కటికి దరిద్రం పక్క పక్కన ఏమాత్రం కలవకుండా ఉన్నట్లు రాధ తెల్లటి భుజాలమీద మెడకింద నల్లటి జాకెట్ తళుక్కుమంటున్నది. ఆమె తనున్న స్థలం చుట్టూ గిరిగీసినట్లు ఆమె చుట్టూ ఏదో కమ్మని కాస్మటిక్స్ కలగలుపుల వాసన.

రాధ అక్కడ నిలబడివుంటే ప్రతి వాడూ పని ఉన్నట్లు చుట్టూ తిరుగడం.

ఆరోజు కాలేజీలో అంత కేర్‌లెస్‌గా మాట్లాడి అసలేం జరగనట్లే ఎంత అభిమానంగా మాట్లాడుతున్నది! తన అవసరం కోసం వాడ్తున్న ట్రంప్ కార్డా?—

టిక్కెట్స్ లేవు పొమ్మంటే ఏం చేస్తుంది? ఏడుస్తూ ఇంటికి వెళ్తుంది. కానీ, రాధని ఏడిపించి ఇంటికి పంపలేని అసహాయత. వివేకాన్ని అభిమానం మింగేస్తున్న క్షణాలు.

ఆల్ రైట్! ప్రయత్నిస్తా.

నాన్సెన్స్! ఇక్కడున్న ప్రతివాళ్లూ అందుకే వచ్చారు. నాకు కావాల్సింది ప్రయత్నం కాదు టిక్కెట్లు.

జేబులోంచి టిక్కెట్లు తీసి ఇచ్చా 'మాఫ్రెండ్స్ కోసం తీసుకొన్నా.

'అబ్బ! మీరు భలేమంచి వారండీ. మీకేం మీరు మగాళ్ళు. ఇవాళ కాకపోతే రేపు చూస్తారు' పాపం వీళ్ళు మాత్రం ఇవాళే చూడకపోతే భూమి తల్లకిందలయి పోతుంది గాబోలు.

'టిక్కెట్లు ఉంచుకొని నాటకం ఆడినందుకు పెనాల్టీ ఏమిటో తెలుసా, డబ్బులు ఇయ్యాను.

'ఇది చాలా అన్యాయం'

'మీరు మహాన్యాయపరులు! పరాయి ఆడవాళ్ళ గురించి వాళ్ళకి తెలీకుండా

గంటల కొద్దీ లెక్చర్లు దంచడం న్యాయమా?'

రాధ అనుకోకుండా అడిగిందానికి మళ్ళీ నాలో ఉత్సాహం ఒడ్డుకు కొట్టుకొని పడిపోయిన కెరటంలా కూలిపోయింది.

'అరె! అదేమిటి అలా అయిపోయారు! మళ్ళీ ఇంటికెళ్ళి జ్వరం తెచ్చేసుకొంటారా? రామరామ మీరెలా బ్రతుకు వారండీ?' అని రాధ వెళ్ళిపోయింది

వరసగా పదకొండు ఫ్లాప్ చిత్రాల్ని చవిచూసిన హీరోలా నిలబడిపోయా.

ఆవేళ ఆఖరు అవర్ సెలవు. హాస్టల్‌కి వచ్చేసరికి నాకోసం కవరు ఎదురు చూస్తున్నది.

మూర్తిగారికి!

ఇంకా కులాసాగా ఉన్నట్లు తెలిసింది. మళ్ళీ నేను కనబడితే జ్వరం తెచ్చుకుంటారని ఉత్తరంతో సినిమా టిక్కెట్లడబ్బులు పంపుతున్నా.

'రాధ'

రాధ నన్ను లైక్ చేస్తుందా లేదా?—— అర్థం కావడంలేదు ఎలా తెలుసుకోడం? రాధ డామినేటింగ్ స్వభావం ముందు ఎదురీద లేకపోతున్నా. వదిలి మరచిపోలేకపోతున్నా.

ఈ సమస్యకి పరిష్కారం ఉందా? లేక ఇది సమస్య కాదా? అంతకన్నా అతీతం అయిందా?

మళ్ళీ యూనివర్సిటీ ఫైనలియర్‌లో సైన్స్ ఎగ్జిబిషన్‌లో రాధ తారసపడింది. రాధనుంచి సాధ్యం అయినంత దూరంగా ఉండటానికి ఆ రూపాన్ని మనస్సులోనుంచి తుడిచేయటానికి ఎంత ప్రయత్నిస్తున్నా ఫలించడంలేదు.

ఇది విధి నాతో ఆడుకోడమా? బలహీనతలతో నేను ఆడుకోవడమా? రాధ విషయం వస్తే ఎన్నో ప్రశ్నలు ప్రశ్నల బోనులో ఊపిరాడక చిక్కుకుపోతుంటాను.

కొంత మంది స్టూడెంట్స్ తయారు చేసిన ట్రాన్సిస్టర్‌ని నేను గైడ్‌గా వివరిస్తున్నా.

'ఆ ఇక మీరు చెప్పండి' అంది నా దగ్గరికి వస్తూ. ఆ అనడంలో అదో ఆకర్షణ అహం రెండూ ఉన్నాయి

ఆ అహాన్ని జయించాలని ఆకర్షణని ఆస్వాదించాలని తపన.

అప్పటిదాకా మిగిలినవారికి ఎంత చక్కగా వివరించానో ఆమెకి ఎంత చప్పగా వివరించానో నాకు తెలుసు

'ఇంతేనా ఇంకేమన్నా ఉందా?'

'మీరు ఆర్ట్సువాళ్ళుగదా అని క్లుప్తంగా చెప్పా'.

'అలా నా మొహానరాసి ఉందా' అభిరుచికి చదువులకి మధ్య రేడియోకి టివికి ఉన్నంత తేడా ఉంది.

యూనివర్సిటీ వారు డిగ్రీ కాగితం అందించబోయే రోజులు దగ్గరవుతుంటే వెళ్ళిపోయిన వయస్సు ప్రపంచంలో బ్రతకడానికి కష్టాలు గుర్తుకువచ్చాయి.

యూనివర్సిటీ విడిచివెళ్ళిపోయే ఆఖరు రోజున రాధ లైబ్రరీ బయట కనబడింది. ఇంక జీవితంలో తారసపడదు. ఇన్నాళ్లూ ఎదురుగా ఉన్న వ్యక్తిని కావాలనుకున్నా అక్కర్లేదనుకున్నా. అన్నీ నాలోనే.

రెడ్డీ రమేష్ నేనూ వస్తుండటం చూసి

రాధ ఆగింది. ఆమె రెడ్డిని చూసి సాయంత్రం ప్రోగ్రాం గురించి విశ్వానికి గుర్తు చేయమంది. వాళ్ళిద్దరూ బాటనీ ప్రొఫెసర్‌ను చూసి ఆయన్ని కలవడానికి వెళ్ళారు.

'మీరు ఎప్పుడు వెళ్తున్నారు?' ఆమే అడిగింది.

'రేపు వెళ్తున్నా. పదేళ్ళ మనపరిచయం రేపట్నించి చిత్రంగా విడదీస్తుంది. జీవితం ఎంత గమ్మత్తు అయిందో చూశారా?'

'కలవమని ఎక్కడఉంది? కలవచ్చు కలవకపోవచ్చు: ఈ రెంటిలో ఏది జరిగినా మనిద్దరికీ నష్టంలేదు. ఎందుకంటే ఇన్నేళ్లు కలిసి ఉండి సాధించిందిలేదు. ఇంక విడిపోయి పోగొట్టుకునేదీ లేదు.'

'నేను అలా అనుకోడంలేదు!'

రాధ ఎటో చూస్తున్నది పంటికింద రాయిలా కాలం ఇరుగ్గా బెరుగ్గా సాగుతున్నది

'దీని తర్వాత రీసర్చి చెయ్యాలనుకుంటున్నారా?'

'వేస్ట్! ఎల్ఐసి కెరీర్ ఏజంటుగానీ లేదా లెక్చరర్' ఆమె నా సంగతి అడగలేదు.

'రేపు ఇంట్లో ఉంటారా?'

'ఎవరు? అన్నయ్యా? ఫోన్‌చేసి కనుక్కోండి.'

'మీరు?'

'రేపు బోలెడు పనులున్నాయి. చాలామంది ఫ్రెండ్స్ వెళ్తున్నారా? 'స్టేషన్‌కి వెళ్ళాలి. మరివస్తా బై' రాధ మెట్లమీద నుంచి అలలా దూకుతూ మాయం అయిపోయింది.

రాధమీద విపరీతం అయిన కోపం వచ్చింది. ఆమె తలపొగరు అణచాలనిపించింది. కానీ ఎలా? నేనెవర్ని తలపొగరు అణచడానికి? ఆమెకి తలపొగరు ఉంటే మధ్య నాకేమిటి?

రాత్రి పన్నెండు దాటుతున్నా హాస్టల్ గదుల్లో గందరగోళంగా ఉంది. తెల్లారి అందరూ వెళ్ళిపోవాలి గాబట్టి వీడ్కోలు విషాదాలు ఆనందాలు పాత జ్ఞాపకాలు మాటల్లో మూగచూపుల్లో కంటి తడిలో రకరకాలుగా బయటకి వస్తున్నాయి.

నాకు ఏదో గుర్తువచ్చి విశ్వం గదికి వెళ్ళా.

మంచంమీద పడుకుని ఫిల్టర్ సిగరెట్ కాలుస్తూ రింగులు వదుల్తున్నాడు. ట్యూబ్ లైట్ కాంతిలో వాడి కళ్ళెందుకో తెగ మెరుస్తున్నాయి. రాధతో సినిమాకి వెళ్ళి వచ్చానన్నాడు. నా అనుమానం నిజం అయింది. రాధ ఫ్రెండ్స్‌తో వచ్చిందట. మాటల్లో ఆమె పక్కనే కూర్చున్నట్లు చెప్పాడు.

'మూర్తీ! ఆవేళ నువ్వన్నట్టు సృష్టిలో గొప్ప వింతరా రాధ! ఎవడు కొట్టేస్తాడో గానీ వాడ్ని మించిన అదృష్టవంతుడు ఉండడు.'

'సరేలే' అట్లాంటివాళ్ళకే వెంకటప్పయ్యలు దొరుకుతారు '

నామాట పట్టించుకున్నట్లులేదు. 'నీకు తెలీదుగానీ నేను గొప్ప దురదృష్టపు వెధవని. చాలా ఆలస్యంగా కలిసా. జోక్స్ ఆవిడ ఊపిరా అనిపిస్తుంది. ప్రతి విషయాన్ని ఎంత షార్ప్‌గా ఆలోచిస్తుంది.

అందం అంటావా? రంభ ఊర్వశి

నుంచి మధుబాల వైజయంతి రాధ బట్టలు ఉతకడానికి పనికిరారు.'

'మరి నువ్వు?'

'ఈడియట్! నాలాంటి వెధవలు నీతో సహా ఆ నీడలో నిలబడటానికి గూడా పనికిరారు.'

'కొంపదీసి ప్రేమిస్తున్నావేమిటి?'

'నువ్వుమాత్రం ప్రేమించడం లేదూ? కానీ ఉపయోగం ఏమిటి? పద టీ తాగి వద్దాం' రాధ సంగతి మళ్ళీ ప్రస్తావించ లేకపోయాను.

## 2

మళ్ళీ మూడేళ్ళ తర్వాత రాధను ఇక్కడ చూడాల్సి వస్తుందనుకోలేదు. జ్ఞాపకాలమరుగున భూస్థాపితం చేసిన రాధ మళ్ళీ వెలికి వచ్చింది.

రాధ ఇంగ్లీషు లెక్చరర్‌గా చేరి రెండు నెలలు అయింది. నాలుగయిదుసార్లు మాట్లాడినా పాత విషయాలు ఏం మాట్లాడ లేదు. కొత్త పరిచయస్థుడితో మాట్లాడి నట్లు మాట్లాడింది. ఏ కోణంనుంచి గూడా దొరకడంలేదు. పైగా నేనూ లెక్చరర్‌ని అవడంలో ఇప్పుడు కాస్త అహం అభి మానం పెరిగాయి. ఆఫ్టరాల్ రాధకోసం నా అంతవాడు అల్లాడటం ఏమిటని మనస్సు బాధపడ్డప్పుడల్లా సమాధానపరచుకోడానికి పెన్సిలిన్‌లా వాడ్తున్నా. కానీ తాత్కాలిక ఉపశమనం గూడా లేకుండాపోయింది.

ఆ రోజుల్లో పిరికిదనం. ఈనాడు రాధ దగ్గర నా భావాల్ని వ్యక్తీకరిద్దామంటే ఫలితం ఎలా ఉంటుందో అని భయం. కాదు పొమ్మంటే తల ఎక్కడ పెట్టుకో వాలి. ఇంకా కాలేజీలో ఎవరిదగ్గర అయినా తనిలా నన్ను కాదు పొమ్మన్నట్లు చెప్తే ఏమన్నా ఉందా?

నిన్నటిదాకా సంబంధాలు ఏవో చూసినా 'రాధ లేదోయ్! ఎడ్రస్ లేకుండా పోయిన దానికోసం ఏడుస్తూ చావడానికి నేనేం దేవదాసుని కాను!' అని నాలో ఎవరో చేసే ఎగతాళికి సమాధానం చెప్పేవాడ్ని. కానీ ఇప్పుడు??

కాలేజీ స్టాఫ్‌లో రమణ జుయాలజీ లెక్చరర్ అతనికీ రాధకీ ఎలా స్నేహం కలిసిందో తెలీదు. పొద్దస్తమానూ కలిసీ కనిపించేవాళ్ళు. స్టాఫ్ కబుర్లలో రమణ రాధ పేర్లు కలిపి జోక్స్ పుట్టినా ఇద్దరూ కేర్ చెయ్యలేదు. అంతకుముందుదాకా నా క్లాసులు నా పాఠాలు నా జీతం నా సైకిలు తత్త్వంలో బ్రతికిన రమణలో ఇంత మార్పు ఎలా పుట్టిందో అర్థంగాదు. అతనూ నేనూ కోరీలో పక్కపక్క గదుల్లో ఉంటున్నాం.

ఒకరోజు గదిలో అతనికీ సంగతి చెప్పా. చాలా కేర్‌లెస్‌గా నవ్వాడు. అందులో కొంత నాకూ ఉందని గింజు కున్నా. అప్పటిదాకా బాగున్న స్నేహం కాస్త సడలు ఇచ్చింది ఇద్దరం కాలేజీకి విడిగా వెళ్ళడం ఆరోజునుంచి ఆరంభం.

సాయంత్రం ఐదు అయింది. ఆబిడ్స్ సెంటర్ బాగా రద్దీగా ఉంది. పుస్తకాల షాపుదగ్గర నిలబడి వారపత్రిక పట్టుకొని పేజీలు తిరగేస్తూ నా కథ ఉన్న పేజీల దగ్గర ఆగిపోయా. ఆడవాళ్ళు షాపులో చీరలదగ్గర, రచయితలు తమ కథ వచ్చిన పత్రికలదగ్గర చూపించే బలహీనత ఇంతంత కాదు. ఆడవాళ్ళకీ రచయితలకీ




చాలా విషయాల్లో పోలిక ఉంది. ఆడదానికి ఇంట్లో ఎవరిమీదన్నా కోపం వస్తే వంటింట్లో గిన్నెలమీద చూపిస్తుంది. రచయితలు కోపం వచ్చిన వ్యక్తిమీద కథ రాసిపారేసి అచ్చులో చూసుకొని అణ్వస్త్రదేశాల్ని బడుగుదేశాలు జయించి నంతగా ఆనందిస్తారు.

భుజంమీద బలంగా పడ్డ చెయ్యిని చూసి తలఎత్తా. ఎదురుగా నందనరావు రాధ రాధ అన్నయ్యని చూసి చాలా రోజులు అయింది. మానసికంగా నాలో నలుగుతున్న పెద్ద సమస్యకి అతని రూపంలో పరిష్కారమార్గం దొరికిందా అని పొంగిపోయా.

ముగ్గురం కలిసి బృందావన్‌కి వెళ్లాం. నందనరావు నేనూ కబుర్లలో పడ్డాం. రాధ పత్రిక చూస్తున్నది.

రాధ మా మాటలమధ్య హఠాత్తుగా తల ఎత్తి "అన్నయ్యా! లెక్చరర్‌గారు పెళ్ళిచేసుకోబోతున్నారు తెలుసా?" అంది. చౌదరి ఒకరోజు మాటలమధ్య జోక్‌గా అంటే దాన్ని ఆమె నిజం అనుకున్నట్లుంది.

అతను వివరాలు అడిగాడు.

'ఇంకా ఏం స్థిరపరచలేదు. ఆమధ్య ఏలూరులో ఒకమ్మాయిని చూశా. కానీ పాపం బీదవాళ్ళు. వాళ్ళేగాదు ఎవరి అమ్మాయిని చేసుకున్నా కట్నంలేకుండా చేసుకోవాలనుకుంటున్నా' ఒక ఆడపిల్ల అన్నయ్యమీద ప్రయోగించడానికి ఇంత కన్నా పెద్ద ట్రాప్ అక్కర్లేదు.

రాధ నవ్వి అంది 'ఆదర్శంకోసమా? జాలితోనా?'

'రెండూ అనుకోండి' అని మళ్ళీ అన్నా 'అయినా ఎందుకు అలా అడిగారు?'

'ఆదర్శంకోసం కట్నం తీసుకోకపోతే

ఆదర్శానికి బానిసలు. జాలిపడి తీసుకోక పోతే ఆ అమ్మాయి భవిష్యత్‌కి మంచిది కాదు. పెళ్ళిని జాలికీ ఆవేశానికీ మొండి దనానికి ఎంతదూరంగా ఉంచితే అంత మంచిది.'

'ఇంతకీ అసలు అమ్మాయి ఎవరూ నిర్ణయం కాలేదు' అన్నా హఠాత్తుగా. నా జోక్‌కి నందనరావు భుజం చరిచి నవ్వాడు. అతను ఇంకా నాలుగురోజులు ఉంటాడట. నాలో ఆశకి ఊపిరి ఆడటం మొదలు పెట్టింది.

మూడురోజులు అయినా ఏం కబురు లేదు. రోజూ ఏదో రూపంగా రాధకి ఎదురుపడ్తున్నా. నాలుగోరోజు ఏదో పని మీద వెళ్ళినట్లు స్టేషన్‌కి వెళ్ళా. నందన రావు కలిసాడు. మామూలు విషయాలు తప్ప ఇంకేం దొర్లలేదు. బండి బయలు దేరింది. నా అంచనా ఫలితం అర్థం గాలేదు.

రమణ రాధ యథాతథంగా తిరుగు తున్నారు ఈమధ్య అనుకోకుండా బోటనీ శ్యామలతో పరిచయం కొత్త పెరిగింది. కానీ చిరాకువేసి తెంచేశా. కారణం ఆమెకి ఎంతసేపూ ఊరికబుర్లు ఇష్టం.

కాలేజీ టీమ్ తీసుకొని రమణ రాధ ఢిల్లీ వెళ్ళారు పదిరోజులు క్యాంప్. కాకతాళీయమూ కార్యకారణత్వమూ అర్థం గాలేదు. వీళ్ళిద్దరే కలిపి వెళ్ళడానికి వెనక జరిగిన తతంగం అంతుపట్టలేదు.

జీవితంలో ఉత్సాహం ఉద్రేకం చచ్చి పోతున్నాయి. ఏంచూసినా ఏంచేసినా ఎవరన్నా విసుగు కోపం అసూయ. ఛీ నేనేమిటి ఇలా తయారవుతున్నా? ఉద్యోగం మానేసి ఎటన్నా వెళ్ళిపోతే? నిజమే వెళ్ళచ్చు కానీ ఎక్కడికి ఎలా ఎందుకు?

రూర్కీనుంచి రెడ్డి వచ్చాడు. వాడు స్కూల్‌ఫైనల్‌దాకా క్లాస్‌మేట్. ఆ తర్వాత చిన్న కొట్టుపెట్టుకొని జీవితం మొదలుపెట్టాడు. ప్రస్తుతం ఢిల్లీలో ఆటో మొబైల్ స్పేర్‌పార్ట్‌లు చేసే చిన్న ఫ్యాక్టరీ నడుపుతున్నాడు. సంవత్సరానికి పదిలక్షల టర్నొవర్. లాభాలు బాగు న్నాయి. అనడానికి వాడిరూపం ఉత్సాహం ఉషారు చెప్తున్నాయి. ఏదో స్వంత పని మీద ఎవర్నో కలవడానికి వస్తే ఆ వ్యక్తి కోసం వారం రోజులు ఆగిపోవలసి వచ్చింది వాడిది స్వయానా మా ఊరు. ఒకసారి చాలా ఇబ్బందుల్లో ఉంటే నాన్న గారితో చెప్పి ఐదువేలు ఇప్పించా. అప్పటి దాకా కాకినాడలో ఫాన్సీషాపు నడిపేవాడు. ఆ డబ్బుతో విశాఖపట్నంలో కంగన్ హాల్ మొదలుపెట్టాడు. క్రమంగా నేను యూనివర్సిటీకి వచ్చేసరికి నైలాన్ నైలెక్స్ చీరలమీద ఎంబ్రయిడరీ వర్క్స్ చెయ్యడానికి బొంబాయినుంచి వర్కర్లని తీసుకొచ్చి కొత్త వ్యాపారం మొదలు పెట్టాడు. సరిగ్గా అక్కడే వాడికి దశ అందుకుంది. ఈమధ్య నాలుగేళ్ళుగా కలవ లేదు మళ్ళీ ఇవాళే కలవడం.

జీవితంలో రెడ్డి ఇంత ఉన్నత స్థాయికి రావడానికి ప్రథమ కారణం ఏం అంటే ఎలాంటివాళ్ళనయినా సరే ఒకసారి కలిస్తే వాళ్ళను బ్రహ్మాండంగా లోబరుచు కుంటాడు. పైగా ఆడవాళ్ళ విషయంలో పెద్ద ఎక్స్‌పర్ట్. అతని షాపుకి ఒకసారి




వచ్చిన ఏ అమ్మాయి అయినా తన కస్టమర్‌గా మార్చేసేవాడు. ప్రతివాళ్ళ టేస్టులూ కనుక్కొని వాళ్ళకి కావల్సినవి నష్టపడి అయినా తెప్పించేవాడు. ఒకటి రెండుసార్లు మా కాలేజిలోనే ఫ్రండ్స్ ప్రేమ కేసులు పట్టీకొట్టే స్థితిలో రెడ్డిని తీసుకొచ్చి విజయవంతం చేయించా. అతని టాలెంట్స్‌మీద నాకు చచ్చే నమ్మకం ఉన్నా రాధ సంగతి ఎప్పుడూ చెప్పలేదు. కారణం అభిమానం కొంత. ఆస్థిలో చదువులో వాడికన్నా గొప్పవాడ్ని అనే అహం కొంత.

రెడ్డి వచ్చి రెండురోజులు అయింది. రోజంతా ఊరు తిరుగుతున్నాం రాత్రిళ్లు బార్‌లోనే రెండు అయిపోతున్నది. మూడోరోజు జాగ్‌తేరహో సినిమానుంచి బార్‌కి వెళ్దామన్నాడు. నా మూడ్స్ సరిగా లేవు. కాదని గదికి తీసుకెళ్ళి రాధ సంగతి అంతా చెప్పి బావురుమన్నా. రాధను రమణగాడినుంచి తప్పించి నాతో ఆమె పెళ్ళి చేయిస్తే నా ఆస్థి అంతా వాడికి రాసి ఇచ్చేస్తానన్నా.

అంతా విని రెడ్డి అన్నాడు 'ఇంతకీ రాధ చెడిపోయిందంటావ్?'

'నాన్సెన్స్! చెడిపోయినట్లు రమణగాడికి నమ్మకం పుట్టించాలి.'

'నిజంగానే చెడిపోయిందేమో!'

'నో! రాధ అలాంటిది కాదు.'

'చెడిపోతే నువ్వా చేసుకోవ్? అంతేనా?'

'మరి ఇంకేమిటి?'

'రాధ చెడిపోలేదుగాబట్టి చేసుకొంటానంటున్నావ్. మరి నీ సంగతి? నువ్వేం పవిత్రుడివా?'

'పిచ్చిగా మాట్లాడకు. ఒళ్ళు మండుతుంది.'

ంధ చాలా ధైర్యంగలది. ఎంత పని అయినా చేస్తుంది అంటున్నావ్ గదా? మరి ఇప్పటిదాకా నువ్వు నమ్ముతున్నది అబద్ధం అని పెళ్ళిఅయిన కొంతకాలానికి తెలిస్తే?

నాకు కోపం లోలోపల భగభగ మంటున్నది. చిన్న సాయం అడిగానని రాస్కెల్ ఎంత మాట అంటున్నాడు?

'నేను పెద్దగా చదువుకున్నవాడ్ని కాను. పైగా నువ్వు రచయితవి. అసలు చెడిపోడం అంటే ఏమిటి?'

'నీ పిండాకూడు.'

'కోపం వద్దు! ఒకరోజు నీరజని తీసుకొని నా ఇంటికి వచ్చావ్ విశాఖలో. గుర్తుందా? మరి ఈ పాటికి ఆవిడకీ పెళ్ళి అయి ఉంటుంది. అంటే ఒక ఎక్స్‌గాడ్ చెడిపోయినదాన్ని చేసుకున్నాడు. తనకి తెలీకుండా అతను మోసపోయినట్లు నువ్వూ రాధా విషయంలో పట్టీకొడతా వేమోనని నా బాధ.'

పుస్తకాలు క్లాసులు రచన నాకు నేర్పిన విజ్ఞానంకన్నా లోకం అనుభవాలు రెడ్డిని ఇంకా ఎక్కువ నేర్పాయి అని అర్థం అయింది.

'ఇంతకీ నువ్వు నాకీ సాయం చేస్తావా లేదా?' కర్కశంగానే అడిగా.

'నీ ఇష్టం నాకే అభ్యంతరంలేదు. ఆ రమణగాడ్ని గంటలో మార్చెయ్యగలను. కానీ అంత ధాటీ తలపొగరు ఉన్న పిల్లని పెళ్ళాడి నువ్వేం సుఖపడ్తావని నా ప్రశ్న?'

'అది నేను చూసుకొంటా' అనేసి ఊరుకొన్నా.

తెల్లారుతుండగా ఇంటి నుంచి టెలిగ్రాం. అర్జంటుగా బయలుదేరు రమ్మని. కారణం ఏమీ తెలీదు. వెళ్ళడమా వద్దా?

రెడ్డి రంగంలో దిగబోయే సమయానికి నేను ఉండకుండా ఉండటమే మంచి దని వెంటనే బయలుదేరా. అతను నేను వచ్చేదాకా రూంలోనే ఉంటానన్నాడు. రమణ వివరాలు అన్నీ చెప్పి బండి ఎక్కాను.

*   *   *

వారంరోజులు అనుకున్న క్యాంపు పదిహేను రోజులు. ఆస్థిపంపకాల్లో ఆలస్యం తప్పలేదు.

హైదరాబాదు వచ్చేసరికి రెడ్డి లేడు. రమణ లేడు. పరిస్థితి ఏమిటో అర్థం గాలేదు. రమణ రాధ ఢిల్లీనుంచి వచ్చారు గానీ ఇద్దరూ శలవులో ఉన్నారు. రెడ్డి ఏం చేశాడో అంతుపట్టలేదు. కనీసం ఉత్తరం గూడా లేదు. రోజులు గడుస్తున్నాయ్.

అనుకోకుండా ఒకనాడు రాధ నుంచి ఉత్తరం—

డియర్ మూర్తీ!

జీవితంలో అనుకోని సాయంచేసిన నీకు చాలా కృతజ్ఞతలు. ఇవాళే రెడ్డికీ నాకూ ఢిల్లీలో పెళ్ళి జరిగింది. నాకు తెలీకుండా నా తరఫున అతనికి ఎన్నో వివరాలు వివరణలు అందించావు. రెడ్డి నన్ను కలుసుకోడానికి హైదరాబాదు వచ్చాడు. ఆ సంగతి ముందుగా నీకు చెప్పకపోవడంవలన అందరికీ మేలు జరిగింది—ఇన్‌క్లూడింగ్ యువర్ సెల్ఫ్!

ఈ సందర్భంగా ఉత్తరానికి పి.యస్.గా ఇంకో నాలుగు ముక్కలు




రాయక తప్పడంలేదు.

నీ అణువణువునా నాపట్ల అంతులేని ఆరాధన అభిమానం ఉన్నాయి. నా కోసం కావాలంటే సముద్రంలో అయినా దూకే స్తావ్. నాముందు నాకోసం కరిగిన మైనం కన్నా ద్రవీభవిస్తావ్. మైనంతో ఏ వస్తువు అయినా చెయ్యవచ్చు. కానీ మైనంతో అలా చెయ్యగానీ అది ఘనీభవిస్తుంది. ఒక వ్యక్తిత్వంతో నిలబడ్తుంది. అది నీలో లేదు.

నా పట్ల ప్రేమను ఒక్క నా దగ్గర తప్ప ఎందరిదగ్గరో చెప్పావు. అర్థిం చావు. ఏడ్చావు. ఆఖరికి మోసంతో అయినా వశం చేసుకోవాలనుకొన్నావు. ఎదురుగా ఉన్న నన్ను తప్పించి పక్క దారులు ఆశ్రయించిన నీ తత్త్వం గౌరవ నీయం కాదు. వ్యక్తిత్వం ఉన్న ఏ స్త్రీ ప్రశంసించలేదు.

ఒకరోజు రాత్రి విశ్వంతో విశాఖ హాస్టల్‌లో నా గురించి బ్రహ్మాండంగా ఆకాశానికి ఎత్తేశారు. అప్పటిదాకా మీమీద జాలి అసహ్యంగా మారింది మీ బాట మార్చమని పరోక్షంగా హెచ్చరించా. అలాగే ఎన్నోసార్లు మీకు అవకాశాలు ఇచ్చా. ఎవరూ ఉండని ఏకాంతాలు ఎన్ని ఇచ్చినా ఒక్కసారి మనస్సువిప్పి 'ఇదీనా బాధ' అని చెప్పే ధైర్యంలేక పోయింది.

ఆఖరికి మా అన్నయ్యదగ్గర కట్నం తీసుకోకుండా పెళ్ళాడబోతున్నట్లు డ్రామా ట్రిక్ వాడారు. చివరికి రెడ్డి కాళ్ళమీద పడ్డారు. ఇవన్నీ విభిన్నస్థాయిలో జరి గాయి. ఇందులో ఏ ఒక్కచోట ఆగి మిమ్మల్ని మీరు పరిశీలించుకున్నా బాగుం డేది ఆఖరికి రమణకీ నాకూ రంకు కలిపి లాభించాలనుకున్నారు, లోకం కొలబద్దలు

ఎవరో
ఎప్పుడో
బొంగరాన్ని
విసరేరు
అది
భూగోళమై
తిరుగుతోంది
మనం
ఈ శతాబ్దం
చివరినాటికి
ఏడువందలకోట్లు
అవుతామట
ఏడువందలకోట్లు
ఏ ఆట టీముకి
ఎక్కువై పోతారు
ఒక్క
కోరస్‌కే
కుదురుతారు
అందుకే
నేనంటాను
జెట్టాపట్టాలు
వేసుకుని
మానవతాగీత
పాడుకుంటూ
ఒకమై
అడుగులు
వేసుకుంటూ
ఈ గోళం
చుట్టూ
తిరుగుదామని
అది
చూపి
ఈ సూర్యమండలంలోని
గోళాలన్నీ
ఏమిటా
మేళతాళాలు
నిత్యసంబరాలు
అని
గుసగుసలాడుకోవాలి
మన
గోళం
అలా అలా
పిక్‌నిక్
బస్సులా
ఈ సూర్యుని
చుట్టూ
తిరగాల
చప్పట్లో
తాళాలో
ఈ విశ్వంలో
బాజాలు

---

సంఘం నిర్ణయాలు ఎప్పుడూ ఈ రాధను భయపెట్టవని మీకు పదేళ్ళ పరిచయంలో తెలీకపోవడంకన్నా మీ పసిదనానికి అద్దం అక్కర్లేదు.

రమణమీద స్కాండెల్ కధ రాస్తే రాధ మీ దగ్గరికి పరిగెత్తు కొస్తుందను కున్నారు. ఇదంతా నవలలు సినిమాలు మీమీద చూపించిన ప్రభావం కావచ్చు.

మూర్తీ! లోకంలో ఆరాధనకి విరామం అభిమానానికి ఎల్లలు ప్రేమకి కారణాలు లేవు. కానీ విరక్తికి స్పష్టంగా ఉంటాయి.

రెడ్డి నాతో మీ బాధ అంతా చెప్పి 'ఇప్పటికీ నువ్వు అతన్ని చేసుకోడానికి నాకు అభ్యంతరంలేదుఅన్నాడు.దానివెనక ఉన్నది ఆత్మవిశ్వాసమా గొప్పదనమా మహావ్యక్తిత్వమా?ఏమిటి, ఏంఅంటారు?

యుద్ధరంగంలో సైనికుడు నుంచి ప్రేమ వ్యవహారాల్లో ప్రేమికుడిదాక అందరికీ కొన్ని కనీసపు అర్హతలుండాలి అవి మీకు ఉన్నాయో లేదో మన వ్యవహ రమే నిదర్శనం

అంత ధైర్యం, గొప్పదనం ఉన్న ప్పుడు నేనే చొరవ తీసుకోకూడదా?— అని మీ అసమర్ధ వేసే ప్రశ్న' అ ఎప్పుడూ జరగదు? అది మొగాడు పిల్లల్ని కనడంలాంటిది

మీరు ఆ చొరవ తీసుకోడానికి అ వైన స్థితి కల్పించా, మీరే వాడుకోలేద తప్పు నాదికాదు

ఇంత బలహీనపు వ్యక్తిత్వంతో నాలాంటిదాన్ని ఆశించడమే నాకు నవ్వ తెప్పిస్తుంది. జీవితం అంతా మీ ధర్మవ అని నవ్వుతూ బ్రతికే అవకాశం కల్పిం నందుకు కృతజ్ఞతలతో— 'రాధ



# రెక్కలు

ప్రదానమంత్రి ఇరవై సూత్రాల పధకంను యధాలాపంగ చదువుకుపోతున్న కలెక్టరు 'సూరి' నాలుగో సూత్రం తనను కట్టేసినట్లు చూస్తూండిపోయాడు. ఎగసి పడే గుండెపై చెయ్యివేసి మళ్ళీ మళ్ళీ చదివాడు

'బాండెడ్ లేబర్ (వెట్టిచాకిరి) రద్దు, ఇంకా అమలుపరుస్తున్నవారిని చట్టాన్ని వ్యతిరేకిస్తున్నందుకు వారిని శిక్షించవచ్చు' ప్రధానమంత్రికి జోహార్లు అర్పిస్తూ లేచాడు వెంటనే తన సిబ్బందితో 'పూతనపల్లి'కి ప్రయాణమైనాడు.

రోడ్డుపై కారు దూసుకుపోతుంటే గిరులు-తరులు వెనక్కి పరుగెట్టుతున్నాయి. కలెక్టరు 'సూరి' ఆలోచనలు వాటి వెంటబడ్డాయి

* * *

చెలమయ్యకు వుంటానికి ఇల్లు-రెండెకరాల భూమి వున్నాయి. సంవత్సరానికి సరిపడే తిండిగింజలకోసం ఆ కుటుంబ సభ్యులందరూ కష్టపడుతారు. ఒక రోజు చెలమయ్య చెల్లెలు యాదమ్మ రెండెడ్ల బండిలో మంచానపడిన భర్తతో పదేళ్ళ కొడుకు సూరీడుతో వచ్చింది. మరెక్కడికీ వెళ్ళే దారిలేక తనను వెతుక్కుంటూ వచ్చిన చెల్లెలను భరించటం తన బాధ్యతగా ఎంచి ఆదరించాడు.

కష్టాలన్నీ కూడబలుక్కొని వస్తాయన్నట్లు ఆ సంవత్సరం వర్షాలులేక పంట ఎండిపోయింది. రెక్కల కష్టం మీద నమ్మకం వున్న చెలమయ్య కూలి

నికి తగిన ఫలితం దక్కలేదు.

సగం కడుపుతో వున్నా 'దేహి' అని మరో ఇంటికి అప్పుకు వెళ్ళలేదు. ఆకలిని నీళ్ళతో మభ్యపెట్టుకోగలిగారు కాని, జబ్బుతో వున్న చెల్లెలి భర్తను మభ్య పెట్టలేకపోయాడు.

అతనికి క్షయవ్యాధి అన్నారు. ఖరీదైన మందులు, పుష్టికరమైన తిండి ఇవ్వాలన్నారు. జబ్బుతో కృశించిపోతున్న అతను మరొకరికి బరువుగా వుండలేక ఆత్మహత్యకు ప్రయత్నించాడు. భర్తను చుట్టేసుకుపోయి ఏడుస్తున్న చెల్లి కంటి నీరు తుడిచి చెలమయ్య నేరుగా చౌదరి ఇంటికి వెళ్ళాడు.

కరువుకాటకాలు ఆ ఇంటిని ఏమీ చేయలేనంత కట్టుదిట్టంగా వుంది ఆ మిద్దె ఇల్లు

చౌదరిగారు కడుపునిండుగ భోజనం చేసిన తృప్తితో వాలుకుర్చీలో కూర్చుని మూరేడు పుగాకును వాసన చూసి తలూపుతూ చుట్టగా మలుస్తున్నాడు. అల్లంత దూరంలో చేతులు కట్టుకుని నిల్చున్న చెలమయ్యను చూసి "ఎవ్వరూ! చెలమయ్యా! ఏమిటీ, వూడిపడ్డావ్." అన్నాడు.

కరువుతో కడుపులు కరకరలాడేది బీదలే వరదలొచ్చి కొట్టుకుపోయేది బీద ప్రజే! సూర్యుడితో లేచి, సూర్యాస్తమయం వరకు నడుంవంచి చెమటోచ్చి పనిచేసినా కడుపునిండదే! చల్లని నీడలో సోమరిగా కూర్చుని బొజ్జలు పెంచుకున్న వాళ్లు! గొప్పగా జీవిస్తారు. మనుష్యులే పడుతుంది. ఎక్కడ ధర్మం? అది ఆలోచిస్తూ తన కష్టాలను ఏకరువు పెట్టసాగాడు చెలమయ్య. ఆ మాటలు ఆప మన్నట్టుగా చెయ్యి ఎత్తాడు చౌదరి.

"కాలయాపన చేయక వచ్చినపనేంటో తేల్చు!' అన్నాడు.

"డబ్బు కావాలి "

"తాకట్టుకు ఏం తెచ్చావ్?"

"నా దగ్గర ఏముందో తమరికి తెలియనిది కాదు. రెండెకరాల భూదేవి, ఇల్లు."

నింపాదిగ పొగ వదులుతూ "తంతే కూలిపోయే నీ గుడిసే. నీరాళ్ళభూమి నేనేం చేసుకోను!" తలెగురవేశాడు.

వాస్తు శాస్త్రప్రకారం ఏదో లోపం వుందని తెలిసి బంగారంలాంటి సిమెంటు మిద్దెలు మూడు పడగొట్టాడు. వూళ్లోఉన్న మంచిపొలాలన్నీ వారివే! తలసంచుకున్నాడు చెలమయ్య.

"అప్పు ఎలా తీరుస్తావు?"

ఆశగా తలెత్తి తన చేతి కండరాలను వుబ్బించి, 'నా రెక్కల కష్టంతో అప్పు తీర్చుతా'నన్నాడు. చౌదరి సాలోచనగా తలూపుతూ,"అదే,తాకట్టుపెట్టు"అన్నాడు.

అర్ధంకానట్టు చూశాడు చలమయ్య.

అదేనోయ్! ఇంట్లోపనికి ఇబ్బంది పడుతుంది ఇంటావిడ. పెద్దింటి చాకిరి రాత్రింబవళ్ళు వుంటుంది. ఒక్కసారి ఆ ఇంటి గడప తొక్కితే అంకితమైపోయి నట్లే. పెళ్ళికావలసిన ఆడపిల్లలను ఆ ఇంటికి పంపలేదు. ఇంటి ఇల్లాలును పరాయి గడప తొక్కనిస్తాడా! తనొస్తే,




తన కుటుంబాన్ని ఎవ్వరు సంభావించు కుంటారు? ఈ ఇంటి వూడిగానికి ఎవర్ని పంపాలి?

'చంద్రం తన పదకొండేళ్ళ కొడుకు-పుస్తకాలు పట్టుకొని శ్రద్ధగా బడికెళ్లే సుపుత్రుడు కళ్లెదుట నిల్చాడు.

ఆ రోజు చద్దిఅన్నం తిని సూరీడు భుజంపై చెయ్యివేసి బడికి బయలుదేరిన చంద్రంని చౌదరి ఇంటికి తీసుకొని పోతుంటే చంద్రం తల్లి పోర్లాడి పోర్లాడి యేడ్చింది. చెలమయ్య చెల్లికాళ్ళకి అడ్డు తగిలింది. "అన్నయ్యా! శనిలా నీ ఇంట్లో దూరాము. తాకట్టుకి సూరీడును పంపు అదే న్యాయం" అని దుఃఖంతో నేల కంటుకుపోయింది.

పుస్తకాలను ఎదకు అదుముకొని బిక్కు బిక్కుమని చూస్తున్న సూరీడును బొమ్మనటానికి మనస్సాక్షి వప్పుకోలేదు.

"ఎందుకే ఏడుస్తారు! ఏమొచ్చిందని; దేముడు చల్లగా చూడాలేగాని ఆ అప్పు ఇట్టే తీర్చేయనూ! మరో ఆరునెలలకి మన చంద్రం మనింటికి వస్తాడు." అని వారికి ధైర్యంచెప్పుతూ తనను తాను వోదార్చుకుంటూ చంద్రాన్ని చౌదరి ఇంట్లో వదలి వచ్చాడు. తెలివిగల చంద్రం ఆడపని, మొగపని ఇట్టేచేసేవాడు. రాత్రిళ్లు అందరు నిద్రపోయాక అలసిన శరీరం విశ్రాంతి కోరుతున్నా పరుగు పరుగున ఇంటికి వెళ్ళి అమ్మని చూసుకొని వచ్చేవాడు.

ఆరునెలల్లో తీర్చుతానన్న అప్పు ఆరు సంవత్సరాలైనా తీర్చలేకపోయాడు. సరికదా, అదనంగ మరికొంత అప్పుతీసుకున్నాడు. ఒకసారి అప్పుతీసుకోవడం వూబిలోకి దిగటం లాంటిది. యాదమ్మ తనభర్త ప్రాణాలను ఓదరి చేర్చినందుకు చెలమయ్య పాదాలను కన్నీటితో కడిగి.

బ్రతుకుతెరువుకోసం పట్టణానికి బయలు దేరింది. నాలుగిళ్ళల్లో పనిచేసి కొడుకుని, భర్తను, పోషించేది యాదమ్మ. సూరీడుకు చదువు అబ్బింది. మంచి బ్రతుకుండా లంటే చదువు ముఖ్యమన్న విషయాన్ని చిన్ననాడే గ్రహించాడు. సూర్యం తల్లి కష్టంతోనే యం. ఎ. చేసి, లెక్చరర్‌పని చేపట్టాడు. తను ఏ మాత్రం సుఖం అను భవిస్తున్నా తన కళ్ళకి చంద్రం కనిపించే వాడు.

చదువుకోని తనంతటి వాడు కావలిసిన చంద్రం నిద్రతో కళ్ళు కూరుకుపోతున్నా ఆవలిస్తూ చౌదరి కాళ్ళు పట్టే చంద్రం గుర్తుకు వచ్చేవాడు. పైసా, పైసా, కూడేసి, చంద్రాన్ని తాకట్టునుంచి వదిలించాలన్నదే. తన జీవిత ధ్యేయంగా పెట్టుకున్నాడు. తల్లిపోరుతున్నా పెళ్ళిచేసు కోలేదు.

సంపాదిస్తున్న ఉద్యోగస్తునికి మంచి పెళ్ళి సంబంధాలు రాసాగాయి. పిల్లకి ఏ కాస్త వంకరవున్నా, కట్నం ధర ఎక్కువ పలుకుతున్నారు పోలియోతో కాలు వంకరై కుంటుతున్న అమ్మాయిని చేసుకొంటే ముప్పయి వేలు ఇస్తామన్నారు. చేసుకుంటానన్నాడు సూరి. తల్లి వద్దని పోరుపెట్టింది. 'నాకు వచ్చిన కష్టం ఏమొందీ' చంద్రంలా ఒకరింటికి తాకట్టుగా పెళ్ళి వూడిగం చేయటలేదు" అని తల్లి నోరు కట్టేసి ఇష్టంగ కుంటిపిల్లను పెళ్లాడి నాడు.

కట్నం డబ్బుతో చౌదరి ఇంటికి వెళ్ళాడు. తనకున్నదంతా చెల్లించి చంద్రంని స్వతంత్రునిగా చేసి తృప్తితో కంటినిండుగా నిద్రపోయాడు సూరి.

ఆ తృప్తి రెండురోజులు కూడ మిగులలేదు. బలంవున్న వాడిదే రాజ్యం మానవుడి స్వార్థానికి అంతులేదు. చలమయ్య పొలం, ఇల్లు తాకట్టులో వున్నట్టు సృష్టించిన పత్రాలను చూపిం చాడు. పదిమందిని కర్రలతో చెలమయ్య ఇంటిపైకి పంపాడు చౌదరి

పశువును ఈడ్చుకొచ్చినట్లు చంద్రంను తెచ్చి పశువుల పాకలో పడేశారు. చలమయ్య ఆర్తనాదం ఆ వూరు దాట లేదు.

స్వతంత్రం దేశానికేగాని అందులోని ప్రజలకు కాదు. బానిస బ్రతుకు తనకు తప్పదు ఎవ్వరి ఖర్మను ఎవ్వరు తప్పి స్తారు' యంత్రంలా పనిలోకి చొరబడ్డాడు చంద్రం.

సూరీడు హతాశుడైపోయాడు. ఈ అధ్యాయాలను అరికట్టేది ఎవ్వరు? ఎవ్వరు? ప్రయత్నించినా ఫలితం వుండదని నిట్టూ ర్చాడు సూరి. చౌదరి వుద్యోగస్తులను కొనేస్తాడు నాయకులకి మంత్రి పదవి కొనిస్తాడు (తన మనుష్యులను మంత్రు లుగాచేయటానికి డబ్బును వెదజల్లుతాడు.)

అందులో ఏ ఒక్కటి తాను చేయ లేడు ఈ భారత భూమిని ఆ దేవుడొక్కడే రక్షించగలడు.' సూరి రెండు చేతులు జోడించాడు.

చౌదరి ఎంతో వుదారంగ చంద్రంను పెళ్ళిచేసుకోమన్నాడు. చౌదరి వుదారంలో ఎంత స్వార్థం వుందో చిన్నప్పటి నుండి చూస్తున్న చంద్రం "నాకేంటీ పెళ్ళి బాబయ్యా" అన్నాడు జీవంలేని నవ్వుతో.







తనకలా ఓ భార్య పిల్లలు వుండాలన్న కోరిక ఎంత బలంగావున్నా తన భార్య బిడ్డలను బానిసత్వానికి వారసులుగా చేయ లేరు. ఈ వెట్టి చాకిరి తనతోనే పోవాలి. దృఢనిశ్చయంతో బ్రహ్మచారిగా వుండి పోయాడు.

మన ఇంటిపేరు నీతోనే పోతది. ఓ ఇంటివాడవై కొడుకుని కని చలమయ్య ఇంటిపేరు నిలబెట్టాలి. అని చంద్రం చేతులు పట్టుకున్నాడు.

చంద్రం పకపక నవ్వాడు. "నెహ్రూ అంతటి వాడికే ఇంటిపేరు మీద వంశం మీద వ్యామోహం లేదు. నాన్నా మనం మట్టి మనుష్యులం భూస్వాముల చేతిలో కీలుబొమ్మలం మనకెక్కడిదీ వంశం ..." అన్నాడు.

అంత తెలివిగా స్వచ్ఛంగ మాట్లాడే చంద్రం చదువుకోనిచ్చి వుంటే కలక్ట రయ్యేవాడు. ఆ మాట అన్నాడు చంద్రంతో అన్నాడు. 'చదువులేనివాడు మంత్రి అవుతాడు' అతిహసితం చేస్తూ చౌదరి ఇంట్లోకి వెళ్లాడు. చలమయ్య కళ్లు వత్తుకున్నాడు.

కొమ్మ అందిస్తే చెట్టుఎక్కే సూరి, ఐ. ఎ. యస్ పరీక్షఅయి, స్వంత జిల్లాకి కలెక్టరుగా వచ్చాడు.

ప్రభుత్వం జారీచేసిన చట్టాన్ని చౌదరికి చూపించి, చంద్రంని తీసుకుని కారు ఎక్కాడు సూరి.

వెట్టిచాకిరితో కృషించిపోతున్న ఎన్నో కుటుంబాలు స్వతంత్రగాలులు పీల్చు కున్నాయి. ***



# చీకటి కథ

కొండపనేని ఉమామహేశ్వరరావు

అది అమావాస్య రాత్రి.

చిమ్మచీకటి.

లోకంకోసం దాని సేవ.

విశ్రాంతికొరకు ఎదురుచూపు.

అప్పుడే బస్ దిగి చీకట్లో నడచి వస్తున్నాడు అతడు. బస్ దిగి కొంత దూరం నడచి రైలుపట్టాలు దాటి మరి కొంతదూరం నడిస్తే అతడు పుట్టిన ఊరు, అతడుండే ఇల్లు.

తనతోపాటే ఎవరో బస్ దిగినట్లు లీలగా అతడికి గుర్తు. ఎవరూ కన్పించరేం? అనుకుంటూ చుట్టూ చూశాడు.

ఎవరూ లేరు. అంతా చీకటి.

అలాగే వెళ్తున్నాడు. కాసేపటికి అడుగుల శబ్దం. అతడితోపాటే ఎవరో బస్ దిగారన్నది ఖాయం. వాళ్ళు తనతోపాటే నడుస్తున్నారన్నదీ మరీ ఖాయం. వెనుదిరిగి చూశాడు. ఎవరూ కన్పించలేదు. అడుగుల శబ్దం మాత్రం మరింత దగ్గరలో విన్పిస్తోంది. మరి కొంతదూరం ఇద్దరూ నడిచారు. ఓ ఇంటిలోనుండి సన్నని వెలుగు రోడ్డుమీదపడి మట్టిరోడ్డు మీదపడి మాయమవుతోంది. లీలగా నీడలు కన్పిస్తాయి ఆ వెలుగులో. ఆ వెలుగును

ఇద్దరూ దాటారు. లీలగా రెండో వ్యక్తి స్త్రీయని గుర్తించాడు. అంతేకాదు, పాపో బాబో ఆమె చంకలో ఉన్నట్లు కూడా అతడి పరిశోధనా ఫలితం.

ఎవరూ లేని ఒంటరి సమయం. వాళ్ళిద్దరే వున్న తుంటరి సమయం. అతడి పిచ్చివయసు, దేనికోసమో తపిస్తున్న వెధవ మనసు. ఏవేవో ఆలోచనలు అతడి బుర్రనిండా ముసురుకున్నాయి.

మరికొంత ముందుకు నడిచారు ఇద్దరు.

రోడ్డు ప్రక్కనే ఓ కాకా టీకొట్టు దగ్గర పెట్రొమాక్స్ లైట్ గుడ్డిగా, నీర్సంగా వెలుగుతూంది. ఆ వెలుగులో మనుషులను గుర్తించవచ్చు. అతడి హృదయానికి సంతోషమైంది. ఆమెను పరిశీలనగా చూశాడు. ఆమె తనకు కొత్త కాదు. తనతోపాటే బస్సెక్కింది. బస్సెక్కిన దగ్గర్నుండీ తను ఆమెను చూస్తూనే వున్నాడు. ఆమె తనను చూస్తూనేవుంది.

వెలుగు దాటిపోయింది. మళ్ళీ చీకటి.

ఈ లోకంలో వెలుగుకన్నా చీకటికే విలువ ఎక్కువ. చెడిపోయిన ఆడదానికీ, దెబ్బతిన్న మగవాడికీ చీకటి అవసరం చాలా ఉంది. తొందరపెడ్తున్న వయసు పోరు తీర్చుకోడానికి, ముసలి మొగుడు యివ్వలేని ఆనందాన్ని డబ్బుపెట్టి కొనుక్కోడానికి, అందాన్ని పణంగా పెట్టి కడుపును నింపుకోడానికి, ఇంకా ఎన్నిటికో చీకటి చాలా అవసరం. అసలు ఈ పిండం ప్రాణం పోసుకుంది ఈ చీకట్లోనే. అందుకే చీకటికి అమిత విలువ.

"ఏఁవండీ!"

"....     ...."

"మీదే వూరు?"

"ఏదో వూరు."

"అంటే?"

"మీకెందుకు?"

"మీరు చెప్పాలి."

"ఎందుకని?"

"నేను అడిగాను కాబట్టి."

"అందుకే చెప్పనంటున్నాను."

ఇద్దరూ నిశ్శబ్దంగా నడుస్తున్నారు.

ఆమె మనసులో ఏదో ఆలోచన! ఏదో కావాలి! ఇది తొలిసారి కాదు. అయినా కావాలి! తన ఇల్లు రైలుపట్టాలు దాటిం తర్వాత చాలా దూరం ఉంది. ఈ చీకట్లో అంత దూరం నడవాలంటే భయం. ఇంకా నయం ఈయనెవరో తోడు వస్తున్నారు. లేకపోతే నేనూ, నా బాబూ ..? కాని ఏ విఁటో ఈయన నన్నేదో అడుగుతున్నారు. ఏం చెప్పాలి? ఏదో చెప్పాలనే ఉంది. భర్త పోయి సంవత్సరమయింది. అప్పట్నుంచీ తను ఎలాంటి సుఖమూ ఎరుగదు. బాబును ఆ చేతిలోనుండి ఈ చేతిలోకి మార్చుకుంది. అతడు తనను కోరుతున్నాడన్న ఆలోచన ఆ మార్పుకు కారణం కావచ్చు.

"ఇదే మా వూరు."

"ఎక్కడ మీ ఇల్లు?"

" ...వీధి చివర."

"ఒంటరిగా వస్తున్నారు!"

"ఏం చేయను?"

"మీ భర్త?"

"పోయారు."

"అయ్యో పాపం!"

"సానుభూతి అక్కర్లేదు."

"ఎవరూ లేరు. నేనే ఇప్పుడు ఈ బాబుకి అమ్మను."

"ఇంట్లో కూడా ఒంటరి అన్నమాట."

"అంతేగా ...!"

"నాదో కోరిక."

".... ......."

"మీరు నాకు కావాలి!"

"ఎందుకు?"

"అర్థంలేని ప్రశ్న!"

"అందుకేనా!"

"అని ఎలా చెప్పను?"

"అసలు నన్నా విధంగా ఎందుకూహించుకున్నారు?"

"ఇష్టమై కూడా బెట్టుచేయడం ఆడదాని లక్షణం అనుకుంటాను."

"ఇష్టమని ఎలా తెల్సు?"

సమాధానం లేదు.

ఆమె తన పైటకొంగు తీసి బాబుకు కప్పింది. తన వూహ నిజం. అతడిదీ, తనదీ ఒకే ఆలోచన.

తను "ఊఁ" అంటే!

ఆమె ఆలోచన అతడి కర్థమైంది. బహుశా ఒప్పుకోవచ్చు. ఇంకా రైలు పట్టాలు రాలేదు. ఏమిటీ? ఈ కాస్త దూరం ఇంత దూరం నడిచాము. అతడి మెదడులో ఆశ్చర్యం.

ఇంకా నిశ్శబ్దంగానే నడుస్తున్నారు. నిశ్శబ్దం బద్దలయ్యింది.

"ఏమిటి?"

"ఎప్పుడు?"

"ఇప్పుడే!"

"ఇక్కడే!"

"అంటే?"

"నా వెంటరా!"

ఇద్దరూ నడిచారు. ఆమె తలవంచుకుంది. తను చేయబోయేది తప్పు. తెల్సు. ఏం చెయ్యాలి? చాలా చిన్న వయసు తనది. కోరికలన్నీ తీరకముందే భర్త పోయాడు. ఇంతకన్నా తనేం చెయ్యాలి? అతడ్ని చూసిందగ్గర్నుండి మనసు మరెక్కడకో పోతోంది.

అతడిదీ తన వూరేనట. మరి ఇన్నాళ్లూ కన్పించలేదేం? ఏమో మరి?

అతడు అనుకున్నచోటకు చేరాడు.

పట్టాలు కాళ్ళకు తగిలాయి. లెవల్ క్రాసింగ్‌కు ప్రక్కనే చిన్న బంగాళా పెంకుటిల్లు. లోపలికి వెళ్ళారు. అక్కడ ఎవరూ లేకపోవడం తన అదృష్టం అనుకున్నాడు.

"ఇక్కడా?"

"అవును."

"ఎవరైనా వస్తే?"

"ఎవరూ రారు."

"ఎలా?"

"ఏం?"

"చేతిలో బాబు!"

"అవును." అతడు ఆలోచించాడు. బుర్ర చకచకా పనిచేసింది. ఆమె చేతుల్లో నుండి బాబును తీసుకున్నాడు.

అక్కడే వున్న వరండాలో బాబును కూర్చోబెట్టి బాబు చేతికి చిన్న కర్ర ఇచ్చాడు. ఆ చిన్న కర్రతో బాబు ఆడు




ోవాలన్నది ఆతడి అర్ధంలేని ఆలోచన

ఈ పనులన్నీ ఆ చీకట్లో ఎలా చేస్తున్నాడన్న ప్రశ్నకు అర్ధంలేదు చాలా కాలం తర్వాత తన వయసు పొంగుమీద ఒళ్ళు చల్లబోతున్నాడు అంతే

తిరిగి ఆమెను చేరాడు

డీసెల్ ఇంజన్ రొద చేసుకుంటూ, భీకరంగా అరుచుకుంటూ, వాళ్ళున్న పెంకుటిల్లును అదరేస్తూ చీకటిని చీల్చుకుంటూ వెళ్ళిపోయింది

ఆ ఇద్దరి కోరికా తీరింది

ఇద్దరూ బయటకు వచ్చారు

ఆమె చీకట్లో బాబు కోసం వెతికింది బాబు ఎక్కడా కన్పించలేదు ఎక్కడ బాబు? పిలిచింది, పెద్దగా, ఇంకా పెద్దగా, అరిచింది పెద్దగా, ఇంకా పెద్దగా ఆమె అరుపుల్లో దూరంగా వెళ్తున్న డీసెల్ రైలు శబ్దం మాయమైంది

అతడు కూడా వెతికాడు బాబు కోసం. రైలుపట్టాలమీద కూడా. కాళ్ళతోనే కాదు. చేతుల్తోకూడా, అక్కడే కాదు అటూ ఇటూ కూ(డా)

ఏదో చేతికి తగిలింది ద్రవంచిక్కగా అసహ్యంగా, మరికొంత దూరంలో నిర్జీవ శరీరం చల్లగా, తడితడిగా, బాబు చని పోయాడు రైలు క్రిందపడి అని చెప్పలేక చెప్పాడు ఆమెతో తర్వాత నిస్సంగా, భారంగా సిగ్గునిండిన మనసుతో, కోరిక తీరి తేలికపడిన తనువుతో వెళ్ళిపోయాడతడు.

ఆమె ఏడ్చింది. మామూలుగాకాదు. రైళ్ళు ఎక్కడివక్కడ ఆగిపోయేంత దీనంగా

ఆరు నెలలు కాలగర్భంలో కలిసి పోయాయి. అతడి స్థితిలో ఎంతోమార్పు అతడి కళ్ళు ఎప్పుడూ ఏదో వెతుకు తుంటాయి ఎక్కడా కన్పించని ఆమె కోసం, ఇప్పటికే ఏడుస్తున్న ఆమె కోసం

ఆ వీధి రోజూకోసారన్నా వెళ్ళొస్తుండే వాడు. ఆనాటి మధురానుభూతులు, ఆ భయంకర రాత్రి తాలూకు విషాదఛాయలు ఆ ముఖంలో ఇంకా అలానే ఉన్నాయి. ఆమె ఆ రోజు కన్పించింది మామూలుగా కాదు ఆ రాత్రి అనుభూతులు తాలూకు ఆరునెలల బరువును మోస్తూ ఆ ముఖం నిండా ఆ రాత్రి తాలూకు చీకటి ఛాయల దైన్యం.

ఆమె స్థితిలోనూ ఎంతో మార్పు

బ్రతుకంతా తెలియని వెలితి

భర్త చనిపోయిన స్త్రీ పిల్లన్ని కనబో తుంటే, ఈ జనాభాలో మరో సంఖ్యను కలపబోతుంటే ఈ సంఘం ఒప్పుకోదు. సమాజం నుండి వెలివేస్తుంది.

ఊరికి దూరంగా గుడిసెలోకి మారింది ఆమె సంసారం. అక్కడైనా ప్రశాం తంగా ఉందామని.

చాటుగా ఎన్ని తప్పులైనా చెయ్యొచ్చు ఒప్పుకుంటుందీ సంఘం చీకటి తప్ప యినా అందరికీ తెలిస్తే శిక్షమాధిక్ష దొర కదు. ఫలితం అనుభవించాల్సిందే

ఆమె జీవితంలో ఎంతో మార్పు మొదటిబాబు ఎలా చనిపోయినాడన్న ప్రశ్నకు, మరోసారి గర్భం ఎవరి వలన అన్నప్రశ్నకు ఇంతవరకు ఆమె జవాబు ఎవరికీ చెప్పదుకూడా

ఆమెకు బాబు పుడ్తే బాగుండు. అతడి వింతకోరిక. తనవలన చనిపోయిన బాబు తిరిగి తనవలనే మరో బాబు ఆమెకు. అదీ సంతోషంగా ఉంది అతనికి. అందుకే ఆరునెలల తర్వాత అతడికి తిరిగి హృద యానందం తనకు శారీరక సుఖాన్ని అందించిన ఆమెకు అతడందిస్తున్న హృదయపూర్వక బహుమతి

మళ్ళీ మూడు నెలలు గడిచాయి. గడి చాయి ఆమె ప్రసవించింది ఈసారి పాప పుట్టింది. ఆ పాపకు ఈ సంఘంలో స్థానం ఉంటుందా'

ఏమో!

ఆలోచనలేదు అదే వుంటే ఈ కథ వుండేదికాదు.

వెలుగులో జరిగే కథలే మనం విన గలం కాని చీకటిలో కూడా ఎన్నో కథ లున్నాయని ఎంతమందికి తెలుసు? అలాంటి చీకటి కథల్లో ఇదీ ఒక కథ ఇలాంటి కథలను భరించగలశక్తి ఎంత మందికి ఉంటుంది!



జ్యోతి

కె. మాధురి



# బంధితుడు

"ఆ ప్రక్కన కూరగాయ మొక్కలు వెయ్యి ఈ మూల తులసికోట పెట్టుకో. నాల్గు నిత్యమల్లి గింజలు చల్లు పూజకి పనికివస్తాయి పిల్లల్ని జామచెట్టు జోలికి వెళ్ళనివ్వకు. తింటే పైత్యం చేస్తుంది ఇంటాయనతో చెప్పి కొట్టిం చేస్తాను కట్టెలు వంటింట్లో పెట్టబోకు. పురుగూపుట్రా చేరగలవు దొడ్లో కావలసినంత జాగా వుంది. నా పడక్కుర్చీ బయట గదిలో కిటికీకి ఓ గజం పక్కగా వెయ్యి రోడ్డుమీద వెధవగోల '

కొత్తగా అద్దెకు పుచ్చుకున్న కొంపను పై హెచ్చరికలతో ఛార్జి అప్పగించాడు ఆనందరావు భార్యకు.

ఆనందరావుకు అతని తల్లీదండ్రీ ఆ పేరు ఏమంటూ పెట్టారోగాని ఎరిగిన వాళ్ళెవరూ అతని ముఖాన ఆనందరేఖలు గానీ, కనీసం చిరునవ్వునుగానీ చూడ లేదు అతనెప్పుడూ తన సొమ్ము ఎవరో తినిపోతున్నట్టు చిటముటలాడుతూ వుంటాడు ఎరిగిన వాళ్ళతన్ని వెర్రి ఆనందరావని, చాదస్తపు ఆనందరావనీ, ప్రిన్సిపుల్డ్ ఆనందరావనీ, అంత కటిక వాడు పుట్టబోడు పెరగబోడనీ అనుకుంటూవుంటారు అంత నిక్కచ్చి మనిషి అతను

ఆ కుర్చీ ఆ మూలనే వుండాలి పేపరు చదవగానే సరిగ్గా మడతపెట్టి బల్లలో ఆ సొరుగులోనే పెట్టాలి. ఆ టేబుల్ క్లాత్ అంత కిందికే వేళ్ళాడాలి. విడిచిన జోళ్ళు సరిగ్గా ఆ మూలే పెట్టాలి

కుటుంబ నియంత్రణమీద అతని అభిప్రాయాలు అతనికున్నాయ్. మానవాధముడెవడికీ తన్ని పిల్లల్ని కనొద్దని చెప్పే అధికారం లేదనుకుంటాడు అంతగా అయితే ఈ ముండమోపి ఉద్యోగం ఒదులుకుంటానుగాని వీళ్ళెవరు నన్ను పిల్లల్ని కనొద్దని చెప్పటానికి అంటాడు సర్కారువార్ని వుద్దేశించి.

అతని భార్య గడపదాటి బయటికి రాదు, పొరుగింటికి అప్పులకి వెళ్ళదు. ఇరుగూపొరుగూ ఇతని ఇంటికి రారు ఒకళ్ళతో మనకి అవసరం ఏమిటి? అని రోజుకి పదిసార్లు పెళ్ళాం పిల్లలకి నూరిపోస్తాడు. తనకు నచ్చిన చిత్రానికి శనివారం రెండో ఆటకి భార్యాసమేతుడై వెళ్తాడు వస్తువులకేకాక ఇంట్లో మనుషులకూడా రూల్సు అమలు జరుపుతాడు

పత్యానికైనా ఇంట్లో కాఫీ వాసన తగలరాదు. సంవత్సరానికి మూడు కట్టుడు చీరలు మించి వాడరాదు తొడుక్కున్న ఇస్త్రీబట్టలు మూడ్రోజులూ మడత నలక్కూడదు పండగైనా పబ్బమైనా రాత్రి తొమ్మిదివరకూ పిల్లలు చదవాల్సిందే. ఒళ్ళు కోసే చలయినా చన్నీళ్ళ స్నానం చెయ్యాల్సిందే రేడియో బద్దలుగొడుతూ తెలుగు పాటలు వొచ్చినా పిల్లలు వినగూడదు

నెల మొత్తం ఖర్చువేసి గీత గీసియిస్తాడు భార్యకు ఇవ్వాళ తెచ్చిన కూరలు నాల్రోజులు రావాలంటే రావాల్సిందే. శోభనంనాడే తన ప్రిన్సిపుల్స్ అన్నీ భార్యకి వివరించి చెప్పి, ఆనాటి నుంచీ తిరుగులేకుండా ఏలుతున్నాడు. కలం గీతతో ఉరిశిక్ష వేయించగలిగిన న్యాయమూర్తికున్న ఫుల్ పవర్లున్నాయి అతనికి ఇంట్లో ఒకళ్ళకు చెప్పటమే కాదు ఆ ప్రిన్సిపుల్స్‌నే కాళ్ళకూ చేతులకీ సంకెళ్ళు వేసుకుని అవి సాగినంతమేరే అడుగులువేస్తూ ఎత్తుపల్లాలు లేని సమతలంమీద నడుస్తున్నాడు ఆనందరావు జన్మల్లోకెల్ల మానవజన్మ-మానవజన్మలో పురుషజన్మ — వాడ్ని సేవించి తరించడానికి స్త్రీ అనే సూత్రాన్ని అతను నిద్రలో కూడా మర్చిపోడు

ఇల్లా ఆరుగురి పిల్లలతో—అనుకూలవతిగా శాసించబడ్డ అర్ధాంగితో కొత్తగా అద్దెకు పుచ్చుకున్న ఇంట్లో కట్టుదిట్టంగా కాపురం చేస్తున్న ఆనందరావుకి ఒక అపశ్రుతి ఎదురైంది.

అయిదున్నరకు హిందూ నాలుగో పేజీ చూస్తున్నాడు అతను పిల్లలు చాపలు పరచుకోబోతున్నారు

'బృందావనమది అందరిదీ' ఇందాకటి కన్న పెద్దగా వినవొచ్చిందీసారి అది పాటలాగే పైగా కాస్త హాయిగా కూడా వుంది. తన నిశ్శబ్ద ప్రపంచాన్ని ధిక్కరిస్తున్న ధ్వని ఏ వైపునుంచా అని చూశాడు ఆనందరావు

'నేనొక పూలమొక్కకడ నిల్చి' ఆదీర్ఘం పద్యం పాటగా మారి చెవులో 'రింగు'మంటూంది

'సత్తెం! సత్తెం! ఇటు రావే!' ఆగలేక ఒక కేక పెట్టాడు.

సత్తెం తాలింపువేసే సమయమది. అయినా పిలుపు మన్నించక తప్పదు గనక హాజరైంది.

'ఏమిటీ న్యూసెన్స్?' విసుగ్గా అడిగాడు

పేపరు చూస్తూనే న్యూసెన్స్ అంటాడేమిటూ అని తెల్లబోయిందామె.

'వినపట్టంలేదా?'

'ఏమిటండీ! వినపట్టంలేదు చెప్పరాదూ?'

'చల్లగా హాయిగా '

'అదా! బాగానే పాడ్తున్నాదుగదండీ!' అందామె అమాయకంగా

'బాగానా! నీ మొఖం కాదూ! ఎక్కడ్నుంచి వస్తూంది? దీపాలు పెట్టేవేళ పిల్లలు తిరిగే కొంపలోకి పాటకో టైము చోటూ వుండక్కర్లా!'



సమస్య పూర్తిగా అర్థమైంది ఆమెకి ఇది ఎదిరించి నిలబడే సమస్యగాదు. ఇంకా రెండు మాట్లాడితే పాటలు వింటున్నాడనే సాకు మీద చంటివాడి వీపు చీరెయ్యగలడు. అందుకే అతన్తోపాటు పాటను ఆలకించింది. ఇద్దరూ తేల్చుకునే సరికి యింకో నాలుగు రాగాలు ఆ పాట పక్కవాటాలోంచి రెండు వాటాల మధ్య జాయింటు గోడమీద వెంటిలేటర్లోంచి

'వీళ్ళకి బుద్ధిజ్ఞానం లేనట్టుందే. వెళ్ళి చెప్పొస్తాను.'

ఒచ్చి అంతా నాల్రోజులు కాలేదు అప్పుడే తగాదాకి సిద్ధమైన లతన్ని చూసి భయపడింది ఆమె. ఇల్లు సదుపాయంగా వుంది కదా అని ఆశపడింది.

'మీరు వూరుకోండి యీసారి, కొత్తగాదా. తెలియకపోవచ్చు. నేనావిడకు చెప్తాను.' ఎట్లాగో సర్ది చెప్పింది.

ఖచ్చితంగా ఉదయం ఎనిమిది

పట్టువస్త్రం కట్టి వెంకటేశ్వరుడి ముందు సాష్టాంగపడ్డాడు ఆనందరావు.

చెవులో శూలంలాగా ఈలపాట

మూడో నేత్రం తెరిచి వంటగదిలోకి దూకాడు. 'వాళ్ళని అనే పన్లేదే నువ్విచ్చిన అలుసే. లేకపోతే నీకూ పాటలు విని ఎగరాలనుందా?' జానెడు వంటింట్లో వీరవిహారం చేశాడు ఇతని అరపులకు సగం చచ్చిందామె

'చెప్పానండీ' గట్టిగా చెప్పాను ఇంతకుముందు ఇంట్లో ఎవరూ లేక

పాడుకోవటానికి అలవాడు పడ్డాడట పిల్ల వాడు. మందలిస్తానని మరీ మరీ చెప్పిం దావిడ. మళ్ళా చెపుతాను. ఈ పూటకి ఓపిక పట్టండి.'

'నీవల్ల కాకపోతే నాకు చెప్పు. ఒక సారి చెపితే బుద్ధుండాలి మనుషులకి. సంసార్లున్న కొంపలో ఇరవై నాలు గ్గంటలూ కూనిరాగాలు! పిల్లల్ని కనగానే సరిగాదు. డిసిప్లిన్‌లో పెంచాలి ' గొంతు పెంచి అరిచాడు.

మరోవారం ప్రశాంతంగా వెళ్ళింది. యీలోగా అతను దొడ్లోవాళ్ళ వేపు పెరిగి గోడదాటి వొచ్చిన సన్నజాజి తీగను ఖచ్చి తంగా సగానికి కత్తిరించాడు. తన వాటా లోంచి పారే మురుగుకాల్వని మూయిం చాడు. వాళ్ళు అంటుకీ సొంటుకీ పనికి రాని మనుషులని తేల్చాడు పక్క వాటా వేపు వెళ్తే కాళ్ళు విరక్కొట్టానని హెచ్చ రించాడు యింటోవాళ్ళని. ఇన్ని కట్టు దిట్టాలు చేసి ఆ ఆదివారం మధ్యాహ్నం ప్రశాంతంగా ముద్ద ముప్పయి మూడోసారి నముల్తుండగా 'మానవుడే మహనీయుడూ' సన్నగా మొదలైన రాగంతరంగాలు తరం గాలుగా. ముద్దగొంతులో చిక్కుపడింది. 'నీవల్లకాదే. ఎందుకూ పనికిరావు జనాభా లెక్కకితప్ప'—కంచం అవతలికి నెట్టి బయటికిపోయాడు. ఆ పోవటం పోవటం వడ్రంగినీ నిచ్చెన్నీ వెంటబెట్టుకుని వొచ్చాడు. వెంటిలేటరు సందులేకుండా చెక్క కొట్టించాడు. అంతటితో ఆ పీడా విరగడైందనుకున్నాడు.

ఆ రోజు ప్రశాంతంగా పడక్కుర్చీలో వాలి లెక్కల పేపర్లు దిద్దుతున్నాడు. మార్కులు కొసిరి కొసిరి నవర్సల్లా వొడ్డిస్తున్నాడు. ఎర్రపెన్సిల్ నొక్కిపట్టి గుండు సున్నాలు చుడుతున్నాడు. ఆ రసా నందంలో మునిగి తేల్తుండగా.

'జగమేమాయా—— బ్రతుకేమాయా' నిజంగా మాయా అనుకునేంత మందంగా బరువుగా ఆ పాటగదిలోకి రావటమేకాదు. చంటివాడ్ని మభ్యపెడ్తూందని తెలిసి శివ మెత్తిపోయాడు

ఒక్క దూకులో పక్కవాటా ముందు పడ్డాడు.

బిక్కచచ్చిన సత్యవతి తలుపు దగ్గరికి చేరింది.

తలుపు దబాదబా బాదాడు అతను

'ఎవరు నీవు ఎచటనుండి వొచ్చితివి? తలుపులు బాదుచుంటివి?' రాగయుక్తంగా ప్రశ్నించింది లోపలి కంఠం.

'నీకు బుద్ధుందా లేదా? పక్కవాళ్ళు బతకాలా అక్కర్లేదా? బయటికొచ్చి మాట్టాడు చూస్తాను' బుసలుకొట్టాడు.

'నిద్రపోవాలనేగా జోలపాడుతున్నాను యింకేం పాడమంటారు చెప్పండి. అమ్మ లేదు. రేపొద్దున్నే వొచ్చి మాట్టాడండి'

తెరవని తలుపు ఫెడీమని ముఖాన కొట్టి నట్టయింది పెడసరపు సమాధానంతో వొంటో మంటలు పెట్టినట్లయింది. ఏం చెయ్యాలేక తిరిగి వొచ్చాడు. ఆ రాత్రి తెల్లవార్లూ నిద్రపోలేదతను. వీలయినన్ని పేపర్లు సున్నాలు చుట్టాడు. వోపికున్నంత వరకు పెళ్లాన్ని సాధించాడు. ఏ తెల్లవారు ఝామునో మాగన్నుగా ఓ కునుకు

ఉదయాన్నే పాలుతాగి బజారుకెళ్ళిన మనిషి పదయినా తిరికిరాలేదు. ఇన్నేళ్ళలో




ఏ వొక్కరోజూ స్కూలుకు లేటుగా వెళ్ళని మనిషి —

ఇదేదో దుష్ట సంకేతంలా కన్పించిందా మెకు దిగాలుపడి అట్లానే కూచుంది ఆ మధ్యాహ్నానికి వొచ్చాడు ఆనందరావు బళ్ళు బయట ఆపించి.

'సామాన్లు సర్దెయ్యి. యిల్లు ఖాళీచేద్దాం'

తెల్లబోయింది ఆమె.

'తొందరగా కానివ్వు. ఈ ఛండాల పొరుక్కున్న వూరవతల వొంటి నిట్టాడి పాకలో వుండటం నయం కానివ్వు నాలుగింటికల్లా కొత్తింట్లో వుండాలి, మళ్లా వొర్జం వొస్తుంది' ఫైనల్ డిక్లరేషన్ యిచ్చాడు.

సత్తెం నిమిత్తమాత్రురాల్లా నిలబడింది.

'అన్నయ్యగారూ' తెల్లటి చీరలో ఆవిడ 'ఎవరమ్మా నువ్వు' మడుస్తున్న కుర్చీ గోడకానించి అడిగాడు.

'మనపక్కావిడ' పరిచయం చేసింది సత్యవతి

'బయట బళ్ళు' ఆవిడ అనబోతుంది. ఆమె మాట మధ్యలో అందుకున్నాడు ఆనందరావు వెతకబోయే తీగ అడ్డం పడ్డట్టు 'ఖాళీ చేసి పోతున్నాంతల్లీ, పోతున్నాం. మీరిక హాయిగా వుండండి ఇరవైనాలుగ్గంటలూ పాడుకోండి. మనిషికో మాటన్నారు ఎంత చెప్పినా వినకపోతిరి. పొరుగున ఒకడున్నాడు. పెళ్ళాం బిడ్డలతో కాపురం చేస్తున్నాడు అనే జ్ఞానం లేకపోయె యివ్వాళతో మా పీడ విరగడవుతుంది. గొంతులు పగిలేట్టు పాడుకోండి. ఏ పొరుగూ పక్కన చేరకుండా పాడుకోండి పోకేం చేస్తాం'

ఆవిడ వుక్కిరి బిక్కిరైంది. నీళ్ళు చిమ్మే కళ్లు దించుకుంది.

'మా తప్పు మన్నించన్నయ్యగారు. మొగదిక్కులేనిదాన్ని. మిగిలిన నలుసు

వాడొక్కడు, పదేళ్ళకు గాలి మాటలొచ్చి నయ్ సరిగ్గా నడవలేదు. ఎందరు డాక్టర్లకి చూపించినా మెదడు సరిగ్గా ఎదగలే వన్నారు వీదిలోకి పంపిస్తే ఏ లారీకింద పడ్తాడో ఏ ఇంట్లో దూరి తగాదా తెస్తాడో అని ఆ గదిలో పడి వుండేట్టు అలవాటు చేశాను నాలుగు మెతుకులు తిని ఆ గది లోనే పడివుంటాడు. ఎళ్ళొచ్చినయ్ అక్షరం ముక్కరాదు. అడిగితే సమా ధానం చెప్పటంరాదు రేడియో పెట్టుకుని పాటలు వింటూ కూచుంటాడు ' దుఃఖాన్ని దిగమింగి పట్టి పట్టి మాటాడుతుందామె 'దేముడు ఏమివ్వకపోయినా ఆ కంఠాన్ని యిచ్చాడు ఆ పిచ్చి పాటలు పాడుతూ వుంటాడు మీకు కష్టం కల్గించాలనికాదు పాడొద్దురా అంటే వినడువాడు అక్కడికీ మీకు యిబ్బంది కల్గించకుండా వుండాలనే పదిరోజులు మా అక్కయ్య యింటికి పంపించాను. వెర్రివాడ్ని ఎవరు మాత్రం ఎంతకాలం వుంచుకుంటారు? మీరు వెళ్ళి పోతారంటే నా కడుపు తరుక్కుపోతూ వుంది ఎవర్నీ యిబ్బంది పెట్టినదాన్ని కాదు ' చెయ్యని నేరానికి బలవుతున్న దాన్లా ఏడవసాగిందామె

ఆ పాటలు పాడేది పిచ్చిపిల్లవాడనే సరికి సత్యవతికి జాలి పొంగుకొచ్చింది

'పిల్లల్తో ఇప్పుడెక్కడికి వెళ్తా రన్నయ్యగారూ నాల్రోజులు టైమివ్వండి రెండు గదులు చూసుకుని నేనే పోతాను. ఈ ఒక్కసారికీ మమ్మల్ని మన్నించం'డని అభ్యర్థించిందామె.

'చూడమ్మా. మీరిక వెళ్లొచ్చు పిచ్చో మంచో నాకు అనవసరం ఈ పొరుగున ప్రశాంతంగా బతకటం కష్టం. మా కెవరి మీదా కష్టంలేదు వుండి ఏం చేస్తాం నేను ఒకమాట అన్నానంటే దానికి తిరుగులేదు. కానీ టైమయింది ' సత్యాన్ని కసిరాడు కాసేపు దిగాలుగాచూసి వెళ్ళిపోయిందామె ఇల్లు తాళంవేసి సామాన్లతో బయలు దేరాడు ఆనందరావు వెళ్తూ పక్కవాటా వేపు చూసింది సత్యం, వేసిన తలుపు లోంచి నీ యూశా అడియాశా'

మెదడు ఎదగని వెర్రివాడి కంఠం నడకరాని పిచ్చివాడి కంఠం పాట జాలిగా మనసులోని మెత్తని పొరల్నికదిలిస్తూంది

కదల్లేక నిలబడ్డ సత్యాన్నీ 'తొందర గారా, పిచ్చాడిపాట వొదలబుద్ధి కావటం లేదా' అని ఓ కసురు కసిరాడు ఎవరికి పిచ్చని తెల్లబోయింది ఆనందరావుని అనుసరించింది

ఎం చేస్తాం కొందరికి పసిపాపల నవ్వులన్నా పచ్చనిచేలన్నా చల్లని వెన్నె లన్నా పూలవాసనలన్నా గిట్టవు

ఈ ప్రపంచాన్ని పాలించండని ఒక్క రోజు అధికారం యిస్తే వీచేగాలికి కూడా హద్దులు పెడతారు పచ్చని ప్రతిదానికీ ఒక రాత్రిలో చిచ్చుపెడతారు తన దారాలతో తన్ను బిగించుకున్న సాలెపురుగులా తమ సూత్రాలతో మానవత్వానికి వురి పోసుకుని బతుకుతున్న మనుషులు వీళ్ళు.






విశాలమయిన అద్దాల కిటికీలోంచి చూస్తోంది లావణ్య

"తాళంలాగి చూసేరా? తీరా మనమూ వెళ్ళాక ఎవరైనా ప్రవేశించగలరు జాగ్రత్త" ఎగిరిపోయే ముందరి జుట్టును పైకి తీసుకుంటూ చీరకుచ్చిళ్ళు సుతారంగా పట్టుకొని నీళ్ళు నిలిచిన మట్టి ప్రదేశంలో నీరు చిందకుండా జాగ్రత్తగా పడుస్తూ అంటోంది ఆ యువతి. ఆరేళ్ళ బాబు వీధి కర్రగేటు కటకటాల మధ్య నిలబడి అటూ ఇటూ ఊగుతున్నాడు "పద పద చీకటి పడకుండా రావాలి" తాళాల గుత్తి జేబులో వేసుకుంటూ అన్నాడతడు మధ్యలో ఊగుతూ గెంతుతూ బాబు ఇద్దరి చేతులు పట్టుకొని నడుస్తున్నాడు మాటిమాటికీ గాలి కెగరబోయే పమిటకొంగు చేత్తో అణగదీస్తూ కబుర్లు చెప్పుకుంటూ నవ్వుకుంటూ నడుస్తోంది ఆ యువతి భర్తతోపాటు.

ఇంచుమించు రోజూ చూసే దృశ్యమే అయినా ప్రతీరోజూ చూడాలనే అనుకుంటుంది లావణ్య. లావణ్య పేరుకు తగ్గట్లే ఉంది. లోకంలో ఉన్న పడతులందరి సౌందర్యం ఒకేచోట పోగుచేసి

ఆలోచనలకు రూపకల్పనేమో అనిపిస్తుంది లావణ్యను చూస్తే! ఉట్టినే చూస్తేనే రెండు కళ్ళూ చాలవనిపించే లావణ్యను అంతటితో వదలక నాట్యకళ వరంగా ఇచ్చి మరీ పంపాడు భూలోకంలోకి. అన్ని ఆభరణాలమధ్య ధగధగా మెరుస్తూ బంగారుబొమ్మ కదలి వచ్చినట్లే ఉంటుంది. అందుకే ఏరి కోరి మరీ చేసుకున్నాడు శేఖరం నడుస్తూంటేనే నాట్యం చేస్తోం దేమో అని భ్రమ కలుగుతుంది శేఖరానికి లావణ్యని చూస్తే!

రేపటి ప్రోగ్రాంకు ముందుగా ప్రాక్టీసు చేసి అలసిపోయి కుర్చీలో కూర్చుని చల్లగాలికి సేదతీరుతూ ఉంది 'లావణ్యా' శేఖరం పిలుపుకు కిటికీలోంచి చూస్తున్న లావణ్య తల తిప్పి చూసింది ఏమిటన్నట్లు

"రేపటికీ అన్నీ సర్దుకుందామా?" దగ్గరగా వస్తూ కిటికీలోంచి ఓ మాటు చూస్తూ అన్నాడు

"ఇపుడేమంత తొందర. సర్దుకోవచ్చు" ముభావంగా అన్నది లావణ్య.

"సరే! నీ ఇష్టం అక్కడ కూర్చు న్నావేం. ఫాన్ వేసుకోబోయావా? నేను వేస్తానుండు "

"వద్దు! ఇక్కడే బావుంది" చిరాకుని ప్రెకురకకుండా అణుచుకుంటూ అంది

ఏం? ఫాన్‌గాలేగాని చల్లని ప్రకృతి గాని తను అనుభవించకూడదా? అంతా కృత్రిమం ఏం మనుష్యులో!

"కాస్సేపు డాన్స్‌ప్రాక్టీస్ చేసుకో బోయావా? ప్రొద్దున్నే బయల్దేరాలి గూడా!" ఎంతో ఆసక్తిగా శేఖరం ఈమాటు కోపం పట్టుకోలేకపోయింది.

"ఇపుడే చేసి చేసి వచ్చి ఇలా కూర్చు న్నాను నన్ను వేధించకు నీకు పుణ్యం ఉంటుంది" అర్థిస్తున్నట్లుగా కంఠస్వరం మార్చింది లావణ్య

"ఓ! అయామ్‌సారీ!" రెండునిమిషాలు మాట్లాడలేదు శేఖరం

"నేను శేర్‌తో ఓమాటు మాట్లాడాలి కలప విషయంలో నేను వచ్చేసరికి తొమ్మిదో పదో అవుతుంది నా కోసం కూర్చోకు నువ్వు భోజనం చేసెయ్యి."

'అలాగే!' రాళ్ళు జూకాలు కదిలే టట్లుగా తల ఊగించింది లావణ్య.

మరేదో చెప్పబోయాడు కాని ఒక నిముషం లావణ్యకేసి తేరిపార చూసి 'ఇపుడు మూడ్‌లో లేదనుకుంటాను' అనుకుని ఊరుకున్నాడు శేఖరం గుమ్మం వేపు అడుగులేస్తూ "అయితే నే వెడు తున్నా!" అని శేఖరం వెళ్ళిపోయాడు

"అమ్మయ్య! క్షణంసేపు ఒంటరిగా ఉండనివ్వరు కదా!" ఇంతలోనే కబుర్లు చెప్పుకుంటూ వెళ్ళిపోయిన జంట గుర్తుకు వచ్చారు చిన్న పెంకుటిల్లువాళ్ళది ఆ పిల్ల ఇంచుమించు పగలంతా ఇల్లలికే గుడ్డ లాంటి చీరకట్టుకుని ఎప్పుడూ పని చేస్తు న్నట్లే ఉంటుంది సాయంత్రం అయేసరికి చక్కగా అపుడే విచ్చిన గులాబీలా తయారయి భర్తతో బయటకి షికారు వెడుతుంది.

శేఖరం లాన్ మధ్యలో నిలబడి లావణ్యకేసి చూసి చిరునవ్వులో చేయి ఊపాడు. బదులుగా లావణ్య టాటా

## సుభాషితాలు

ఇతరులను సంతోషపెట్టడానికి వ్రాసేవాడు రచయిత ఎలా అవుతాడు? యితర్లకు భయపడి, వారిని సంతోషపెట్టడం కోసం వ్రాయడంకంటే వ్రాయడం మానుకోవడం ఉత్తమం. — ప్రేమ్‌చంద్




చెప్తున్నట్లు చెయ్యి వూపింది శేఖరం కారు కదిలేవరకు లావణ్య ఆలోచనలు స్థంభించిపోయాయి కారు బర్రుమంటూ దూసుకుపోయింది మళ్ళీ ఆలోచనల్లో పడింది ఎంత అదృష్టం ఆ పిల్లది' మనిషికి పేరుప్రతిష్ట ఉండడం కూడా ఒక దురదృష్టమేమో అనిపిస్తుంది శేఖరం తనూ ఎప్పుడైనా వెట్టా పట్టా లేసుకుని తిరిగారా? మెకానికల్ కారులో కూర్చుని అయిదునిముషాల్లో గమ్యస్థానం చేరడమే' అందమయిన ప్రకృతి దృశ్యాలను తిలకించే వ్యవధికూడా ఉండదు తనకి. ఒక వేళ ఖర్మచాలక అలా నడకని బయల్దేరితే అందరూ వింతగా తననే చూస్తారే! తన నాట్యం గురించి తన అందం గురించి చెప్పుకుంటూ కళ్ళప్పగించి తనని ప్రత్యేకించి చూసే చూపులకి తట్టుకోలేదు తను. నాట్యం చేసేటపుడయితే తను అందులో లీనమయిపోయింది గనక ఫర్వాలేదు

పెద్ద పెద్దవాళ్ళిచ్చే పార్టీలలో గాని డిన్నర్లలోగానీ మనసు నెమలిలా నాట్యం చేస్తూంటే అందరితో గలగలా నవ్వుతూ మాట్లాడుతూంటే శేఖరం హెచ్చరిస్తున్నట్లే చూస్తాడు తనని అందరిలా కలిసిపోవడం ఏమిటి?రిజర్వుడుగా డిగ్నిఫైడ్‌గా వుండాలంటాడు శేఖరం తృళ్ళుతూ. నవ్వుతూ, పరిగెడుతూ ఆ చిన్నతనపు రోజులు మధురస్వప్నంలా గుర్తుంచుకో

రాదు.

"అమ్మా! కాఫీ తీసుకుంటారా?" రాజమ్మ వచ్చింది గుమ్మందగ్గరికి

"వద్దు!" అంది లావణ్య. అంతలోనే శేఖరం తొమ్మిది దాకా రానసే సంగతి గుర్తుకు వచ్చింది. వెళ్ళిపోబోతున్న రాజమ్మను పిలిచి—

"ఇదిగో చూడు రాజమ్మా' పాలున్నాయా ఇంట్లో?" అనడిగింది.

"ఉన్నాయమ్మా "

"అయితే కొంచెం కోవా చేసి పెట్టవూ?" చిన్నపిల్ల తల్లిని చుట్టుకొని ఆశగా అడుగుతున్నట్లనిపించింది రాజమ్మకి.

"కాని బాబుగారేమయినా " అని

"ఆయన తొమ్మిది దాకా రారు. ఈ లోపున చెయ్యలేవా?"

"అలాగేనమ్మా" రాజమ్మ వెళ్ళిపోయింది

ఇంకాస్సేపటిలో తన కిష్టమయిన కోవా తింటుంది. లావణ్యకి తలచుకుంటేనే నోరూరింది. కుర్చీలోంచి లేచి కర్టెను వేసేసింది. రికార్డుప్లేయరు వేసి మల్లీశ్వరిలో పాట పెట్టింది ఫోమ్‌బెడ్డు మీంచి కాళ్ళాడిస్తూ పాటలో కలిసేటట్టు తనూ రాగం తీసింది. ఒళ్ళు పెరిగితే పెరుగుగాక! ఇవాళ్టి నుంచి తన కిష్టమయిన వన్నీ తింటుంది. ఇంక శేఖరం ఎన్ని ఆంక్షలు పెట్టినా సరే! కడుపునిండా ఇష్టమయినవి తినడానికే ఉండదు, "లావయి

---

పోయి చూడడానికి అసహ్యంగా తయారవుతే నీకు డాన్సు బావుంటుందా?" శేఖరం అడిగినట్లయింది. "ఫర్వాలేదు నాట్యాన్ని వదిలేస్తాను బరువైన ఈ బంగారు కిరీటం ఇంక మొయ్యలేదు తను. అలా ఆలోచనలోకి మునిగి పోయింది లావణ్య

"రాజమ్మా! ఒళ్ళు దగ్గర పెట్టుకుని పని చెయ్యి! ఒకసారి ఎపుడో చెప్పినట్లు గుర్తు. నా ఇంట్లో నా ఇష్టం వచ్చినట్లు పని చెయ్యాలి నీ ఇష్టం వచ్చినట్లుగాదు" విసురుగా శేఖరం గొంతు కఠినంగా వినపడింది లావణ్యకి

ఇంత పెంద్రాళే వచ్చేసాడేం? విస్తుపోతూ అనుకుంది లావణ్య 'రాజమ్మ కోవా చేయడం చూసిఉంటాడు' నిరాశగా అనుకుంది ఏమైనా అంటాడేమోనని భయం వేసింది. సాధారణంగా అంత కోపం ఎప్పుడూ రాదు శేఖరానికి

కర్టెను తొలగిస్తూ శేఖరం వచ్చాడు. టై వూడదీసి సోఫాలో అలసటగా కూలబడ్డాడు

"ఏం? శేఠ్ దగ్గరకి వెళ్ళలేదా?" చిన్నగా అడిగింది లావణ్య.

"శేఠ్ ఢిల్లీ వెళ్ళాడు" ముభావంగా అన్నాడు

అందుకా ఇంత తొందరగా వచ్చింది అనుకుంది లావణ్య మనస్సుని ఉల్లాస పరుస్తూ మరో ఆలోచన మొలకెత్తింది లావణ్యకి. కొన్ని బట్టలు డాన్స్‌కి కావలసిన బట్టలు వస్తువులు అన్నీ సర్దింది. మౌనంగా చూస్తూన్నాడు శేఖరం. లావణ్యని కూడా ఏదో అన్దామని ఉంది గాని ఆమె ముఖం చూస్తే కోపం చల్లారిపోతోంది శేఖరానికి.

"శేఖర్! నేనొకటి చెప్పనా? కాదనకూడదు" సోఫా చేతిమీద కూర్చుంటూ గోముగా అంది

"ఏమిటీ?" లావణ్య చేతివేళ్ళు సున్నితంగా తాకుతూ అన్నాడు

"మనం రైళ్ళో వెళదాం."

తేలో పాము వచ్చి మీదపడినంత కంపరంగా చూశాడు

"నీకు మతిపోయిందా లావణ్యా? లేక నాకే పోయిందా?" విసుగు ప్రస్ఫుటమౌతూనే ఉంది శేఖర్ మాటల్లో

"ఏం రైల్లో వెళ్ళకూడదా?"

"నా కిష్టంలేదు."

అన్నీ నువ్వు చెప్పినట్లే వినాలి. ఇలాగే ఈ బంగారు పంజరంలో చిలకలా బ్రతకవలసిందే' కోపం పెల్లుబికింది లావణ్యకి సాధ్యమయినంతవరకు అదుపులో పెట్టి అక్కడ్నించి లేచి ఏదో మర్చిపోయినట్లుగా సూటుకేసంతా ఓ మాటు చూసి మూసేసింది

తనకి స్వేచ్ఛ లేదని తలుచుకున్నప్పుడల్లా ఏదో అయిపోవా లనిపిస్తుంది. బ్రతుకుమీదే విరక్తి పుడుతుంది.

* * *

శేఖరం ఇష్టప్రకారంగానే జరిగింది ప్రయాణం. ప్రపంచంలో డ్రైవరూ శేఖరం తనూ తప్ప మరెవరూ లేరా అనిపిస్తుంది అలాటి ప్రయాణంలో. అనుకున్న దానికంటే ఎక్కువమంది వచ్చారు లావణ్య నాట్య ప్రదర్శనానికి

ఊపిరి సలపనట్లుగా అభినందించే

ప్రేక్షకుల మధ్యలోంచి ఎలానో ఊడి పడింది లావణ్య. గ్రీన్ రూములో ఆభరణాలన్నీ ఊడదీస్తూ బాక్సులో పడేసింది. మామూలు చీర జాకట్టు ధరించింది జడకున్న పూలను విప్పదీస్తూ అంది లావణ్య. "శేఖర్! ఎలాగూ ఇంతదూరం వచ్చేం గదా? ఊరు చూసిపోదామా?"

"సోదరీ! లావణ్యా! నీ డ్యాన్సుకోసమని అక్కడి బిజినెస్ ట్రాన్ జాక్షన్లన్నీ కాన్సిల్ చేసుకుని వచ్చానని నీకు తెలుసుగా కనీసం రేపయినా అక్కడికి చేరాలి మనం "

పొడుగాటి చేతిగోళ్ళను దగ్గరగా పెట్టి చూస్తూ అంది లావణ్య

"చిన్న రిక్వెస్ట్. ముందు కారు తీసుకొని నువ్వెళ్ళిపో! నేను రెండు మూడు రోజుల్లో వచ్చేస్తాను. సరేనా?" ఆశగా అడుగుతోంది.

"నువ్వొక్కర్తివీ వస్తావా? ఏమో బాబూ నిన్ను ఒకర్తినీ ఇంత పట్నంలో వదిలేసి వెడితే నా మనసంతా నీ మీదే ఉంటుంది "

శేఖరం ఒకమాట అన్నాడంటే దాన్ని తిరిగి వెనక్కి తీసుకోడు ఆ సంగతి తెలిసి యింకా అడగడం తనకిష్టం ఉండదు. ఏదడిగినా కాదు అనే సమాధానమే వస్తుందే? ఛీ ఛీ తనదీ ఒక బ్రతుకేనా? అందరికీ తాను బంగారుబాట

## సుభాషితాలు

తెలుసుకో, తెలుసుకో నిజాయితీగా, ఋజువుగా వుండటం ఎన్నటికీ మంచిదికాదు.

— షేక్స్పియర్




మీద పయనిస్తున్నట్లుగా కనుపిస్తుంది. కానీ దానికింద కుతకుతలాడే లావా ఉందని ఎవరికీ తెలియదు. తెలుసుకునేందుకు ఎవరూ ప్రయత్నించరేమోకూడా? శేఖరం మాటలకి ఉలికిపడుతూ ఆలోచనల్లోంచి తప్పుకుంది

లావణ్యకి కోపం వచ్చిందని తెలుసుకున్న శేఖరం "మరోసారి తీరిగ్గా వద్దాం సరేనా?" నెమ్మదిగా బ్రతిమాలుతున్నట్లుగా అన్నాడు.

అలాగే అన్నట్లు తలవూపింది. ఇంతలో ఎవరో రావడంతో వాతావరణం తేలిక యింది.

* * *

అలవాటు ప్రకారం తన కిటికీలోంచి బయటికి చూస్తున్నట్లు నటిస్తూ ఒక కంట ఎదురింటిలో ఆ అమ్మాయినే చూస్తోంది లావణ్య ఎంతపుణ్యం చేసుకుందో ఆపిల్ల చెంగుచెంగున గెంతుతూ లేడికూనలా రాగం తీసే వాగులా ఎప్పుడూ ఏదోచేస్తూనే ఉంటుంది. తనువంటచేసి భర్తకి పిల్లడికీ పెడుతుంది వాళ్ళు మెచ్చుకుంటూ అభి మానంగా చూస్తూ తింటారు అంతకంటే అదృష్టం వేరే ఉందా? తెలతెలవార తుండగానే ఇంటిముందు ముగ్గువేస్తుంది ఆ చక్కనివేళ్ళలోంచి ఆ ముగ్గుజాr రకరకాల అందాలు సంతరించుకుంటుంది ఎంత ఆర్టు నిజంగా? తను ఒకపిచ్చి బొమ్మకూడా సరిగా వేయనేలేదు అందరిలా హాయిగా నడచి షికారుకొ

పేరంటానికో వెడుతుంది. ఈ ఆలో చనలు తనని పీక్కుతినేస్తాయేమో అన్న ట్లుగా వెంటనే అక్కడ్నించి లేచి వచ్చే సింది. కాని ప్రాణంలో శరీరంలా అవి అక్కడే కూర్చోలేదు. లావణ్యమెదడులో ఏదో వెదుకుతున్నట్లే తిరుగుతున్నాయి

లావణ్య అంటే తెలియని వారిమధ్య జీవించాలని ఉంది తనకి. కాని తన పేరు భారతదేశమంతటా మారు మ్రోగుతోందే? పేపర్లు తనని ప్రశంసించినప్పుడల్లా శేఖరం ఎంత పొంగిపోతాడో తను భార్య కావడం తన పూర్వజన్మ సుకృతం అంటాడు అది తనకెంత మాత్రం సంతో షం కలిగించదు. అందరిలాగే సామాన్య మైన జీవితం గడిపే భాగ్యం తనకి భగవంతుడివ్వలేదేం? అని బాధవస్తుంది హాయిగా సినిమా చూసేందుకు కూడా లేదు. దొంగతనం చేస్తున్నవారిలా చీకట్లో వెళ్ళిరావడం. అభిమానులు తన్ని గుర్తు పట్టి చుట్టూమూగుతారు. ప్రజలకు తను తెల్సినదే అయినా ఏమిటో ఎప్పటికపుడే వెర్రి. వింతగా కళ్ళప్పగించి చూస్తే తన కసహ్యం ఎటువంటి స్పెషాలిటీ లేకుండా ఆ అమ్మాయిలా జీవితం గడపగలిగితే? ఈ జన్మకి అంత అదృష్టం ఉంటుందా? సన్నగా నిట్టూర్చింది. లావణ్య దిండు మీదకు తల ఆన్చి కళ్ళు మూసుకుంది అల్చిప్పల్లాంటి కళ్ళల్లోంచి రాలిన కన్నీటి ముత్యాలను ఆత్రంగా తనలో కలిపేసు కుంది దిండు

* * *

ఆహా? ఏమి జీవితం ఆమెది. సినిమా ల్లోలా మంచి అద్దాలమేడ. ఆ మేడలో మంచి ఫర్నిచరు తప్పక ఉంటుంది. బయటికి వెళ్లాడే కర్టెన్లు చెప్తాయి లోపల ఎంత హుందాగా ఉంటుందో! అద్దాల కిటికీలోంచి అందమైన దేవతలా చూస్తూం టుందావిడ. కాలు కిందకి దింపకుండా కార్లు ఇంటినిండా నౌకర్లు చాకర్లు. భార్య వల్ల ఆ భర్తకి వయసుకు మించిన గౌరవము లభిస్తుంది. ఎంత చక్కని జీవితం?

ఆవిడ స్టేజి ఎక్కిందంటే టిక్కట్లు బ్లాకులో కూడా దొరకవు. ఎక్కడికెళ్ళిన హారతులు పట్టేవారే అందరూ. ఒక్క క్షణమైనా అటువంటి జీవితం అనుభవిస్తే ఒక్కక్షణం శరీరం గగుర్పాటు చెందింది రాధకి. తన మనసులో ఆశలన్నీ భర్తకి చెప్తూంటే "ఏ నెలకానెల అప్పులేకుండా బ్రతుకున్నాం. అందుకు సంతోషించు రాధీ" అంటారాయన. మనలాగా కడుపు నిండా తిండిలేనివారెంతమంది ఉన్నారో? తన భర్త ఆ విధంగా తృప్తి పడ మంటారు. ఊరు పేరూ లేకుండా ఏదో బ్రతికేస్తున్నాం అనే బ్రతుకు ఎందుకు? దేవుడు తనకి ఒక్కటాలెంట్ ఇచ్చాడు కాదేమిటి ఏదో లేచింది మొదలు తరుము కొస్తున్నట్లే ఉంటాయి పనులు ఆయనని బాబుని ఇంట్లోంచి పంపేసరికి తలప్రాణం తోకకి వస్తుంది వంట టిఫెన్లు బడికి పంపడం తన ప్రాణాలు తీసికెళ్ళేందుకు యముడు వచ్చినా పది దాటేదాకా ఉండు నాయనా? అని చెప్పాలేమో అనిపిస్తుంది తీరా వాళ్ళు వెళ్ళాకా తీరికగా కూర్చుందా మంటే మాసిపోయిన బట్టలో, మాపనేం చెప్తావు అని వేళ్ళాడే బూజులో పన్నెం

డయితె నన్ను కట్టేస్తారు సుమా అని బెదిరించే కుళాయి ఊపిరి సలపనివ్వవు.

ఇవన్నీ చూసుకుంటుంటేనే వచ్చేస్తారు వాళ్ళు మళ్ళీ రాత్రివంట ఇలా వంట తిండీ వంటా ఇలాగే ముపిలిదయి పోతుంది అప్పుడు కూడా తీరిక ఉండ దేమో కోడలు మనుమలుఅంటూ సంసార చక్రం కింద పడి నలుగుతూ ఉంటుంది. ఇంకే విధమయినటువంటి ప్రత్యేకతా ఎవరిచేతా గుర్తింపులేని ఈ జీవితం నిజంగా ఆలోచిస్తే అనవసరం కూడా! పోనీ అని కనీసపు కోర్కెలు కూడా తను తీర్చుకోలేక పోతోందే! ఎప్పుడయినా దూరపు సినిమాకి టాక్సీ కాకపోయినా రిక్షాలోనయినా వెళ్దామంటుంది. "రాధా శుభమయిన కాళ్ళు భగవంతుడిచ్చాడు. వాటికి పని కల్పించు" అంటారు తనభర్త. సరదాపడి ఫారెన్ నైలెక్సు కొనుక్కో-వాలని శ్రావణమాసంలో ఎంత వుబలాట పడిందీ? ఇంట్లో వాడుకునేందుకు రెండు చీరలు ఆయన తెస్తే నోరు మూసుకుంది 'అదీ నిజమే. కట్టుడు చీరలులేవుగాని అంత ఖరీదు చీర కొనుక్కుంటే ఎలా జరుగుతుంది?

అలాంటి అద్దాల మేడింటిది కాక పోయినా రెండు గదుల స్వంత ఇల్లుంటే? ఇంటిముందు చక్కని మొక్కలు వెనక కూరగాయల మొక్కలు మంచి మంచి పెయింట్లు గోడలకి వేసి గోడలకు మంచి చిత్రాలు వేళ్లాడదీస్తే?ఓహ్!ఎంతఅందంగా ఉంటుంది? ఈ కోరికలకి ఇక అంతు ఉండదేమో? ఇలా ఆలోచిస్తూంటే! లేవాలి పనిచేసుకోవాలి.

లేచి ఒకమాటు చిర దులుపుకుని పమిటచెంగు దోపుకుంటూ పనికి ఉపక్ర మించింది రాధ. చేతులు పనిచేస్తున్నా మనసు మళ్ళీ అద్దాల మేడలోకి దూరింది. ఆవిడ ఎపుడు బయటికి వెళ్ళినా ఆ పాల పిట్ట రంగుకార్లోనే వెడుతుంది. ఆ రంగంటేనే తనకి ప్రాణం. మొన్నటికి మొన్న తిరపతికి కనీసం టాక్సీలో వెడదా మండి అంటే ఆయన వినందే! ఆ థర్డు క్లాసు రైల్లోనే ఆ గోలలో కేకలలో బయల్దేరారు ఆలోచనలను భగ్నంచేస్తు చిన్నగా ఆట్టే శబ్దం చెయ్యకుండా ఊయ్యాల లూగుతున్నట్లుగా వచ్చిఆగింది. ఎదురింటివారి కారు ఆసక్తిగా చూసింది రాధ. కార్లోంచి దిగుతున్న లావణ్యచూపు కూడా ఇటే తిరిగింది. ఆ ఇంటికి ఈ ఇంటికి దూరం ఎంతో లేకపోయినా అది కనిపించని అఘాతం, ఆ అఘాతానికి ఇరువైపులా రెండుకొండలు. ఆ కొండల మధ్యదూరం కూడా ఎక్కువే. ఎవరి మనసులలో వారే ఆ రెండవ ఆమె చేయి అందుకోవాలని చూస్తున్నారు. రెండు కొండలమీదా నిలబడి, లావణ్య చూపుకి ఆ పెంకుటింట్లోనే కాపురం రాధ మన సెపుడూ అద్దాలమేడలో విహరిస్తుంటుంది. ఆ ఆలోచనలకి కప్పిన ఆశల తెర తొల గిస్తేనేగాని వారి వారి స్థితి తెలియదు. ఆ దూరం నుంచి ఆ కొండలు అందమైనవనే అనిపిస్తాయి అంతవరకూ అందిమీది జీవితం కూడ సౌఖ్యవంతమైనదనే భ్రమ కలిగిస్తుంది వారిరువురికీ. ***

# గదులు

[illegible] నా గది-నీ గది ప్రక్క-ప్రక్కనే ఉన్నాయి. అయినా! ఈ గది అటుగాని ఆ గది యిటుగాని మారలేవు రెంటికి తమ-తమ హద్దులున్నాయి. రెంటి మధ్య కేవలం ఒక సన్నని గోడ మాత్రమే ఉంది. పొరపాటున ఎప్పుడన్నా ఏదైనా నీ చేతిలోనుంచి జారిపడిందా ఆ ధ్వని నా గదిలో వినిపించేది. పైగా నా గదిలోనే జారిపడినట్లనిపించేది నీకు గుర్తుందా ఒకరోజు గోడకు నీ వైపు మేకు కొట్టిస్తుంటే గోడలన్నీ అదర సాగాయి. నేను లేచి బయటికి వచ్చాను నీవు ఏంచేస్తున్నావో చూద్దామనిపించింది. నీ గది మొత్తలో దళసరి డోర్ కర్టెన్ నిండుగా వ్రేలాడుతూ నన్ను నిరాశ పరిచింది ఇప్పుడు దళసరి డోర్‌కర్టెన్‌లు వ్రేలాడదీయటం ఫ్యాషన్ అయ్యింది.



నువ్వు ఒప్పుకోవు గాని—గదిలోని రహస్యం బైటపడకుండా ఉండటానికే యీ డోర్ కర్టెన్లు అవును సుమీ మరిచే పోయాను—అలాంటి డోర్ కర్టెన్ నా గదిముందు గూడా వ్రేలాడుతుంది

అప్పుడు నువ్వు బంత్రోతును చివాట్లేసేటప్పుడు నా కలం తనంతట తానే ఆగిపోతుంది విషయమేమిటని అడగాలనిపిస్తుంది మళ్ళీ అనిపిస్తుంది—బంత్రోతును చివాట్లుబెడ్తుంటే—నేను శ్రద్ధగా వినటం, నీకు నచ్చకపోవచ్చని. నీకు తెలియకపోవచ్చు గాని—నువ్వు గట్టిగా నిశ్వసించినా అది నా గదిలోకి వచ్చేదాకా ఆగదని నీ ప్రతి కదలిక నాకు తెలుస్తుంటుంది.

ఒకరోజు నా గదిలో ఫ్యాన్ ఆగింది. బహుశ విద్యుత్ప్రసార లోపంగావచ్చు. కొద్దిసేపు నేను చిర్రెత్తి పోయాను. ఉక్కను భరించలేక మన గదుల ముందున్న వరండాలోకి వచ్చేశాను. నాకు తెలుసు నీ గదిలో ఫ్యాన్‌గూడా తిరగటం లేదని. అయినా నేను కొంచెం నీ గదిలోకి తొంగిచూచి "మీ ఫ్యాన్ తిరుగుతుందా?" అని అడిగాను. నా ఉద్దేశంలో "లేదు, తిరగటం లేద"ంటూ నువ్వు వరండాలోకి వచ్చేస్తావనుకున్నాను.

"ఒకటి రెండు నిమిషాలు బయటికి వచ్చి నిలబడటంలో భయమేముంది?'

"లేదు. ఫ్యాన్ తిరగటంలేదుగాని వెనుక కిటికీలు తెరిచే"న్నావు. గాని

గదిలోంచి వరండాలోకి వచ్చేశాను నేను ఎంత నిరాశ చెందానో నీకేం తెలుసు?

ఒకసారి పని చేస్తున్నప్పుడు నా చేతి నుండి కలం జారిపడింది పాళీ వంగి పోయింది. అప్పుడు నీ గదిలోనుండి కలం తెప్పించుకుందామనుకున్నాను. కాని నా దగ్గర కలం అదనంగా లేదని నువ్వేక్కడంటావోననే భయం. అంటావనే నమ్మకం లేదు. చాలాసార్లు ఇలాగే అవుతుంది ప్రశ్నలు మనమే వేసుకొని జవాబులు మనమే యిచ్చుకుంటాము.

మన గదులను వేరుచేసే యీ గోడ కూలిపోవాలని అప్పుడప్పు డనిపిస్తుంది గాని దానివల్ల నీకూ గది పూర్తిగా ఉండదు నాకూ గది పూర్తిగా ఉండదు సువిశాలమైన పెద్ద గదిలో ఒకవైపు నువు మరోవైపు నేనూ అవుతే-గాని అట్లవుతే బాగుండదేమో! భవనం కట్టించినవాడు ఏదో ఆలోచించే ఇలా వేరు-వేరు గదులు చేసి వుంటాడు గదూ!

మళ్ళీ యీ దృఢమైన సిమెంటు గోడ లోంచి గూడా ఒక్కొక్కసారి నిన్ను చూడగలుగుతున్నట్లుండేది. అప్పుడు అనిపించేది. ఇప్పుడు నువ్వు పనిచేయటం లేదని, ఇప్పుడు కప్పుకేసి చూస్తున్నావని, మరొకసారి చేతిలోని గీతల్ని పరిశీలించుకుంటావు ఒకసారి ఫైళ్ళు విప్పి మరుక్షణమే కట్టి పడేస్తున్నట్లు ఒకసారి బూట్లు విప్పిపడేసి మళ్ళీ తొడిగేసావని—

ఒక్కొక్కసారి నువ్వు చాలా సంతోషంగా ఉంటావు. అప్పుడు బల్లపై ఉన్న గుండ్రని పేపరువెయిట్ గిర-గిర త్రిప్పుతావు. మెల్లిగా యీలవేస్తుంటావు. కుర్చీని గోడకానించి చేరగిలబడి కాళ్ళు వేలాడవేసి ఊపుతుంటావు. అప్పుడు నేను నా గదిలో ఏ మాత్రం ధ్వని కానివ్వను ఎందుకు? అంటావా? నా గదిలో అలికిడవుతేనీ ఆనందానికి అంతరాయం కలుగుతుందని

ఒకొక్కసారి నువ్వు వస్తూ పోతూ గది బయట కనిపిస్తావు "విశేషాలేమిటని" యాదృచ్ఛికంగా అడుగుతావు

నేను చిరునవ్వుతో "ఏమీ లేవంటూ"ను నువ్వు నీ గదిలో కెళ్ళిపోతావు - నేను నా గదిలోకి. ఆ గది యిటుగాని యీ గది అటుగాని మారలేవు రెంటిమధ్య ఒక సన్నని గోడ మాత్రమే ఉన్నా వాటికి తమ తమ హద్దులున్నాయి

నువ్వు ఏ రోజు ఆఫీసుకురావో- నీ గదిలో కూర్చోవో, ఆరోజు నా కేదోలా ఉంటుంది. నా మనస్సు పరిపరివిధాల పోతుంది. ఆరోజు ఎన్నిసార్లు గడియారం చూసుకుంటానో తెలియదు అనేకసార్లు మంచినీళ్ళు త్రాగుతాను ఎవరెవరికో ఫోనుచేస్తాను. పేరుకపోయిన పాత ఫైళ్ళపై దుమ్ము దులుపుతాను- ఒక్క ఫైలుగూడా డిస్పోజు చేయలేను గదిలో ఉండలేక బయిటికి వచ్చేస్తాను. తెలిసి ఉండగూడా నీ బంట్రోతు నడుగుతాన

మూలం
డా॥ దులీప్ కౌర్ టివాణ

తెలుగు
'మంజు'

# చదువుల తల్లి సమక్షంలో....

ఈ నాడు చాలామంది పేదవారు కూడా తమ పిల్లలకు చదువు చెప్పించాలని అనుకుంటున్నారు. ఉన్న ఊళ్ళోనే అయితే ఏదో విధంగా కష్టపడి చదివించగలుగుతున్నారు. పొరుగూరు పంపించి చదివించవలసి వస్తే మాత్రం చాలా కష్టం వారికి. పిల్లల్ని హాస్టలులో వుంచి చదివించాలి అంటే మాటలా! నిజానికి యీ హాస్టలు ఖర్చు తగ్గిస్తే చాలా మంది తమ పిల్లల్ని చదివించగలుగుతారు.

విద్యార్థి హాస్టళ్ళకు అవసరమయ్యే బియ్యం, గోధుమలు, గోధుమ ఉత్పత్తులు, పంచదార వంటి నిత్యావసర సరకుల్ని కంట్రోలు ధరలకు ప్రభుత్వం అందజేస్తోంది. కేవలం ప్రభుత్వ యాజమాన్యంలో వున్న హాస్టళ్ళకే కాక ప్రయివేటు ఏజన్సీలు నడిపే హాస్టళ్ళకు కూడా యీ సౌఖర్యాన్ని ప్రభుత్వం కల్పిస్తోంది.

దీనివల్ల యిప్పటివరకు 2236 హాస్టళ్ళలో వుంటూ వున్న 1,42,000 మంది విద్యార్థులకు లాభం చేకూరింది. వీరిలో 44 వేల మంది షెడ్యూలు కులాలకు చెందిన విద్యార్థులు కూడా వున్నారు. ఒక్కొక్క విద్యార్థికి నెలసరి భోజనపు ఖర్చు యిప్పుడు 10 రూపాయలు - 20 రూపాయల మధ్య తగ్గినట్టు సమాచార సర్వేలో తేలింది.

ఇటువంటి హాస్టళ్ళలో సాధారణంగా పేద విద్యార్థులే వుంటారు. డబ్బున్నవారి పిల్లలు చదువుకోడానికి పొరుగూళ్ళకు వెళ్ళినప్పుడు సాధారణంగా ప్రయివేటు యిళ్ళల్లో గదులు అద్దెకు తీసుకుని వుంటూ వుంటారు. అందువల్ల ప్రభుత్వం కల్పించే యిలాంటి సౌకర్యంవల్ల ఎక్కువగా ప్రయోజనం పొందేది పేద వర్గాలకు సంబంధించినవారే. బలహీన వర్గాల పేద విద్యార్థుల విద్యాభివృద్ధికి యిది పరోక్షంగా ఎంతగానో దోహదం చేస్తుంది.

సమాచార, పౌర సంబంధ శాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము.

'అయ్యగారు రాలదు! అని.

అప్పుడతను - నీ గురించి తప్పేళ్ళు చెప్తాడు 'అయ్యగారి వంట్లో బాగుండ లేదనో - బంధువులొచ్చారనో- క్యాంపు కెళ్ళారనో!

నీవు ఆఫీసుకు రానిరోజు అనవసర మైన ఆలోచనలు గూడుకుంటాయి నేటికి వంద సంవత్సరాల క్రితం ఇక్కడే ముండేది? ఎవరుండేవారు వంద సంవ త్సరాల తరువాత ఎవరుంటారు వారి భావాలెలా ఉంటాయి మనుషులు చని పోవటం ఎంత ఖాయమో - పుట్టటం కూడా అంతే ఖాయం ఇలాంటి ఆలో చనలతో వణికిపోతాను గటగటా నీళ్ళు తాగేస్తాను ఇలా ఎన్నిసార్లు త్రాగుతానో లెక్కించలేను గదిలో భయమేసి- ఆఫీ సులో కెళ్ళి కూర్చుంటాను

నువ్వు వచ్చినరోజు తెలిసిగూడా అడుగుతాను "ఇన్నిరోజులు రాలేదమని" అడుగకూడదనుకుంటానుగాని అడుగ కుండా ఉండలేను

"ఆరోగ్యం బావుండలేదంటావు."

"ఇప్పుడు కుదుటపడింది గదా?"

"ఆ! యిప్పుడు- మీ దయవల్ల కుదుటపడింద"ని అంటావు నువ్వు నీ గదిలో కెళ్ళిపోతావు నేను నా గదిలోకి నువ్వు నీ పనిలో లీనమైపోతావు నేను నా పనిలో ___

నీకు గుర్తుందా? ఓసారి నేను సెలవు పెట్టాను నువ్వు నా బంట్రోతునడిగావు "అమ్మగారు రాలేదా"ని అతను 'జ్వరం వచ్చిందన్నాడట '

"అలాగా!" అని నువ్వు ఎప్పటిలాగే నీ గదిలోకి వెళ్ళిపోయావుట. పోస్టు తెచ్చి నప్పుడు నా బంట్రోతు నువ్వడిగినట్లు

పంజాబి విశ్వవిద్యాలయం పంజాబి భాషా విభాగంలో రీడర్‌గా పని చేస్తు న్నారు. మతపు కట్టుబాట్లను గూడా ఆదర్శాలకు వదులుకున్న స్త్రీ భారత ప్రభుత్వం యీమె "సముందర్ తే సూరజ్" నవలకు కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతి నిచ్చి గౌర వించింది.

—మంజు

---

చెప్పాడు నా గుండెల్లో గిలిగింతలుపెట్టి నట్లైంది. మరునాడు నా జ్వరం కొంచెం తగ్గింది నేను నీరసంగా ఉన్నా ఆఫీసుకు వచ్చాను. బహుశ నీకు గుర్తుందో లేదో ఆరోజు నీవు బంట్రోతును రెండు మూడుసార్లు చీవాట్లు పెట్టావు

అనేకసార్లు కాగితాలు చించేసావు. తప్పులు వ్రాసి చించుకొని ఉంటావు ఒకరిద్దరికి ఇంటర్వ్యూ ఇవ్వకుండానే పంపించేశావు నేను గదిలో ఉండలేక బయిటికి వచ్చేసాను నువ్వూ బయిటికి వచ్చావు

"ఇన్ని రోజులు రాలేదేం?" నువ్వు తెలిసిగూడా అడిగావు

"ఆరోగ్యం బావుండలేదు "

"ఇప్పుడు కుదుటపడింది గదా?"

"ఆ! ఇప్పుడు మీ దయవల్ల కుదుట పడిందంటూ నేను నా గదిలోకి వచ్చే సాను. నువ్వు నీ గదిలోకి వెళ్ళుంటావు. ఈ గది అటుగాని ఆ గది ఇటుగాని మారలేవు రెంటికి తమ తమ హద్దు లున్నాయి రెంటిమధ్య ఒక ఇటుక సిమెంటుతో కట్టిన గోడ ఉంది. ఒక గది నీది ఒక గది నాది మన గదులు ప్రక్క ప్రక్కనే ఉన్నాయి అదే చాలని. మన మధ్య కేవలం ఒక గోడేగదా ఉంది. ***

# 31

'బరువు వదలిపోయింది. తిరిగి ఎప్పటి స్వేచ్ఛ వచ్చింది.' అనే సంతోషం ఉమ ప్రతి చర్యలోనూ కొట్టవచ్చినట్టు కానవస్తూన్నది

"వెధవ. బాగానే వున్నాడు లోకంలో కావలపినవాళ్ళు ఛస్తూంటారు. వద్దను

జరిగిన కథ

శివరావు సౌమ్యుడు, పై మెరుగులకుకాక వ్యక్తిత్వాలకు విలువనిచ్చే వ్యక్తి. ఆయన భార్య మీనాక్షి అందుకు పూర్తిగా వ్యతిరేకం. వారికున్న ఇద్దరాడపిల్లలో పెద్దది ఉమ. గుణాలకు తల్లి పోలిక. తండ్రి గుణాలకు వారసురాలు సుందరి ఆర్థిక చిక్కులలో వున్న గాయక కళాకారుడు సత్యమూర్తికి మీనాక్షి అభ్యంతరం పెట్టినా తన పర్సనల్ అసిస్టెంట్‌గా ఉద్యోగం ఇచ్చాడు శివరావు మీనాక్షికి ఇదేమీ నచ్చలేదు. శివరావుతో కలిసి సత్యమూర్తి ఇంటికి వెళ్ళినప్పుడు, సత్యమూర్తి తల్లి చూపిన ఆదర భావమూ, ఆ తల్లీకొడుకుల మధ్యగల అనుబంధమూ చూసి ముచ్చటపడిన సుందరి సత్యమూర్తివైపు ఆకర్షితురాలయింది విదేశాలకు వెళ్ళిన కుమార్ తిరిగి రాగానే ఉమ కిచ్చి పెళ్ళిచేయాలని మీనాక్షి సంకల్పం ఉమ జీవితంలోకి శంకర్ ప్రవేశించాడు ఇద్దరూ బ్లూఫిలిమ్స్ చూశారు. అంతే! ఉమ తననుతాను మరిచిపోయింది. ఉమ గర్భిణి అని తెలవడంతో మీనాక్షి నెత్తిన పిడుగు పడినట్లయింది ఈ దుర్వార్త తెలిసిన శివరావు తట్టుకోలేకపోయాడు. శివరావుగారి కుటుంబం అవమానాల పాలుకావడం చూసి తట్టుకోలేని సత్యమూర్తి ఉమను పెళ్ళాడాడు. అయినా వారిద్దరూ భార్యాభర్తలుగా ఉండలేకపోతున్నారు. ఉమ అత్తగారింటికి వెళ్ళనని భీష్మించింది. సుందరి చదువు మానేసేందుకు నిర్ణయించుకొంది. తనను ప్రేమించిన సుందరికి అన్యాయం చేశానని కుమిలిపోయాడు సత్యమూర్తి కేవలం తండ్రిపై కృతజ్ఞతతో ఎవరి నేరమో తనపైన వేసుకొని సత్యమూర్తి ఉమను పెళ్ళాడాడన్న నిజం సుందరికి తెలిసి కృంగిపోయింది. ఉమ జీవితాన్నొకదారికి తెచ్చే ప్రయత్నంలో సత్యమూర్తి విజయవాడ ఆఫీసు నిర్వహణ పేరుతో ఉమను తీసుకొని బయల్దేరాడు ఉమకు తోడుగా ఉండేందుకు సుందరి కూడా బయలుదేరింది ఉమ అహంభావపు ప్రవర్తన తట్టుకోలేని సత్యమూర్తి తల్లి తీర్థయాత్రలకు వెళ్ళింది. శంకర్ కూడా విజయవాడ వచ్చాడు. తరచూ ఉమను కలుసుకొంటున్నాడు ఉమకు కొడుకు పుట్టాడు.

కున్న త్రాష్టులు బ్రతికేస్తూ వుంటారు." అని ఉమ తల్లితో మాట్లాడేప్పుడు స్పష్టంగా విన్నది సుందరి ఒకనాడు

'ఎంతైనా తన కడుపున పుట్టినవాడు కదా—ఎలా మాట్లాడగలిగిందీ!' సుందరి

లోలోన చీదరించుకున్నది. 'సత్యమూర్తిగారి మాటలు నిజం. కాళ్ళు విరిగి మమ్మీ అక్కడ పడివుండబట్టి సరిపోయిందిగానీ, ఇక్కడికే వస్తే ఆ పసివాడిని ఊహించటానికి కూడా వణికిపోయింది.

"అబ్బ. చాలమంది ధనవంతులను చూశాంకానీ ఎంతగా ఆయాలు వున్నా కనీసం రోజుకో అరగంటకాలమైనా చేరదీస్తారు. ఈవిడ ఏమిటీ అసలు పిల్లవాడు వున్నాడా లేడా అన్న అజేలేదు. ఇలా పురిటి మంచం దిగిందో లేదో అలా షోకులూ, వేషాలూ మొదలయ్యాయి "

గుసగుసలుగా వినవస్తూన్న ఈ ఆయా వ్యాఖ్యానానికి వంటామె సమాధానం ఏమిటోనని ఆరాగా విన్నది సుందరి.

"నిజమే ఎప్పుడూ బిడ్డను ఒడిలోనికి తీసుకున్నట్టే వుండదు మొగుడిమీద ధుమధుమలాడతది— పరాయివోడిని గదిలో గంటలు గంటలు కూర్చోబెట్టి ముచ్చట్లాడతది "

"దేవుడే పాపం ఆ బాబు. మరో మొగుడెవడైనా అయితే ఆ ఆటలు సాగనిచ్చేవోడేనా?"

"మనకెందుకులే, గొప్పింటి గోలలు అయ్యన్ని "

సుందరి స్థాణువులా మారిపోయింది,

'ఇలా రకరకాలుగా అనుకుంటున్నారన్నమాట లోకులు' ఇంకేమీ కూడా అనుకోవడంలేదు కదా!'

ఆలోచనలలో కొట్టుకుపోతూన్న ఆమెకు కొద్దిసేపటికి పసివాడి ఏడుపు వినవచ్చింది ఎదుటి గదినుండి అది వాడి ఉయ్యాల గది.

ఆ ప్రక్కనేవున్న ఉమ గదిలోనికి చూచింది సుందరి తెరచాటునుండి.

అంతకంతకు అధికస్థాయిలో వినవస్తూన్న శిశువు రోదనకు ఏమాత్రమూ చలించకుండా తన బాబ్డ్ హెయిర్ సింగారంలో మునిగిపోయి వున్నది ఉమ.

పావుగంట గడిచింది.

ఉమ ముస్తాబు పూర్తిచేసుకొని, టకటకా నడుస్తూ ఎటో వెళ్ళిపోయింది

అయినవాళ్ళకే కాని అజా ఆలనా ఆయాకు ఎందుకు వుంటుంది? ఆమె ఎక్కడో ఏ లోకాభిరామాయణంలోనో మునిగివుంటుంది

'ఏడవనీయి. దిక్కుమాలిన గోల '

లోలోన విసుక్కుంటూ, రాక్ లోనుండి చేతికందిన నవలను తీసుకొని మంచంపై వాలింది, సుందరి.

రెండు నిముషాలు నడిచాయి.

"సుందరీ!"

సత్యమూర్తి స్వరం విని తృళ్ళిపడినట్లే అయి ఖంగారుగా లేచి కూర్చున్నది.

## సుభాషితాలు

నీ సంతృప్తికోసం భుజించు, ఇతరుల సంతృప్తికోసం దుస్తులు ధరించు. —ఫ్రాంక్లిన్




అతడింతవరకూ సుందరి గదిలోనికి రాలేదు, ఏనాడూ.

ఇక ఏడ్వటానికి శక్తిలేనట్టు అలపి సొలసి వెక్కుతూన్న పసివాడిని రెండు చేతులతో పట్టుకొని సుందరి వైపే చూస్తూ గుమ్మంవద్దనే ఆగిపోయాడు సత్యమూర్తి

అతడి కనులలోని ప్రశ్నను గమనించిన సుందరి, తన ఆవేశాన్ని అణచు కుంటూ అధోవదనురాలైంది

"సుందరీ ఈ అభాగ్యుడి ఏడుపు వినిపించలేదా మీకు?"

రక్కున తలఎత్తింది సుందరి

"ఆ ప్రశ్న నన్నా అడగవలసింది?"

సుందరిలో ఎన్నడూ కానరాని ఈ ఉద్విగ్నతను క్రొత్తగా గమనించిన సత్యమూర్తి అచ్చెరువందుతూ చూచాడు

"ఎవరివద్ద చనవు వున్నదో, మరెవరైతే అర్థం చేసుకొనగలరో వారితోనే ఏదైనా మాట్లాడగలం సుందరీ!"

"మంచితనానికి కూడా ఒక హద్దూ పద్దూ వుంటుంది సత్యమూర్తిగారూ" కఠినంగా అన్నది సుందరి "అందర్నీ ఉద్ధరించటానికి కంకణం కట్టుకున్నవాళ్ళు నిలువునా గోతిలో దిగబడిపోతారు, సమాధి అయిపోతారు, వారి సహనాన్ని తమ స్వార్థానికి వాడుకున్న వాళ్ళెవరికీ ఆ సమాధిపై గుప్పెడుమట్టి జల్లగల సమయము సహృదయతా కూడా వుండవు ఇది ఈ లోకపు కఠోర సత్యం."

# ఇది మన శాలువే!

మన రాష్ట్రంలో వ్యవసాయం తర్వాత చేనేత ప్రధానమైన వృత్తి మిల్లులవల్ల దెబ్బతిన్న చేనేత పారిశ్రామికుల దుర్భర పరిస్థితి మెరుగయ్యేదెట్లా? గాంధీజీ రోజుల్లో రాట్నం ఇంటింటా వెలిసింది విదేశీ మిల్లులమీద విజయం సాధించింది ఇప్పుడు దేశీయ మిల్లులు పని చేయాల్సిందే చేనేతకు స్థానం వుండి తీరాల్సిందే

ప్రధాని శ్రీమతి గాంధీ 20 సూత్రాల పథకంలో చేనేతకు చేయూత యిమ్మని పిలుపు యిచ్చారు ముందు విదేశీ వస్తువుల మోజు తగ్గిపోవాలి. ఈ మధ్య ఒక పెద్దమనిషి పరదేశం వెళ్ళి అపురూపంగా కొనితెచ్చుకున్న శాలువా, తీరా ఆరాతీస్తే అది మన దేశంలోనే జబల్పూరులో తయారైనదని తేలింది.

చేనేతకు సహకార రంగం వెన్నెముక వెనుకబడ్డ 300 సహకార సంఘాలను పునరుద్ధరించడానికీ, 25 కొత్త సంఘాలను స్థాపించడానికీ రూ. 43 లక్షల ఆర్థిక సహాయం మంజూరు చేశారు 37,500 మందికి ఉపాధి లభిస్తుంది ఎపెక్సు సంఘాలు, రిజర్వు బ్యాంకు యిప్పుడు చేనేత కార్మికుల సహకార సంఘాలకు ఆర్థిక సహాయం అందిస్తున్నాయి

రాష్ట్రంలో వస్త్రపరిశ్రమాభివృద్ధి సంస్థ ఒకటి ప్రారంభించారు ఈ సంస్థ 20 ఉత్పత్తి-కొనుగోలు సంఘాలు స్థాపించి 2,000 మందికి ఉపాధి కల్పించింది

చేనేత ఉత్పత్తిదారుల్ని మధ్య దళారీలు చేసే మోసం అరికట్టేందుకు ఎపెక్సు సంఘాలు, వస్త్రపరిశ్రమాభివృద్ధి సంస్థ ఏటా సుమారు రూ 460 లక్షలు ఖరీదుచేసే వస్త్రాలు కొనుగోలు చేస్తాయి. కంట్రోలు వస్త్రాల ఉత్పత్తి కోసం రాష్ట్రమంతటా 30 వేల మంది కార్మికులతో 19 వేల మగ్గాలు తీవ్రంగా పని చేస్తున్నాయి. చేనేత పరిశ్రమని ఆవరించిన స్తబ్ధత తొలగింది ఇది దినదినాభివృద్ధి చెందుతూంది.

సమాచార, పౌరసంబంధ శాఖ, హైదరాబాదు.

సుందరీ. ఈనాడు క్రొత్తగా వగచేదేముంది? ఎవరెవరిమీది కోపమో ఈ పసిగుడ్డుపై ప్రదర్శించి ప్రయోజనమేమిటి?" అంటూ ముందుకు నడిచాడు ఆమెకు సమీపంగా.
"చూడండి వీడికేంకావాలో కొంచం " చేతులలోని శిశువును ముందుకు చాపాడు

సర్పదంష్ట్రివలె చటుక్కున అడుగులు వెనక్కువేసింది సుందరి ఎనలేని జుగుప్సా, క్రోధమూ పడుగుపేకలుగా పరచుకుపోయాయి అందమైన ఆ వదనంపై.

"ఈ పాపపు ముద్దను ఈనాటివరకూ ఈ సుందరి చేతితో స్పర్శించకపోవడమే కాదు, కన్నెత్తికూడా చూడలేదని మీకు తెలియదనుకుంటాను తీసుకుపొండి " ఉద్వేగంతో రొప్పుతూ వెనుదిరిగి నిలబడింది

"సుందరీ!"

"హూఁ మనల్ని వేరుచేసి, మన కలల్ని కూలద్రోపిన ఈ పిశాచరూపానికి సేవలు చేయనవసరం లేదు కన్నదానికే అక్కరలేని కనాకష్టపువాడు? చావడమే మంచిది చావనీయండి "

రెండునిముషాల అనంతరం సుందరి వెనుదిరిగి చూచేసరికి అక్కడ సత్యమూర్తి లేడు

ఆమెలో ఆత్మవిమర్శ ప్రారంభమైంది

'నా మాటలతో, ప్రవర్తనతో నేనీనాడు సత్యమూర్తిగార్ని నొప్పించానా? అంత కఠినంగా మాట్లాడి వుండవలసింది కాదేమో?'

తర్కవితర్కాలతో ఆవేశం అణగి శాంతం కలిగి, సుందరి సిగ్గిలిపోయింది తన మాటలను తలచుకొని

పసివాడికి పాలుపట్టడం పూర్తిచేసి సీసా పక్కనపెట్టి లేచాడు సత్యమూర్తి వాడిని భుజంపై వేసుకొని జోకొట్టుతూ పచార్లు తిరుగుతూన్న అతడు అప్పుడు చూచాడు గదిగుమ్మంవద్ద అపరాధినిలా తలవాల్చుకు నిలబడిన సుందరిని

"ఐయామ్ సారీ " అతి తగ్గుస్వరంలో అన్నది

ఆమె మనసున రేగిన అలజడిని గమనించిన సత్యమూర్తి దగ్గరగా నడిచాడు

"సుందరీ!" ఆ స్వరంలో ఎప్పటి మార్దవతే చిందులు వేస్తూన్నది

"ఐయామ్ వెరీవెరీ సారీ "

"అటువంటి మాటలు వద్దు సుందరీ చూడండి ఈ పసి ముఖంలో మీక పాపపు ముద్ర కన్పిస్తోందా? ఇపుడిపుడే ఈ ప్రపంచంలో అడుగిడిన అమాయకుడ పాపపు ముద్దగా కన్పిస్తున్నాడా?"

అంతవరకూ ఏడ్చి ఏడ్చి అలసి వున్నాడేమో కనులు మూసుకొని నిద్రపోత న్నాడు అమాయకంగా ఇంకా వెక్కిపడుతూనే వున్నాడు నిద్రలో కూడా

చిన్ని కళ్ళు, బుల్లినోరు, ఎర్రని పెదాలు, పసిమిరంగులో పాలుగారుతూన్న

బుగ్గలు, నల్లగా మెత్తగా శిల్కులా జుట్టు.

ఈనాడే మొదటిసారిగా ఆ శిశువును కన్నెత్తి పరీక్షగా చూచిన సుందరికి ప్రప్రథమంగా వాడిపై జాలివంటి భావం ఉదయించింది.

"ఎవరో చేసిన పాపానికి బాధ్యుడు యింకా ఈ కనులు తెరవని గుడ్డు అని నేననుకోవడంలేదు సుందరీ "

సుందరి శిరస్సు భారంగా వాలింది.

"పుడుతూనే అన్యాయానికి బలిగాకుండా, అనాధాశ్రమం పాలబడకుండా రక్షించగలిగాను కాని యిలా ఎంతకాలం కాపాడగలనా- అనే నా ఆలోచన. అధైర్యం నన్ను తినివేస్తోంది వాడిప్రాణం వాడిది మాత్రమేకాదు- వంశ వారసుల కోసం తపించుపోతూన్న మీ నాన్నగారి ప్రాణం కూడా: తద్వారా మనందరిదీ."

మరి మాటలు లేకుండా మౌనంగా చేతులు చాచిన సుందరికి పసిబిడ్డను అందించుతూన్న సత్యమూర్తి ఆమె కనులలో మెదులుతూన్న పశ్చాత్తాపాన్నీ, పసివాడి యెడల నూతనంగా ఉదయించిన ప్రేమనూ స్పష్టంగా చూడగలిగాడు.

"ఒక్క మాట."

అటునుండి వెళ్ళిపోబోతూన్న అతడు సుందరి స్వరం విని ఆగాడు

"సాహసించి ఒక్క విషయం అడగాలనుకుంటున్నాను "

"చెప్పండి "

"నా అభ్యర్థనను మన్నించగలరనుకుంటాను."

"అదేమిటో తెలియనిదే?"

"అంత కూడని విషయం అడుగుతానా?"

" " అతడి నేలచూపులే సమాధానమయ్యాయి

"మీరు ఇంతటి విచక్షణా జ్ఞానం కలవారు పరాయి బిడ్డను కూడా పాలించి పెంచగల ప్రేమస్వరూపులు, కానీ అక్క విషయంలో మాత్రం అంత నిర్దయగా ఎందుకు వుంటున్నారు?"

ఈ అనుకోని ప్రశ్న అతడిని అదరిపడేట్లు చేసింది

"ప్లీజ్ సుందరీ ఆ విషయం మీరు మాట్లాడవద్దు "

సుందరి మరో రెండడుగులువేసి అతడికి చేరువగా అభిముఖంగా నిలబడింది. "క్షమించండి నేను హద్దులుదాటి మాట్లాడ్తున్నానేమో- మీ నిర్లక్ష్యం అక్కను మరింత తప్పు త్రోవలు పట్టిస్తోందేమోనని భయంగా వున్నది జరిగినది మరచిపోయి మీరూ అక్కా ఒకటవ్వాలని నేను కోరుకొనేది "

"సుందరీ " విలవిలలాడుతూ, ఆ విషయమే భరించలేనట్లుగా ముఖాన్ని ముంజేయితో అచ్ఛాదించుతూ వెనుదిరిగి నిలబడ్డాడు

"సుందరీ నిన్ను నేను మొదట గౌరవించాను. తర్వాత ఆరాధించాను నీవు

## సుభాషితాలు

ఒక స్థల ఒక కాల లో స్వర్గ లా కనపడుతు ది అదే ఇ కొక మయ లో నరకమై పోతు ది

—శ్రీశ్రీ




నన్ను కోరుకున్నదానికంటే అధికంగా నిన్ను నేను కోరుకున్నాను ఆ ప్రేమారాధనలు ఈనాటికీ చెక్కు చెదరకుండా ఈ గుండెలలో గుప్తమై వున్నాయి జన్మాంతమూ అలాగే వుంటాయి ఈ జీవితానికి మరో స్త్రీ ప్రసక్తి లేదు "

తన ఎదుట విప్పి పరచబడిన ఆ మనసు సుందరి కనులలో అశ్రుజలాన్ని పూరించింది

సత్యమూర్తిగారూ మాటలు స్పష్టంగా ఉచ్చరించలేకపోయింది దుఃఖంతో

నాకు తెలుసు సుందరీ నీ బాధ కానీ ఉమ జీవితాన్ని నేను కళంకం చేయలేను నన్ను నేను కళంకితుడను కావించుకోలేను మెడలో పసుపుతాడు కట్టినంత మాత్రాన భార్యాభర్తలు కాలేరు ఇది మనసులేని మనువు సమాజాన్ని మోసగించటానికి బాహ్యరూపమైన బంధం అంతే

"కానీ

ప్లీజ్ సుందరీ నన్ను బలవంతం చేయకు నీమీది గౌరవం నన్ను బలహీనుడిని చేయకూడదని దైవాన్ని ప్రార్థించు

గబగబా అనేసి పారిపోతున్నట్టే నడచిపోబోయిన అతడూ ఇటు సుందరీ కూడ నివ్వెరపడినట్లే నిలచిపోయారు అతిహేళనగా నిలువునా భస్మంచేసే చూపులతో

## భారతీయ ఆర్థిక వ్యవస్థ భారీ విస్తరణకు సన్నద్ధమయింది

భారతదేశం ఆర్థిక వ్యవస్థను త్వరితగతిని విస్తరించింది. ద్రవ్యోల్బణాన్ని అరికట్టి (ద్రవ్యపు విలువ పెరిగింది) ధరలు పెరగకుండా నిలకడగా ఉంచగలిగారు.

★ ఆహారధాన్యాలు ఇదివరకెన్నడూ లేనంతగా అంటే 118 మిలియన్ టన్నులు ఉత్పత్తయ్యాయి దేశంలో ఇప్పుడు 18 మిలియన్ టన్నుల ఆహారధాన్యాల నిల్వలున్నాయి

★ పరిశ్రమలలో ఆర్థిక పెరుగుదల గత ఆర్థిక సంవత్సరం మొదటి ఆరు నెలలలో కేవలం 3 శాతం ఉండగా ఈ ఆర్థిక సంవత్సరం అదే కాలంలో దాదాపు 12 శాతం ఉంది 1976-77 లో పారిశ్రామికోత్పత్తి నిరుటి ఉత్పత్తికన్న దాదాపు 10 శాతం ఎక్కువగా ఉంది

★ విద్యుచ్ఛక్తి ఉత్పత్తి 1975 ఏప్రియల్-సెప్టెంబరుతో పోల్చితే 1976లో అదే కాలానికి 16 4 శాతం పెరిగింది

★ భారతీయ ఎగుమతులు 1976 ఏప్రియల్-అక్టోబరులో గణనీయంగా అంటే 3 39 శాతం పెరిగాయి అదేకాలంలో దిగుమతులు 9 శాతం తగ్గాయి

★ విదేశ చెల్లింపుల పరిస్థితి బాగా మెరుగుపడింది. దేశస్వాతంత్ర్యానంతరం మొదటిసారిగా విదేశ మారకం నిల్వలు రూ 25,000 మిలియన్లకు పైబడ్డాయి

★ పబ్లిక్ రంగంలో పెరుగుదల రేటు 12 శాతం దాకా ఎక్కువయింది

★ రూపాయ కొనుగోలు శక్తి 17 నుంచి 21 శాతంవరకు పెరిగింది

చైతన్యపూరితమయిన ఈ సువిశాల దేశంలో సాధనసంపత్తులను సంపూర్ణంగా ఉపయోగంలోకి తెచ్చేందుకు ప్రభుత్వానికి, ప్రజలకు గల దృఢసంకల్పాన్ని ఈ విజయాలు చాటుతున్నాయి

DAVP 76/886

అంతలో సంభాళించుకుని ప్రక్కనుండి తప్పుకొని పోబోయిన సత్యమూర్తి ని ఉమ మాటలతోనే పట్టి నిలబెట్టింది

"ప్రవరాఖ్యుడు కూడా ప్రణయనాయకుడయ్యాడన్నమాట?"

"ఉమా!" సత్యమూర్తి అదిలించబోయాడు.

"ఎప్పటినుండి ఈ భాగోతం? ఇందుకన్న మాట నీకు నాపై అయిష్టం?"

"ఉమా హద్దులు తెలిసి మాట్లాడు లేకుంటే ఫలితం బాగుండదు"

"నీ హద్దులు నీకు తెలుసా. నా హద్దులు మాట్లాడటానికి? మరదలితో మంతనాలు"

"ఛీ అపప్రలాపన. కన్నదానవు కన్నెత్తి చూడకపోయినా, వాడిని సుందరి ఎలా లాలిస్తోందో చూడు?"

"ఎవళ్ళూ లాలించ నక్కరలేదు" కర్కశంగా పలికింది ఉమ "ఎవళ్ళ పనులు వాళ్ళు చూచుకుంటే చాలు వాడికోసం వున్న ఆయా ఎక్కడ చచ్చింది?"

అంతలో పరుగుపరుగున రానే వచ్చింది ఆయా.

"వీడిని నిర్లక్ష్యం చేశావంటే నౌఖరీ తీసిపారేస్తాను జాగ్రత్త" అంటూ సుందరి చేతినుంచి బిడ్డను లాక్కొని ఆయాకు అందించింది

ఆయా పారిపోయిందక్కడినుండి గండం గడిచినట్లుగా, ఉమ చరచర నడిచి పోయింది తన గదిలోకి

సుందరీ సత్యమూర్తులు అవమానభారంతో నిలచిన తావునే నిలచిపోయారు ఒకరి ముఖం ఒకరు చూడటానికి కూడ సిగ్గు పడవలసిన మాటల ఈటెలు విసరింది ఉమ

చాలసేపటికి సుందరి తలెత్తి అన్నది "నేను రేపు వెళ్ళిపోతాను ఏర్పాటు చేయండి."

"సుందరీ!" లోకమందలి విషాదమంతా అతడి గళంలోనే పలికింది "నువ్వు కూడా నాకు శిక్ష వేస్తావా?"

"ఇంతటి నిందను భరిస్తూ " దుఃఖంతో వణకుతూన్న సుందరి స్వరం మాటలు పూరింపలేకపోయింది

"పిచ్చివాళ్ళను లెక్కజేసుకోకూడదు సుందరీ, అంతే అమ్మ నన్ను వదలి వెళ్ళిపోయింది నేడు నువ్వూ అదే మాట అంటున్నావు ఆలోచించు నీ సాయం లేనిదే ఒంటరిగా ఏమీ చేయలేనేమో నేను ఒక మంచి పనికై ఎన్నో నిష్ఠూరాలు భరించాలి మరి ఉండమని అర్థిస్తున్నాను నిన్ను నేను"

ఆ సౌమ్యమూర్తి అభ్యర్థననూ హితోపదేశాన్నీ ధిక్కరించగల శక్తి సుందరికి లేదు

"ఉమను చూడటానికి ఓసారి మద్రాసు వెళ్ళే యోగం లేకపోయింది మీకు. పాపం! మొదటి కానుపు తల్లీ బిడ్డా ఎలా వున్నారో!"

మిసెస్ కైలాసం చేస్తున్న ఈ పరామర్శ తెలుకొండిలా గ్రుచ్చుకొన్నది మీనాక్షిని

"ఔను, పాపం అందులోనూ నెలలు నిండకుండా పుట్టిన బిడ్డ ఎలా పెంచుతుంటూ అవస్థలు పడుతున్నారో యేమో?"

"అయినా అల్లుడు మరీ అంత మొండిపట్టువాడు ఏమిటి? ఇక్కడ మీరీ స్థితిలో వున్నారాయె! అక్కడా ఆమె బాలెంతరాలు విజయవాడకూ మద్రాసుకూ ఏమాత్రం దూరమని? కారులో హాయిగా పువ్వుల్లో పెట్టి తీసుకొచ్చినంత సుతారంగా తీసుకురావచ్చు"

హాస్పిటల్ నుంచి ఇంటికి జేరిన శ్రీమతి మీనాక్షిని పరామర్శింపవచ్చిన స్నేహితులు అందరూ తలో వ్యాఖ్యానమూ చేస్తున్నారు

అంతా వెళ్ళాక కూడా మిసెస్ కైలాసం తిష్ఠ వేసుక్కూర్చున్నది

"నెలలు నిండకుండా పుట్టాడా మీ మనుమడు?" ఆరాగా అడిగింది

"ఊఁ" అనక తప్పలేదు మీనాక్షికి

"పాపం—మీవారైనా ఓసారి వెళ్తే బాగుండును"

"అదే అనుకుంటున్నాను వెళ్ళమంటున్నాను"

ఓ క్షణం ఏదో చెప్పటానికి పస్తాయించింది అంతలోనే ధైర్యం తెచ్చుకుని కళ్ళన్నీ బయటపెట్టి మాట్లాడడం ప్రారంభించింది

"ఎప్పుడూ మీరు పార్టీలూ అవీ యిస్తూంటే ఎంత సరదాగా వుండేదో—మీరిలా వుంటే మన స్నేహితు లెవరికీ ఏమీ తోచటంలేదు"

అంతవరకూ నిగ్రహించుకొన్న మీనాక్షి కోపం బయటపడింది

"అందరూ అలాగే సానుభూతి పలుకుతున్నారు ముఖం ఎదుట లోగడ నా సౌందర్యాన్నీ నేను కుంటిదాన్నైనందుకు చాటున బాగా సంతోషించుతున్నారని విన్నాను"

మిసెస్ కైలాసం ఉలికిపడి మరలా సర్దుక్కూర్చున్నది ఎందుకంటే చాటు మాటున అలా వాగుతూన్న వాళ్ళందరిలో తానే ప్రథమురాలాయె మరి!

"పోసిండి ఎవళ్ళెలా అనుకుంటేనేం? మీరు మరో రెండునెలలు కాస్త కర్రల సాయంతో నడవాలన్న మాటేగానీ మళ్ళీ మామూలు మనిషైపోరూ? నా మట్టుకు నాకే మీరు సుందరికంటే చిన్నదానిగా కన్పిస్తుంటారు!" కొంచెం పొగిడింది ఎందుకైనా మంచిదని.

కానీ అంతరంగంలో అగ్నిహోత్రం ప్రవేశించిన మీనాక్షి వదనంలో ఏమీ సంతోషం కానరాలేదు తెలుసు—మిసెస్ కైలాసం పొగడ్తలు ఎందుకు ప్రారం




భించిందో!

"ఒక నాల్గువేలు కావాలి మీనాక్షిగారూ "

అతి సహజంగా, ఏమాత్రం సంకోచంగానీ, బిడియంగానీ లేకనే అడిగింది.

"అన్నట్టు మీ అబ్బాయి ఫారెన్‌నుంచి ఎప్పుడొస్తున్నాడూ?" మాట మార్చింది మీనాక్షి

"మరో ఆరేడు నెలలు పడుతుందని వ్రాస్తున్నాడు మరి! అలా అడుగుతారేం 'మీ అబ్బాయి' అనీ? 'మా అల్లుడెప్పు డొస్తున్నాడూ?' అనడగండి " తెచ్చిపెట్టుకున్న కలుపుగోలుతనంతో, వికటంగా నవ్వుతూ అన్నది

"మీ క్రొత్త పిక్చర్ బడ్జెట్ వివరాలేమిటీ?" ఒకరి మాటకూ ఒకరి మాటకూ ఎక్కడా అంతనా పొంతనా లేదు

తమ దివాళా విషయం తెలిసే మీనాక్షి అంత ధైర్యంగా అడిగిందని గ్రహించిన మిసెస్ కైలాసం ఆగ్రహాన్ని నిగ్రహించుకోలేకపోయింది

"అన్నట్టు— ఇందాక ఆవిడెవరో అంటోంది తెలియని మాటకదూ—ఉమకు నెలలు గాకుండా పిల్లలు పుట్టడమేమిటబ్బా? ఇంతకూ పెళ్ళై ఎన్నాళ్ళైందీ?" జ్ఞప్తి లేనట్టు ఆరాగా అటు యిటు కళ్ళు త్రిప్పి ఆలోచనలో పడ్డది

# ఇంకానా ఇకపై సాగవు

సమాజంలో జరుగుతున్న రకరకాల ఆర్థిక నేరాలను అరికట్టనిదే ఆర్థిక వ్యవస్థ చక్కబడదు. ఆర్థిక వ్యవస్థ గందరగోళంగా వున్నంతకాలం సోషలిజం సాధ్యం కాదు.

మన దేశంలో ద్రవ్యోల్బణ పరిస్థితి నామరూపాలు లేకుండా పోయింది. విదేశాల వారు ఎందరో యీ ఘన విజయానికి ఆశ్చర్యం ప్రకటించారు.

పన్నుల ఎగవేతను అరికట్టడానికీ, ఆస్తుల విలువలను సరిగా మదింపు చేయడానికీ, స్మగ్లర్ల ఆస్తులను జప్తు చేయడానికీ, పెట్టుబడి విధానాలు సడలించి లైసెన్సుల దుర్వినియోగం ఆపడానికీ కేంద్ర ప్రభుత్వం ఎన్నో చర్యలు తీసుకుంది. వీటన్నిట్లో రాష్ట్ర ప్రభుత్వం సంపూర్ణ సహకారం యిచ్చింది.

ఆస్తుల మీద విలువ తగ్గించి చూపకుండా చేయడానికి 1975 ఆగస్టు నుండి మన రాష్ట్రంలో స్టాంపు డ్యూటీ చట్టాన్ని సవరించారు. 1975-76 లో విద్యుచ్ఛక్తి దొంగతనంగా వాడిన 5000 కేసులు విద్యుచ్ఛక్తి సంస్థ వారు పట్టుకొని వారిపై చట్టరీత్యా చర్యలు తీసుకుంటున్నారు.

మధ్యతరగతి ప్రజలకు ప్రయోజనకరంగా ఆదాయపు పన్ను విధింపు పరిమితిని కేంద్ర ప్రభుత్వం రూ. 6 వేల నుండి రూ. 8 వేలకు పెంచినందువల్ల ఎంతోమందికి లాభం కలిగింది.

జాతీయ రోడ్డు రవాణా పథకం క్రింద కేంద్ర ప్రభుత్వం వారు మన రాష్ట్రానికి 250 పర్మిట్లు కేటాయించారు. వీటి కోసం మొత్తం 1533 దరఖాస్తులు వచ్చాయి. రోడ్ ట్రాన్స్‌పోర్ట్ అథారిటీ వారు 250 పర్మిట్ల విషయంలో నిర్ణయాలు ప్రకటించారు.

బ్లాక్ మార్కెటింగ్, స్మగ్లింగ్ మొదలైన ఆర్థిక నేరాలు జరుగకుండా మన రాష్ట్రంలో గట్టి చర్యలు తీసుకున్నారు

---

సమాచార, పౌర సంబంధ శాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము

మీనాక్షి ఈ సన్నివేశాన్ని ఇదివరలా శాంతంగా ఎదు[illegible]
కోల్పోయి వున్నది కారు యాక్సిడెంటూ, తన అస్వస్థతా అన్నిటి కారణాలవలనా.
ఇద్దరి కిద్దరే పందెం కోడిపుంజుల్లాగా కన్పిస్తున్నారు

"డాక్టర్ కామేశ్వరి నా కంతా చెప్పింది లెండి మనలో మనకు దాపరికం దేనికి? "

పళ్ళికిలించబోయిన మిసెస్ కైలాసం "షటప్!" అన్న మీనాక్షి అరపు విని కుర్చీలో అంతెత్తున ఎగిరిపడింది

'తాను సరిగానే విన్నదా? తనను మీనాక్షి అంతటి మాట అనగలదా?'

"నువ్వూ నీ కామేశ్వరీ 'గోటూ హెల్' మిసెస్ కైలాసం గెటౌట్! గెటౌట్ ఐసే!"

దెబ్బతిన్న బెబ్బులిలా లేచింది మిసెస్ కైలాసం

"నీ రహస్యం నా చేతిలో వున్నది మీనాక్షి అది మరచిపోకు నీ కూతురికి పెళ్ళి కాకముందే "

"నోర్మూయ్ నౌకర్ల చేత గెంటిస్తాను కదలకపోయావంటే "

"అదేమిటో—నీ పొగరెంతవరకో నేనూ చూస్తాను" బుసలుకొడుతూ నిష్క్రమించింది మిసెస్ కైలాసం.

# 33

తాము దివాలా తీసిన రహస్యం కప్పిపుచ్చటానికి శత విధాలా ప్రయత్నిస్తున్నారు కైలాసం దంపతులు

అందులో ఒక పనిగా—విదేశాలలో విద్య నభ్యశిస్తున్న పుత్రరత్నాన్ని స్వదేశం రప్పించేశారు ఏదో మిషతో

అతడి విదేశ విద్యను ఎరగాపెట్టి ఏ వెర్రి మొహాన్నైనా లక్షల కట్నానికి వల బిగించవచ్చన్న అమోఘమైన ఆలోచనతో భారీ పార్టీ ఏర్పాటు చేశారు

విందుకు వచ్చిన శంకర్‌ను ఓ మూలకు పిలచి మాటలలోనికి దింపింది మిసెస్ కైలాసం.

"నువ్వీమధ్య తరచుగా వూళ్ళో వుండటం లేదేమిటీ?"

"ఏం ఆంటీ? నీకెలా తెలుసూ?"

"అబ్బో, ఆ మాత్రం గ్రహించలేనా ఏమిటి?" అంటూ అసహ్యంగా కళ్ళు త్రిప్పింది.

"ఇంతకూ ఆ పంజాబీ పిల్లకు విడాకులిచ్చేశావా లేదా?"

"అంత తేలిగ్గా అయ్యేపనా ఆంటీ? చాలా డబ్బు కావాల్సి వుంది అమ్మా నాన్నా ఇవ్వరు "

[illegible] విజయవాడ వెళ్ళి [illegible]
ఘనకార్యమేమిటీ? ఉమ ఇవ్వనంటోందా డబ్బు?"

"ఇవ్వగలంత యిచ్చింది. ఇప్పుడు తనకూ ఏమీ రావటంలేదు ఇంటినుంచి "

"నీకు కోపం రాకపోతే ఓ మాట!"

"ఏమిటీ?"

"నువ్వెటూ సినిమాలు తీయాలనే సరదాలో వున్నావ్ కదా?"

"ఔను" ఆనందంగా అన్నాడు

"అందుకూ ఈ పంజాబీపిల్లను వదిలించుకుందుకూ డబ్బు కావాలి "

"ఔను" దీనంగా అన్నాడు

"వెర్రి పిల్లాడా! ఎందుకంత దిగులు? అమ్మా నాన్నా ఏం సాయం చేస్తారు? నా వంటివాళ్ళ నడుగు సలహా?"

"చెప్పు అంటీ నీ కాళ్ళకు దణ్ణం పెడ్తాను "

"అంత మాటెందుగ్గానీ నీకొచ్చే డబ్బులో సగం నాదీ సరేనా?"

"ఓ!"

"ఉమ కొడుకు నీ కొడుకు ఔనా?"

"ఆంటీ!"

"నా దగ్గరెందుకు రహస్యం దాస్తావ్ చెప్పు? నేను నీకు సలహా చెప్తానన్నానుగా?"

"ఔననుకో. కానీ ఉమకు నాలాంటి స్నేహితుడు మరొకడుండేవాడు "

"ఓ! కుమార్ వాడు చచ్చాడుగా? పోనీలే, అసలు సంగతి ఏమిటంటే—ఉమ రహస్యం నీ గుప్పిట్లో వుంది ఉమా, ఉమ తల్లీ నీ వాడించినట్లల్లా ఆడతారు "

"ఆడారు యింతవరకూ కానీ ఇప్పుడు శివరావు డబ్బు బిగబట్టాడు "

"అంతేకాదు వచ్చేనెలలో పదిహేడో తారీఖున బారసాల పిల్లవాడికి విజయవాడలోనే! మీనాక్షి, శివరావూ స్వయంగా వెళ్ళి చేసి వస్తారట బ్రహ్మాండంగా "

"అలాగా?"

"ఆఁ! ఆ నాటికి రసాభాస కాకుండా వుండాలంటే ఆ ఇల్లు అమ్మి అయినా సరే డబ్బిమ్మని ఉమను బెదిరించు "

"ఎదీ? విజయవాడలో యిల్లా?

"ఆఁ అదికేవలం కూతురికోసమే కొన్నారని మీనాక్షి చాలాసార్లు చెప్పింది కూతురి పేరనే కొన్నారన్న మాటేగా?"

"ఎంత గొప్ప అయిడియా ఇచ్చావు ఆంటీ!" పట్టరాని సంతోషంతో ఆమెను చేతులలో బిగించి ముద్దులవర్షం కురిపించాడు (సశేషం)

# ఉద్యోగం వచ్చింది



"ఇంటికి ఏభై రూపాయలు,
పాలకు ముప్పయి రూపాయలు,
చాకలికి పది ఆఁ ఇంకా? "

లెక్కలు కడుతూ, వంచిన తల కొంచెం పైకెత్తి జడుపుముఖంతో, "బాకీలేమయినా ఉన్నయ్యేమిటి?" అని నసిగారు రామారావు మాష్టారు

ఏ కారణంవలననో భార్య రాజరాజేశ్వరీదేవి ఒక్క క్షణం మాట్లాడకపోయేటప్పటికి, ఉషారుగా ముక్కుమీంచి బూతద్దాల కళ్ళజోడ్ని సర్దుకునేలోగా, "పక్కింటి పిన్నిగారికి పదిరూపాయలివ్వాలి " అంది రాజేశ్వరమ్మ మామూలుగా, దోసకాయలు తరుగుతూ

ముక్కుమీంచి కళ్ళజోడు కొంచెం కిందికి జారింది ఏ నెల కానెల అప్పులు మాత్రం తప్పడంలేదు తల కొంచెం వంచి, ఫ్రేము అంచుమీదుగా విచారంగా చూశారు భార్యవెపు ఆమె మాత్రం ఏం చేస్తుంది!

"సరే సరుకుల లిస్టు చెప్పు " అన్నారు రామారావుగారు నీరసంగా పడక్కుర్చీలో వెనక్కు వాలుతూ

"ఒరే వాసూ! లిస్టు రాయరా!" అని కేకేశారు ఆఖరు కొడుకును, నెరిసిన తలను గోక్కుంటూ

---

ముక్కామల దేవీ నాగమోహనరావు

పోతూన్న చింకిలాగును పైకి లాక్కుని, చేత్తో గోళీక్కాయల డబ్బా పట్టుకుని, ఎ ఎన్ ఆర్ లా ఓ ఫోజిచ్చి పారేసి, "నాకిదేపనా? అవతల నే నాడుకోవాలి" అన్నాడు

రామారావుగారి విచారమంతా 'హంస్ కాకి'లా ఎగిరిపోయింది ముచ్చటగా చూశారు కొడుకును—ది గ్రేట్ పదేళ్ళ ఫిఫ్త్ క్లాసు స్టూడెంటును

"అలాగా నాయనా! మధ్యాహ్నం తిండికొద్దువుగాని" అంది వాళ్ళమ్మ పచ్చిమిరపకాయలు కోస్తూ

మనవాడు వెంటనే ఆలోచన్లో పడ్డాడు ఎవరితో గొడవపడినా అమ్మతో మాత్రం పడకూడదు అనుకున్నాడు

"సరే చెప్పు" అని కూర్చున్నాడు

"బియ్యం అరపై కేజీలు

నూనె మూడు కేజీలు "

* * *

మెల్లగా ఎండ తీక్షణతను అందు కుంటున్నది ఉదయం పది గంటలు రామారావు 'ఉష్!' అనుకుంటూ ప్రవేశించారు ఇంట్లోకి కూలివాడు బియ్యం మూట లోపల పడేశాడు వెనకాల, రామారావుగారి రెండవ సుపుత్రుడు సురేషూ, వాసూ డబ్బాలతో, పొట్లాల సంచులతో ప్రవేశించారు

చిన్నకొడుకు లిద్దరూ సంచు లు దించారు

వంటింట్లోంచి ఏవో చిన్నచిన్న ధ్వనులు తప్పించి, ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది రామారావు మాష్టారప్పుడే పడక పడ్డారు

వాసు ఎ ఎన్ ఆర్ ఫాన్ సురేషు ఎన్ టి ఆర్, ఫాన్ అంచేత వాళ్ళు తమతమ అభిమాన హీరోల ఫోజులు వరుసగా కొట్టి, సీరియస్‌గా చూశారు తండ్రివేపు

"నాన్నా?" అన్నాడు వాసు అచ్చు ఎ ఎన్ ఆర్‌లా

"నాన్నా!" దుర్యోధనుడిలా గర్జించాడు సురేషు

ఆయన ఉలిక్కిపడి కయ్యానికి సిద్ధంగా ఉన్న కొడుకుల్ని చూశారు వెంటనే ఆయనకు తను చేసిన అపరాధమేమిటో తెలియరాలేదు

"నాన్నా మర్చిపోయావా?" అన్నాడు వాసు విషాదంగా—'లతా ఎందుకిలా మారిపోయావు? అన్న ప్రేమ్‌నగర్‌లోని డైలాగ్‌ను యిమిటేట్ చేస్తూ

'ఆఫ్ట్రాల్! మీ ఎ ఎన్ ఆర్ ఎంత?' అన్నట్లుగా తమ్ముణ్ణి చూసి, తను ఆరో క్లాసు చదువుతున్నాడు గనుక, తమ్ముడి కంటే పోర్సుగా మాట్లాడేలి గనుక నిప్పులాంటి మనిషిలో ఎన్ టి ఆర్ ఫోజుకొట్టి ఈ విధంగా అన్నాడు సురేషు

"అవును మా విషయం ఒచ్చేటప్పటికి నువ్వు మర్చిపోతావు ఎన్నాళ్ళయినా మాకు పుస్తకాలు కొనవ్ బట్టలు కుట్టించవ్ " తన బట్టల్ని చూసుకుని సురేషు ఆవేశపడ్డాడు

తన చిన్నకొడుకు లిద్దరివైపూ దిగులుగా చూశారు రామారావుగారు వాసగాడి లాగు అంచు చిరిగి వేళ్ళాడుతుంటే

సుభాషితాలు

స్త్రీలను స్త్రీలు చాలా తొందరగా గుర్తిస్తారు —శరత్ బాబు




సురేష్‌గాడి చొక్కా కాలరు చిరిగి దారాలు వేళ్ళాడుతున్నాయి కాని, ఆ చిన్నారు లిద్దరిలో పరిస్థితుల నర్థం చేసికొనే మన స్తత్వం ఆ వయసులో అసహజమైన సహనం ఆ ముద్దు ముఖాలికి వింత అందం చేకూరుస్తున్నవి కాని తనేం చెయ్యగలడు? పాపం ఇలా ఎన్నిసార్లో అడిగారా పిల్లలు

"డబ్బు మిగిలేలాలేదు బాబూ చూస్తాను లెండి అన్నయ్యకు ఉద్యోగం వచ్చేస్తుందిగా, మీకు మంచిమంచి బట్టలు కావలసినవన్నీ కొంటాడు సరేసరే— యిదిగో చెరో పది పైసలు తీసు కోండి "

ఇద్దరు కుర్రాళ్ళు ముఖముఖాలు చూసు కున్నారు

"అన్నయ్య కెప్పుడు ఉద్యోగం వస్తుంది నాన్నా?" వాసు అడిగాడు

"వచ్చేస్తుందిబాబూ కొద్దిరోజుల్లోనే"

"సినిమాకన్నా డబ్బులియ్యి నాన్నా" బిక్కమొహంతో అడిగాడు సురేష్

"నాన్నా! కొంచెం కాఫీ ఇమ్మం టావా?" అంటూ వచ్చింది సుధ మాష్టారి పెద్దకుమార్తె

రామారావుగారికి ప్రాణం లేచి వచ్చి నట్లయింది

"ఇవ్వమ్మా" అన్నారు

పిల్లలింకా అలాగే నిలబడి ఉన్నారు చివరికేమనుకున్నారో తండ్రి చేతిలోని డబ్బులు తీసికొని వెళ్ళిపోయారు

పొగలు కక్కుతున్న కాఫీ గ్లాసు అందించింది సుధ

వంటింట్లోంచి తాలింపు శబ్దం వినబడు తూంది.

"సుచల అచల ఏరమ్మా?"

"సుచల ఏదో చదువుకుంటోంది నాన్నా. అచల ఎవరింటికో వెళ్ళింది."

ఆయన కాఫీ తాగుతున్నారు. సుధ అలాగే నిలబడి ఉంది.

"ఏమ్మా?" అన్నారు.

"నాన్నా వాయిదాల పద్ధతిమీద కుట్టు మిషను కొంటానన్నావు... " మెల్లగా అందామె.

ఆయన కొన్ని క్షణాలు ఏమీ మాట్లాడ లేదు. ఆమె ముఖంలోనికి కూడా చూడ లేకపోయారు. చివరకు మెల్లగా అన్నారు:

"డబ్బు సరిపోయేలా లేదమ్మా. " నూతిలోంచి వచ్చినట్లు క్షీణంగా ఉందా యన స్వరం. ఆమె కొన్ని క్షణాలు మాట్లాడలేదు. "పోనీలే నాన్నా!" అంది చివరికి. మెల్లగా లోపలికి వెళ్ళిపోయింది.

వెళ్ళిపోతున్న ఆమెను విచారంగా చూశారాయన. కుట్టుమిషను ఉంటే దాని ద్వారా ఏదో తనకు సాయపడదామను కుంటుంది పిచ్చిపిల్ల. ఇరవై నాలుగేళ్ళు పైబడ్డాయి సుధకి. చిరుగులున్నా శుభ్రంగా ఉతికిన చీర కట్టుకుంది. ఉన్నంతలో ఏదో పొందిక! కాని 'ఇది' అని చెప్పు కోవడానికి తనేం చేశాడు? పెళ్ళి ఎలా చేయడం? ...ఎలా?

నొసలు రుద్దుకున్నారాయన. ఏవో ఆలోచనలు, బాధలు. దిగుళ్ళు. వీటితోనే జీవితం గడిచిపోతున్నది. పూర్తిగా నెరి సిన తల. ముడతలు పడిన దేహం. దారిద్ర్యాన్ని సూచించే దుస్తులు .ఏభ యేళ్ళు పైబడినా, అరవై ఏళ్ళు పైబడిన వారిలా కనిపిస్తారాయన.

వంట గదిలోంచి భార్య వచ్చింది చేతులు తుడుచుకుంటూ. భార్య ను చూశా రు. నిర్విచారంగా నిర్లిప్తంగా ఉన్నట్లు కనిపిస్తుంది. ఆమెదీ కృశించిన శరీరమే. నెరిసీ నెరియని తల. మాసిన చీర. వెలిసిన జాకెట్టు.

"సరుకులు చూసుకో" అన్నారాయన.

తెచ్చినవాటిని జాగ్రత్త చేయసాగిం దామె.

"ఓ కేజీ మినప్పప్పు తేలేకపోయారా? పిల్లల కేదయినా చేసిపెట్టేదాన్ని. పాపం! ఏమయినా చెయ్యమ్మా అంటారు. ఏం చెయ్యను? పిండివంటలు చేసుకోడాని కేముంటాయి ఇంట్లో చిన్నపిల్లలు వాళ్ళకేం తెలుసు? "

ఆయన మౌనం వహించారు.

కాస్సేపాగి ఆమే అన్నది: "మీరు తెచ్చింది నెల్లాళ్ళ తిండిగింజలికి, ఇంటి అద్దెలకే సరిపోదు. ఇంకేం ఉంటుంది లెండి."

దంపతులిద్దరూ ఏదో పరధ్యానంలో పడ్డారు. ఇద్దరిలో ఏదో ఆశ! 'రోజులు మారవా?!' 'స్థితిగతులు మారవా' అని.

"పెద్దబ్బాయింకా రాలేదేమే?"

"రాలేదు మరి. పాపం — రెండు రోజులయింది ఇంటర్వ్యూకని వెళ్ళి. మూడు సంవత్సరాలనుంచీ ఇలా తిరుగు తూనే ఉన్నాడు. ఏం ఉద్యోగాలో, ఏం గవర్నమెంటో ..ఎక్కడెక్కడ తిరుగు తున్నాడో ఏవిటో. ."

వేడిగా గాలి వివిరింది. బయట ఎండ

మండుతూంది. ఆయన ఏం మాట్లాడలేదు. అచల వచ్చింది. పదవతరగతి చదువుతూంది. తెల్లగా అందంగానే ఉంటుంది. కాని, మాసిన లంగా, జాకెట్ తైల సంస్కారంలేని జుత్తు ఆమెను వెలవెలబరుస్తున్నవి.

తండ్రిని చూడగానే ఆ పిల్లకు వెంటనే ఆత్రత, నిరాశ, దుఃఖము అన్నీ ఒక్కసారే వచ్చాయి.

"నాన్నా నాకు చెప్పులు కొంటానన్నావు. తెచ్చావాః"

రాజేశ్వరమ్మ కూతురికేసి చూపింది. మాట్లాడకుండా తన పనిలోకి వెళ్ళిపోయింది.

రామారావుగారు నిజంగా భయపడ్డారు.

"తేలేదుకదూ. ఎందుకు తెస్తావుః నేనిలా పిగ్గుమాలిందాన్లా స్కూలుకు వెళ్ళాల్సిందేః ప్రతి వెధవా నన్ను వెక్కిరించాల్సిందేః స్కూల్లో అబ్బాయిలు నన్నెలా ఏడిపిస్తారో నీకేం తెలుసు "

దుఃఖంతో పూడుకుపోయిందామె కంఠం. కళ్ళనిండా నీళ్ళు నిండుకొచ్చాయి.

" ముసలమ్మా అంటారు. ఏబ్రాసీ అంటారు .." ఇంక ఆపుకోలేక పోయింది. వెక్కివెక్కి ఏడవసాగింది.

"ఎందుకే వెధవ్వేడుపుః— ఉరుములాంటి కేక. సుచలః అపర కాళిలా ఉంది. ఇరవై రెండేళ్ళుండవచ్చు. పాయలు పాయలుగా జుత్తు విడిపోయి ఉంది. అందమైన పెద్ద కళ్ళు ఎర్రబడి భయం గొల్పేట్టుగా ఉన్నాయి. నలిగిన చీర. బిగుతైన జాకెట్టు. ఆమె పరువమంతా గత్యంతరం లేక కసికసిగా చూస్తున్నట్లు ఉంది. చేతిలో 'సెక్రటరి' బౌండు పుస్తకముః

రామారావుగారు వణికిపోయారు.సుచల అవకాశం వచ్చినప్పుడల్లా ఆయన అసమర్ధతను ఎత్తి చూపి నిందిస్తుంది. ఏడుస్తుంది. 'పిగ్గుమాలినదాన్నైపోయాను.' అంటుంది. ఇంట్లో ఆ పిల్లజోలికి ఎవరూ వెళ్ళరు.

ఆయన, సుచలను పైకి లెక్కచేయనట్లు కనిపించాలని, అచలతో.

"డబ్బు సరిపోదేమోనని ఆగానమ్మా- నెల్లాళ్ళు గడవాలి కదా. కొంటాన్లే అమ్మా . ఎన్నాళ్ళమ్మా మనకీ కష్టాలు. అన్నయ్యకు ఉద్యోగం వస్తే—"

"ఆఁః ఆయనగారికి ఉద్యోగం వచ్చేస్తుంది. మమ్మల్ని ఉద్ధరించేస్తాడు. ఇలాగే రోజులు గడుస్తాయి. సంవత్సరాలు గడుస్తాయి. అప్పుడు . నీలాగే మేమూ అవుతాము. బ్రతుకులికి అర్థం ఉండదు. ఎందుకు జీవించాలో తెలియదు. పందుల్లాగా, కుక్కల్లాగా బ్రతకడంకన్నా చావడంమేలు "

పుస్తకం ఎగపిపడుతున్న గుండెలకు నొక్కుకుందామె. కళ్ళల్లో నీళ్ళు సుళ్ళు తిరుగుతున్నాయి. అచల ఒకమూల ఏడవటం మర్చిపోయిబొమ్మలా నిల్చుండిపోయింది. వంటగదిలోంచి సుధ, రాజేశ్వరమ్మ ఈ మాటలు వింటూనే ఉన్నారు. తల్లి ముఖంలో ఏ భావమూ కనిపించదు సుధకు. చాలా బాధలను గుండెలలో దాచుకున్న మనిషి ఆమె.

"అమ్మా- సుచలకసలు బుద్ధిలేదమ్మా" అంది సుధ.

రాజేశ్వరమ్మ ఏమి అనలేదు. కొంగుతో కళ్ళు తుడుచుకుంది.

"నేను ఏం చెయ్యనమ్మా...." తండ్రి నిస్సహాయంగా అన్నాడు.

"ఏమీ చెయ్యవు నువ్వు. చేసే ఉద్దేశం ఉంటే ఎప్పుడో, ఏదో చేసేవాడివి."

"సుచలా ఏమిటే యిది?"సుధ బయటి కొచ్చి అంది.

"ఓహో! తమరా! ఏముంది? నాకే మయినా దారి చూపించమని అడుగుతున్నాను."

"సిగ్గులేదూ నీకు."

"ఎందుకే సిగ్గు? నీకూ సిగ్గు! నువ్వు సహనశీలివికదూ! నన్నంటావు. పైకి కనబడవు కాని లోపల నువ్వెన్నను కుంటున్నావో! నాన్నను ఎంత తిట్టుకుంటున్నావో!"

గుడ్లనీరు కుక్కుకుంటూ వంటగదిలోకి వచ్చేసింది సుధ.

రాజేశ్వరమ్మ మౌనంగా తనపని చేసుకుపోతూంది. ఏమాత్రం ఉద్రిక్తతా చిహ్నాలూ ఆమె ముఖంలో కనిపించడం లేదు కాని, లోలోపలే ఆమె ఆలోచించుకుంటున్నది. ఆ ఆలోచనలన్నీ తన పెద్ద కొడుకు చుట్టూనే పరిభ్రమిస్తున్నాయి. తన పెద్దకొడుక్కి కూడా ఉద్యోగం దొరికితే కొంతవరకూ ఈ ఆడపిల్లల బెడద తప్పుతుంది. తన ఆశలన్నీ కొడుకు మీదే. కొడుకే ఈ కుంటుబాన్ని ఒకదారికి తీసుకురావాలి. ఆడపిల్లలకు పెళ్ళిళ్ళుచేసి, ఓ మంచి కోడల్ని తెచ్చుకుని, తనింక విశ్రాంతి తీసుకోవాలి. బాధలతో,దిగుళ్ళతో కృంగిపోయిన మనసును ఒకింత శాంత పంచుకోవాల..

కర్రల పొయ్యి దగ్గరకూర్చున్న సుధ కూడా ఆలోచిస్తున్నది. అందమైనముఖం. విశాలమైన కళ్ళు. ఎర్రని మంటవెల్తురులో ఆమె ముఖం కాంతులీనుతోంది. ఆమెకూ ఏవో స్వంత ఊహలున్నాయి. ఆశలున్నాయి. అర్ధరాత్రుళ్లు ఏవేవో ఊహించుకుంటుంది - భయంభయంగా. బయటి వెన్నెట్లోకి చూస్తూ. తండ్రిని చూస్తే ఆమెకు ఎంతో విచారం. తనకు ఊహ తెలిసిందగ్గర్నుంచీ తండ్రిఅలాగే ఉన్నాడు. విచారమూ, బాధా ఆయన్ని తినేస్తున్నాయి. వచ్చిన జీతం తిండికే చాలదు. మిగిలిన అవసరాలెలా తీరుతాయి! బాధ్యతలెలా తీరుతాయి! కాని ఆమెకూ ఆశ!.... గాఢాంధకారంలో చిరుదీపంలా... అన్నయ్య! అన్నయ్యకు ఉద్యోగ మొచ్చేస్తే! . తమ కష్టాలన్నీ తీరిపోతే . ఆడపిల్లలందరికీ పెళ్ళిళ్ళయిపోతే. .

ఈ ఊహ ఆమె వొళ్ళును పులకరింపజేసింది. తనకుతానే సిగ్గుపడిపోయి ముఖం దాచుకుంది.

సుచల కూడా ఆలోచిస్తున్నది. తండ్రి అంటే చెప్పలేనంత కసిగా, కోపంగా ఉందామెకు చీకటి గదిలో ఓమూల సెక్రటరీ నవలను గుండెల కాన్చుకుని పడుకుని ఉంది. కనుకొలుకులనుండి నీళ్లు కారుతున్నాయి.ఎప్పుడూ ఏదో అందంగా, అద్భుతంగా ఊహించుకోవడమంటే ఆమెకు చాలా ఇష్టం. 'అదే మిగిలింది నాకు.' అనుకుంటుంది. ఏదో అద్భుతం జరిగి తనో లక్షాధికారిణి అయిపోతే .

సుభాషితాలు

సద్బుద్ధి, సద్వర్తన, సజ్జన సాంగత్యము వీటినుంచి జనించే పరిమళమే వ్యక్తికి నిండదన మిచ్చే ప్రత్యేకత.

—మాలతీ చందూర్




నవలలోని రాజశేఖరం పాత్ర అంటే ఆమెకు చెప్పలేనంత ఇష్టం. ఏ రాజశేఖరమో తన అందాన్ని చూపి వరించి, తన జీవితంలోకి ప్రవేశిస్తే గుండెలు గబగబా కొట్టుకుంటాయామెకు. ఎంతోమంది లక్షాధికారుల కొడుకులు సూట్లు వేసుకుని, విమానాల్లాంటి కారుల్లో పోతూంటారు. ఏ ఒక్కరైనా తనంటే ఇష్టపడితే

వెంటనే నిరాశ, నిస్పృహ! ఎదురింటి మేడలోని అబ్బాయి గుర్తువస్తాడు. మెడికో. తనకేసి అదోలా చూస్తాడు. తనకు వళ్ళంతా సిగ్గేస్తుంది. ఒకసారి నవ్వాడు. తనూ నవ్వి పారిపోయింది. కొన్ని రోజుల్లో మెడ్రాసు వెళ్ళిపోతాడట. అతనితో వెళ్ళిపోతే! . ఒక్కసారి ఆమె గుండె ఆగి గబగబా కొట్టుకుంది అమ్మో! వెంటనే భరించలేని బాధ దిగులు ఏవో అగాధాలు . జీవిత మంతా చీకటి! చీకటి! కాని .. కాని . ఏదో సన్నటి వెలుగు! అన్నయ్య! అన్నయ్యకు ఉద్యో మొస్తే! .

అచల వీధి అరుగుమీద కూర్చు ఉంది వచ్చే పోయే జనాన్ని చూస్తూ పదహారేళ్ళమ్మాయి. అక్కయ్య కున్నంత బాధ ఇంకా ఆమెకు కలగలేద గాని, నిరంతరం స్కూల్లో అవమానాలన ఆ పిల్ల సహించలేకపోతున్నది. తో ఆడపిల్లలు, అబ్బాయిలు అందరూ 'ము లమ్మా' అంటారు, 'ఏబ్రాసీ' అంటారు

కనుపించడానికి అలంకరణ లుండవు. మాష్టర్లు కూడా మిగిలిన ఆడపిల్లలను చూసినట్లుగా తన్ను చూడరు. ఎన్నిసార్లో ఏడ్చింది. తండ్రి ఎప్పుడూ డబ్బుండ దంటాడు. 'ఎన్నాళ్ళమ్మా మనకీ కష్టాలు. అన్నయ్య కుద్యోగమొస్తే 'అంటాడు. ఆ అమ్మాయి కొంచెం ఆలోచిస్తుంది. నిజమే. తండ్రి ఏం చెయ్యగలడు? 'అన్నయ్య కుద్యోగమొచ్చేస్తే! ' ఒక్కసారిగా అనుకుని ఊహల్లోకి జారి పోయిందా అమ్మాయి.

వాసు, సురేషు, ఎండలో తిరిగి తిరిగి, పన్నెండు గంటలవేళ ఇంటికి వచ్చారు. రాజేశ్వరమ్మ భోజనాలకి సిద్ధం చేస్తున్నది.

పిల్లలు కాళ్ళూ చేతులూ కడుక్కుని వచ్చారు. బట్టలు మాసినా, చిరిగినా, ఎటువంటి ప్రత్యేక సుఖాలకూ నోచుకోక పోయినా- అమాయకమైన కళ్ళతో ముత్యాల్లా కనిపించారా పిల్లలు రాజరాజేశ్వరీ దేవికి

"అమ్మా!" అన్నారు ఇద్దరూ ఏదో కూడబలుక్కున్నట్లు.

"ఏమిటీ?" అందామె.

"అన్నయ్య రాలేదేమే" వాసు.

"ఈవేళ వస్తాడేమో."

"అన్నయ్యకు ఉద్యోగ మొచ్చేస్తుందామ్మా" సురేషు.

ఆమె నవ్వింది. "ఎందుకు రాదూ! మంచి ఉద్యోగమే వస్తుంది."

"ఉద్యోగ మొచ్చేస్తే—" పిల్లలు ఆగారు.

"వస్తే?" అంది సుధ అన్నం ఆర

"మాకు బట్టలు కుట్టిస్తాడు. పుస్తకాలు కొంటాడు.''

"ఇంకా .." అంది సుధ నవ్వుతూ.

"నీ పెళ్ళవుతుంది." అన్నారు ఇద్దరూ ఒక్కసారే.

"ఛీ! పొండి." అంది సుధ బోలెడు సిగ్గుపడిపోయి.

రాజరాజేశ్వరమ్మ మనసారా నవ్వింది.

* * *

చీకట్లు ముసురుకున్నాయి. వీధి అరుగు మీద పడక్కుర్చీలో పడుకున్నారు రామా రావుగారు. గదిలో కిరసనాయిలుబుడ్డి వెలుగు పలుచగా వాకిట్లో పడుతోంది. దూరంగా, విద్యుద్దీపాలకాంతితో మునిగి వుంది నగరమంతా. వీధిలో పల్చగా జనం అటూ యిటూ తిరుగుతున్నారు. అప్పుడప్పుడు రిక్షాల గణగణలూ, కార్ల హారన్లూ వినిపిస్తున్నాయి. తలపగుల్తున్నది. ఎవరికీ చెప్పుకోలేనిబాధ. ప్రొద్దుట జరిగిన రాద్ధాంతం ఆయన మనసును కలవర పరచింది. ఇది ఈవేళేమీ క్రొత్తకాదు. ప్రతినెలా మొదటి, రెండవ తేదీల్లో జరిగే మామూలు గొడవే. కాని, ప్రతిసారీగుండె ముక్కలవుతుంది. నిరాశ, నిస్పృహలు చీకట్లులా అలుముకుంటాయి. చేస్తున్నది స్కూలు మాష్టరు ఉద్యోగం. మూడు వందల ఏభై రూపాయలదాకా జీతం. ఇంటి అద్దెకు, పాలకు, చాకలికి, మామూలు తిండికే ఆ డబ్బు చాలదు. ఇంతకాలం ఉద్యోగం చేసి కూడ బెట్టిందిలేదు. కనీస అవసరాలు తీరటంలేదు. ఆడపిల్లలు ఎదిగి కూర్చున్నారు. ఆడపిల్లలంటే భయం

తనకు. పెళ్ళిళ్ళుచెయ్యాలి. ఎలా?!... పెద్ద కొడుకు మీదే ఆశ. కష్టపడి చేసినపని, ఒకవిధంగా, కూడబెట్టిన ఆస్థి కొడుకును బి.ఏ. దాకా చదివించడం. కొడుక్కు ఉద్యోగమొచ్చేస్తే . అవును . మూడు సంవత్సరాలనుండి ఎదురుచూస్తున్నాడు కొడుక్కు ఉద్యోగమొస్తుందని. ..కాని ఎంతమంది బి.ఏ. లు, ఎం.ఏ.లు ఉన్నారు! అంతమందిలో తనకొడుక్కు ఉద్యోగం రావడం ఎంతకష్టం! తను ఇంకొక్క సంవత్సరంలో రిటైరై పోతాడు.ఇది తనకు తీరనిదెబ్బ. ఒకే ఒక్క సంవత్సరం! . అయినా ఫరవాలేదు. కొడుక్కి ఉద్యోగ మొస్తే, తన జీతంతో ఇల్లుగడిపి, కొడుకు జీతాన్ని కూడబెట్టి కూతుళ్ళ పెళ్ళిళ్ళు చేయవచ్చు. ఇదే ఆశ! గుండెల నిండుగా ఆవరింమకున్న ఆశ మరేవిధ మయిన ఆధారమూలేదు. తనకొడుక్కు త్వరగా ఉద్యోగం రావాలి భగవంతుడా మమ్మల్ని కరుణించుస్వామీ

ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది.

"నాన్నా భోంచెయ్యినాన్నా" సుధ వచ్చింది.

"పిల్లలందరూ తినేశారామ్మా?"

"తిన్నారునాన్నా."

"నేను కాసేపుండి తింటానమ్మా. అన్నయ్యొస్తాడేమో ననిఉంది.ఏమయిందో ఏమిటో."

రాజేశ్వరమ్మ కూడా అలానే అను కుంటున్నది.

"శుక్రవారమనగా వెళ్ళాడు. ఈవేళ ఆదివారం ఇంకారాలేదు. ఏమయిందో ఏమిటో."

సుధ మనసులోనే దేవుడికి మొక్కు కుంది.

చాలాసేపు ఎదురుచూశారు వాళ్ళు ఆ రాత్రి. చివరికి మిగిలినవాళ్ళు విచారంగా భోజనాలు కానిచ్చారు.

రాత్రి పదిగంటలవేళ, నీరసంగా, రేగిన తలతో, మాసిన బట్టలతో, అయిదున్నర అడుగులమనిషి సుదర్శనం బ్యాచిలర్ ఆఫ్ ఆర్ట్స్, ఇంటితలుపు కొట్టాడు.

"అన్నయ్యొచ్చేడు." వాసూ, సురేషు లేచిపోయారు. తండ్రి లేచి కూర్చున్నాడు. సుధ, సుచల, అచల ఒళ్ళంతా చెవులు చేసుకున్నారు.

రాజేశ్వరమ్మ ఆత్రతగా తలుపుతీసింది.

"ఏమయింది? ఏమయింది?"

"సెలక్టుకాలేదు." అన్నాడతను నిర్జీవ మయిన కళ్ళతో. తండ్రి ప్రశ్నార్థకంగా చూశాడు. సుదర్శనం విచారంగా నవ్వాడు.

"లంచమిచ్చే స్థోమత మనకులేదుగా" అన్నాడు.

* * *

రోజులు గడిచిపోతున్నాయి. ఈ రోజుల అడుగునపడి ఎందరి ఆశలు, ఊహలు, ఆశయాలు, నలిగి నశించి పోతున్నాయో! సంవత్సరం గడిచింది. సుదర్శనానికి ఉద్యోగం వచ్చింది. ఫెర్టి లైజర్ ఫ్యాక్టరీలో క్లర్కు ఉద్యోగం. జీతం మూడువందల పాతిక దాకా వస్తుంది. మొదటినెల జీతం అందు కున్నాడు సుదర్శనం. భవిష్యత్తు మొదటి సారి రంగురంగులుగా కనబడిన క్షణమది! గర్వంతో ఒళ్ళు పులకరించింది. మనసు పట్టలేని ఆనందంతో గంతులు వేస్తున్నది.

ఎవ ఊహలు, ఆశలు, ఆశయాలు .. ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి ఊపిరి పలుపు కోనీయకుండా.

బరువుగా ఉన్న జేబును తృప్తిగా తడుముకుంటూ బయటికొచ్చాడు. అలంకార్లోకి వెళ్లాడు.

"ఒక ఇనిస్టెంటు కాఫీ."

సాయంత్రం ఎన్నడూ లేనంత అందంగా ఉంది చల్లగా గాలివీస్తున్నది. రంగురంగుల అబ్బాయిలు, అమ్మాయిలూ అటూ, ఇటూ మెల్లగా నడుచుకుంటూ పోతున్నారు. రిక్షాలకు, సైకిళ్ళకు, కార్లకు ఎడతెరిపిలేదు. రిక్షాల గణగణలూ, సైకిళ్ళ టింగుటింగులూ, కార్ల హారన్లూ అన్నీ మధురంగా, కర్ణపేయంగా వినిపిస్తున్నాయి అతనికి.

సుజాత! ఏం చేస్తున్నదో ఈసారి గర్వంగా వెళ్తాడు ఆమె దగ్గరికి.

బేరర్ కాఫీ తెచ్చాడు. బేరర్‌కేసి ఉషారుగా చూశాడు సుదర్శనం. బిల్లుతో బాటు రెండ్రూపాయల కాగితం ఇచ్చాడు. "ఛేంజితీస్కో!" అన్నాడు.

"ధ్యాంక్యూ సార్!" అన్నాడు బేరర్ సంతోషంగా.

కాఫీ సగం త్రాగాడు. ఎదుటిసీట్లో కూర్చున్న వ్యక్తివంక నిశ్చేష్టుడై చూస్తూండిపోయాడు. ఎదుటిసీట్లో ఆ మనిషి ఏదో ప్రత్యేకతఉన్న గొప్పమనిషి కాదు. ఎవరో ముసలాయన! అరవై ఏళ్ళుండవచ్చు. తన తండ్రిలాగానే నెరిసిన తల, ముడుతలుపడ్డ శరీరం. కాఫీ త్రాగలేకపోయాడు. చేదుగా అనిపించింది. వాస్తవం కళ్ళముందు వెక్కిరించింది తన ఉత్సాహానికీ, ఆనందానికీ, ఊహలకీ అర్థం లేదు. కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. జేబులోని డబ్బును కళ్ళనీళ్ళతో చూసుకున్నాడు. ఆ ముసలతన్ని చూడగానే అతనికి గుర్తు వచ్చింది—తన తండ్రి రిటైరయ్యాడు.

యంత్రం మాదిరిగా బయటికొచ్చాడు. ఇప్పుడేమీ అతనికంటికి అందంగా కనిపించడంలేదు. ఏవో కొందామనుకున్నాడు ఎన్నో చేద్దామనుకున్నాడు. బట్టలకొట్లూ జోళ్ళషాపులు, ఫ్యాన్సీస్టోర్లు, అన్నీ అతన్ని చూసి అపహాస్యం చేస్తున్నట్లున్నాయి. నిరాశ నిస్పృహలు నిండిన కళ్ళతో, ఎక్కడికో శూన్యంలోకి చూస్తూ జనంలోంచి నడిచిపోతున్నాడా ఉద్యోగి— సుదర్శనం

ఉన్నంతలో తిని, కట్టుకుని బి.ఏ. కష్టపడి చదివాడతను. అప్పుడు ఎన్ని ఊహలు ఎన్ని ఆశలు ఏదో ఏదో చేద్దామనుకున్నాడు. కాని ఈ దేశంలో ఉన్న భయంకరమైన నిరుద్యోగసమస్య మరెక్కడా లేదేమో!

సుజాత! కాలేజీలో పరిచయమయ్యిందామె. సన్నగా, పసిడిఛాయగా, పెద్ద కళ్ళతో ఎంత అందంగా ఉండేది.

రెండు సంవత్సరాలుగా ఆమెకోసం నిర్విరామంగా ఉద్యోగంకోసం ప్రయత్నించాడు.

సుజాత తండ్రి పెద్ద ఇండస్ట్రియలిస్టు!

తండ్రి అంటే ఆమెకు చాలా భయం. అయినా ఆమెకు సుదర్శనం అంటే ప్రేమ. అవసరమైతే తెగింపు ఉంది.

ఒకసారి ఆమె అన్నది "పోనీ మా నాన్నను ఎదిరించి నిన్ను పెళ్ళిచేసుకుంటాను. కాని నీకు ఏదో ఒక ఉద్యోగం దొరికేదాకా "

## సుభాషితాలు

ఏ పని చేసినా ఏకాగ్రతతో చేసే లక్షణంగల వ్యక్తి క్రమంగా ఎటువంటి పని చేయడానికైనా అవసరమైన శక్తియుక్తులను పెంపొందించుకొనగలుగుతాడు.

—మహాత్ముని సూక్తి



ఆ ఆశలన్నీ భగ్నమయ్యాయి. ఊహాలికీ, వాస్తవానికీ ఎంతదూరం! ఏదో విధంగా ఆమెను అంగీకరింపజేసి వివాహ మాడగలడు. కాని ఏం సుఖపెట్టగలడు! కనీస అవసరాలు తీర్చగలడా?

* * *

నిరాశగా, నిస్పృహగా, నీరసంగా ఇంటికివచ్చాడు. ఇంట్లో అందరి ముఖాలూ కళకళలాడుతున్నాయి. వాసు, సురేషులు చుట్టుముట్టారు. సుచల చదువుతున్న పుస్తకం మూలపారేసి నవ్వింది. అచల గబగబా దగ్గరకు వచ్చింది. సుధ ఉత్సాహంగా చూసింది. తండ్రి తహతహగా చూశాడు.

రాజేశ్వరమ్మ ముఖం గర్వంగా వెలిగిపోతున్నది.

సుదర్శనంకొంచెంసేపు మాట్లాడలేదు. దుఃఖంతో కంఠం పూడుకుపోతున్నది.

చివరికి మెల్లగా నవ్వి, కంఠం పెకలించి అన్నాడు:

"ఇంటికి ఏభై రూపాయలు.

పాలకు ముప్ఫయిరూపాయలు

చాకలికి పది...ఇంకా ఏమయినా ఉన్నాయమ్మా."

అందరూ నిశ్చేష్టులయ్యారు. ఉద్యోగం వచ్చింది! వచ్చింది!! వస్తే! వస్తే!! ఏమయ్యిందిప్పుడు! ఏమయ్యింది!!

ఈ వాస్తవం అందరి గుండెలలోనూ మార్మోగింది. అందరి ఆశలు, ఊహాలు కూలిపోయాయి.

మర్నాడు ప్రొద్దుట వాసు లిష్టురాస్తున్నాడు.

"బియ్యం అరవై కేజీలు

నూనె మూడుకేజీలు .."

***

సంయుల



# మనిషికేం కావాలి?

— కొమ్మూరి వేణుగోపాలరావు

సైకిల్‌కు స్టాండ్ వెయ్యబోయేటంతలో లోపల్నుండి ఆయనే బయటకు వస్తు న్నారు ఆయన వెనక ఓ యాభై ఏళ్ళ స్త్రీ, ఒక యువకుడు. అతని భార్యగావును ప్రక్కనే ఓ యువతి, వెనక కాలేజీ స్టూడెంట్‌లా కనబడుతోన్న ఓ అమ్మాయి అనుసరిస్తున్నారు.

ఏం చెయ్యాలో తెలీక అలానే నిలబడిపోయాను.

ఆయన నన్ను చూడనే చూశారు "సునీతీ! ఇక్కడున్నావేవమ్మా?" అంటూ నా దగ్గరకు వచ్చారు

కొంచెం తడబడినట్లయి "మీ కోరు చూపి ఆగాను" అని చెప్పాను

"రా! వీళ్ళందర్నీ పరిచయం చేస్తాను ఈమె నా భార్య ఈ అబ్బాయి—పేరు

---

జరిగిన కథ

సునీతికి చిన్నతనం నుంచీ సాహసకృత్యాలంటే ఇష్టం హఠాత్తుగా యాక్సి డెంట్‌లో సునీతి తండ్రి చనిపోయాడు తల్లితోసహా పెదనాన్న పంచన చేరింది సునీతి సునీతి తల్లి ఆ ఇంట్లో పనిమనిషిలా చూడబడుతోంది సునీతి తల్లి తనను బలవంతం చేయబోయిన బావ బారినుండి తప్పించుకొనే ప్రయత్నంలో అతని ప్రాణం పోయింది జైల్లోనే జబ్బుచేసి మరణించిందామె. సునీతిని నారాయణమ్మ ఆదరిం చింది పొరుగింటి కృష్ణమూర్తి దంపతులు సునీతిని సర్కస్ చూపిస్తామని తీసి కెళ్ళారు దారిలో కాఫీ త్రాగిన తర్వాత సునీతికి కళ్ళు తిరిగినట్లనిపించింది సునీతిని మోసంచేసి తీసుకుపోయి, ఆమెను అనుభవించ ప్రయత్నించాడు కృష్ణమూర్తి. కృష్ణ మూర్తి బారినుంచి తప్పించుకొని పారిపోతున్న సునీతిని ఆదుకొన్నారు రాజారావు గారు, పిల్లల్లేని రాజారావుగారు సునీతిని దగ్గరుంచుకొని చదివిస్తున్నారు సునీతి కాలేజి చదువులో ప్రవేశించింది

---

రమేష్ నా పెద్ద కొడుకు ఇంజనీరు ప్యాసయ్యాడు ఈ అమ్మాయి జయ నా కోడలు ఆ చివర నిల్చున్న అమ్మాయి నా చివరి కూతురు సుగుణ. ఇవేళ యింతమంది ఫ్యామిలీ మెంబర్స్ కలిసివచ్చాం ఇదిగో, ఏమర్రా యీ బంగారుబొమ్మ ఎవరో తెలుసా ?"

ఏం చెబుతారోనని ఆసక్తిగా చూస్తున్నాను.

"నా పెంపుడు కూతురు సునీతి చదువులో, ఆటల్లో, డిబేట్లలో—అన్ని ట్లోనూ ఫస్ట్ అదేమిటమ్మా! ఫ్రంట్ వీల్‌లో గాలిపోయిందా?"

నిస్సంకోచంగా ఆయన చేస్తోన్న పరిచయానికి తెల్లబోయిన నేను అవునన్నట్లు తల వూపాను

సైకిలక్కడ [illegible]

"వద్దులెండి రేపు మళ్ళీ యిక్కడ్నుంచి తీసుకెళ్ళటం కష్టం"

"ఫర్వాలేదు రామ్మా! ఆయన దానికేదో ఏర్పాటు చేస్తారులే" అన్నది ఆయన గారి భార్య

"వద్దండీ! వెడతాను. నమస్కారం" అని జవాబుకోసం చూడకుండా అక్కడ్నుంచి కదిలాను

మనసంతా బరువుగా. ఎలాగో అయింది ఇలాంటిదేదో చరిత్ర ఆయన వెనక వుండివుంటుందని అనుమానిస్తూనే వున్నానుగానీ, అది ప్రత్యక్షంగా చూశాక ఆ బాధ భరించలేనిదిగా వుంది హిమాలయ పర్వతం అనుకున్న మనిషి వెనక ఎంత అల్పత్వం! పుణ్యమూర్తిగా కనిపించే మనిషి వెనక ఎంత స్వార్థజీవితం! తన వెనక ఓ పెద్ద కుటుంబాన్నీ, సంప్రదాయాన్నీ, వ్యవస్థనీ దాచుకున్న యీ వ్యక్తి యింకో మనిషి జీవితంతో దోబూచులాడుతున్నాడు ఆయనంటే నాకు యిన్నాళ్ళూ కల గౌరవం మట్టిలో కలిసిపోయింది ప్రతి మనిషికీ రెండు మనసులు, మనిషి లోపలి మనిషి, నిగూఢత్వాలూ—ఇదేనా యీ సమాజం?

సైకిలు ఇంట్లో పెట్టి, మామూలుగా ఎదురువెళ్ళి పలకరించకుండా నా గదిలోకి వెళ్ళి మౌనంగా కూర్చున్న నా దగ్గరకు అమ్మే వచ్చింది

"ఏవమ్మా! అలా వున్నావేం? ఏంట్లో బాగాలేదా?"

"బాగానే వుంది"

"మరి ఏం జరిగింది? నువ్వెప్పుడూ అలా దిగులుగా వుండవే!" ఆమె నా దగ్గరకు వచ్చి ఆప్యాయంగా తన చేతిని నా భుజంమీద వేసింది

ఆమె అనురాగానికి కరిగిపోతున్నానుగాని, తప్పనిసరిగా కఠినత్వాన్ని అవలంబించసాగాను

"అమ్మా! ఇన్నాళ్ళూ మీరు నామీద చూపిన వాత్సల్యానికి కృతజ్ఞురాలిని"

"అదేమిటి?" ఆమె నా వంక విస్మయంగా చూసింది

"ఇక్కడ్నుంచి యిక్కడ్నుంచి వెళ్ళిపోదామనుకుంటున్నాను"

నా భుజంమీద వున్న ఆమె చెయ్యి వొణికినట్లు గ్రహించాను ఒక్క నిమిష మాగి కంఠంలోకి నిగ్రహం తెచ్చుకుంటూ అన్నది "ఎందుకలాంటి నిర్ణయం తీసుకున్నావు?"

"ఇది దేవాలయమనుకున్నానుగాని, చుట్టూ బూతుబొమ్మలున్న దేవాలయం" అని చెబుదామని నోటిదాకా వచ్చింది తమాయించుకున్నాను

"వద్దమ్మా చెప్పలేను"

కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా గడిచాయి

"నువ్వు నిర్ణయం తీసుకుంటే కాదనే శక్తి నాకులేదు కాని నువ్వు నన్ను



మాతృమూర్తిని చేశావని పులకించాను పులకింతలు శాశ్వతం కాదని తెలుసుకున్నాను సునీతీ, రేపు ఆయన వచ్చాక, ఆయనక్కూడా తెలియబరచి యీ నిర్ణయం అమలు మరిస్తే మంచిదనుకుంటాను" ఆమె మెల్లగా ఆ గదిలోంచి బయటకు వెళ్ళిపోయింది.

మరునాడు ఆదివారం కాలేజిలేదు తన మనసులో ఏమున్నా, ముఖాన కళ వున్నా లేకపోయినా, అమ్మ మామూలుగా మాట్లాడటానికి ప్రయత్నిస్తూనే వుంది నేనూ మామూలుగా వుండటానికి ప్రయత్నిస్తూన్నాగాని, కుదరటంలేదు.

సాయంత్రం ఆరుగంటలకు రాజారావుగారు వచ్చారు లోపలకు వస్తూనే నన్ను చూసి నవ్వుతూ ఎప్పటిలాగానే పలకరించారు నేను ముఖం ముడుచుకుని వూరుకున్నాను

"ఇలారండి" అని అమ్మ ఆయన్ని లోపలకు పిలిచింది.

లోపలనుండి మాటలు వినిపిస్తున్నాయి

పదినిమిషాల తర్వాత ఆయన గదిలోంచి బయటకు వచ్చారు నా దగ్గరకు వచ్చి "వెళ్ళిపోవాలని నిశ్చయించుకున్నావట కదమ్మా" అన్నారు.

అవునన్నట్లు తల వూపాను

"నీతో కొంచంసేపు మాట్లాడాలి ఇష్టమేనా?"

"మాట్లాడండి"

"ఇక్కడ కాదు ఇద్దరం అలా బయటకు పోయివద్దాం"

సరేనని లేచి నిలబడ్డాను

కారులో ఆయన ప్రక్కన కూర్చున్నాను అమ్మ గుమ్మంలో చూస్తూ

ఎలబడింది.

కారు మెత్తగా సాగి, టాంక్‌బండ్ మీదకు వచ్చి ఆగింది ఓ సిమెంటు బల్ల మీద యిద్దరం కూర్చున్నాం. మాకు కొన్ని గజాల దూరంలో చుట్టుప్రక్కల ఎవరూలేరు.

ఓ అయిదునిమిషాలు నిశ్శబ్దంగా గడిచాక ఆయన మొదలుపెట్టారు.

"నిన్న నా జీవితంలోని మిగతా పాత్రల్ని చూసి, జీవితంలోని నా పాత్రని ఓ విధంగా ఊహించుకుని యీ నిర్ణయానికి వచ్చివుంటావు

'నీతి - అవినీతి గురించీ, పాపం - పుణ్యం యిత్యాదుల గురించీ కొన్ని సంవత్సరాల క్రితంవరకూ నీలాగే నాకూ కొన్ని అభిప్రాయాలుండేవి ఈ ప్రపంచం తీరు తెన్నులు, మనుషుల ప్రవర్తన - నన్ను మసకతనంనుంచి తప్పించి మంచో చెడో ఒక స్థిరమైన మనస్తత్వంగల వాడిగా తయారుచేశాయి.

'నేను చాలా సామాన్య కుటుంబంలో పుట్టాను. ఇష్ అంటే తప్పు, ఉష్ అంటే తప్పు - యిలాంటి చాదస్తాలమధ్యే సంప్రదాయాలమధ్యే పెరిగాను.

'కుటుంబాల్లోని యీ శాసనాలు, ఆంక్షలు బంధం పేరుతో పెనవేసుకుపోయి వున్న బంధనాలు - నన్ను తరుచు కంపితుడ్నిచేస్తూ వుండేవి.

'మనిషి ఎప్పుడు సుఖపడతాడు? అసలు సుఖపడే ప్రాప్తి మనిషికి వున్నదా? పెద్ద మేడ కట్టుకుంటే, భోగభాగ్యాల్లో తులతూగితే, లేక పూర్తిగా వ్యసనపరుడై పేకాటో, త్రాగుడో, వ్యభిచారమో ముఖ్యవ్యాపకంగా చేసుకుంటే, లేక ఆకర్షణలన్నీ చంపుకుని అనుక్షణం తీరని కోరికలతో క్రుగ్గిపోతూ మానసిక వ్యభిచారంలాంటిది చేస్తూ ద్వంద్వజీవితం జీవిస్తూ వుంటే, లేక భార్యాభర్తలు, పిల్లలు—యిదే జీవితమని ఆత్మవంచన చేసుకుంటే, ఎప్పుడు ఏ పని చేస్తున్నా వాళ్ళేమనుకుంటారు, వీళ్ళేమను కుంటారు అన్న భీతితో అనుక్షణం కృంగిపోతూ వుంటే—యీ భూమ్మీద మనిషికి సుఖం సాధ్యమవుతుందా?'

"'మనలో మూర్ఖంగానో, క్రూరంగానో ప్రవర్తించినవాడిని పశువు అనీ, వాడి ప్రవర్తనను పశుత్వం అనీ అభివర్ణిస్తూ వుంటారు. పశువులకు ఒక నిర్ణీతమైన ప్రవర్తన అంటూ వుంటుంది మనుషులకి వుండదు పశువుల్లో ఆవో, గుర్రమో, మేకో శాకాహారి అయితే సృష్టి వున్నంతవరకూ అది శాకాహారే పిల్లో, పులో, సింహమో మాంసాహారి అయితే ఆ జాతి యీ ప్రపంచం నశించేవరకూ మాంసాహారే మనుషుల్లోలాగా శాకాహారి మాంసాహారి అవటం, మాంసాహారి శాకాహారి అవటం మచ్చుకైనా పశువుల్లో వుండదు. కుక్క విశ్వాసమైన జంతువు అనే ప్రవచనం వుందనుకో. దానికి తిరుగులేదు. విశ్వాసంలేని కుక్క ప్రపంచమంతా తిరిగినా నీక కనబడదు. మనుషులకు—వాళ్ళిష్టం. నువ్వెంతో ప్రాణమిచ్చి ఆదుకున్న స్నేహితుడే నీ గురించి దుష్ప్రచారం చేస్తూ వుంటాడు. నువ్వెంతో వుపకారం చేస్తూ, ఆప్యా యంగా చూసే నీ యింట్లోని పనివాడే నీకు కీడు తలపెడతాడు. పదిరూపాయలకోసం

ప్రాణం తిపినా తీస్తాడు. అలాగే నమ్మకంతో పనిచేసేవారిని యజమాని అసహ్యించు కుంటూ, అవసరాలకి ఆదుకోకుండా వుంటాడు. మనుషులు తమ అవసరాల కోసం ఒకళ్ళ నొకళ్ళు పీక్కు తింటూ వుంటారు. కుటుంబంలో ఒక దుర్బలుడు వున్నాడంటే- అతను మొత్తం కుటుంబంలోని శాంతిభద్రతల్ని పాడుచేస్తూ వుంటాడు.

'మొదట్నుంచీ నాకు ఉద్యోగాలమీద మోజులేదు. బిజినెస్‌లైన్‌లో డాషింగ్‌గా పోయి పైకి రావాలని ఉబలాటం.' పరిస్థితులెంత ఎదురుతిరిగినా, ఇంట్లోవాళ్ళంతా కాదన్నా రాము అనే నా స్నేహితుడి సహకారంతో మొదట్లో చిన్న పెట్టుబడితో వ్యాపారం ప్రారంభించాను,

'రాము చాలా సున్నితమైన మనస్తత్వంగల మనిషి. తల్లినీ తండ్రినీ చిన్నప్పుడే పోగొట్టుకొన్నాడు. అప్పట్నుంచి అష్టకష్టాలూ పడి కొంచమో గొప్పో చదువు కుంటూ, కాస్తో కూస్తో డబ్బు సంపాదించుకుంటూ, వున్న ఒక్క చెల్లెల్నీ గారాబంగా పోషించుకుంటూ జీవితాన్ని నెట్టుకొస్తున్నాడు

'ఆ చెల్లెలే సరస్వతి.

'రామూ నేనూ ప్రాణస్నేహితులమైనాము. మా ఇద్దరిమధ్యా ఎలాంటి అర

మరికలూ వుండెవికావు.

'వ్యాపారంకూడా క్రమంగా వృద్ధిచెందసాగింది.

'ఆ రోజుల్లోనే నాకు పెళ్ళయింది నా భార్య అనుకూలవతే అత్తగారినుండీ మామగారినుండీ మొదట్లో చిన్నచిన్న సమస్యలు మొలకెత్తుతూ వుండేవి. బిజినెస్‌లో నాది డాషింగ్ నేచర్ అవటంవల్ల మార్వాడీల దగ్గర్నుంచి హెచ్చు వడ్డీలకు అప్పులు తీసుకురావటం, అవి మళ్ళీ నానా తంటాలుపడి మాట పోల్లుపోకుండా తీర్చి వేస్తుండటంవల్ల పరపతి పెంచుకుంటూ వస్తున్నాను

'కాని ఎదిగే మనిషిని యీ సమాజం ఎదగకుండా చేయటానికి ఎన్ని ప్రయత్నాలు చెయ్యాలో అన్నీ చేస్తుంది.

'బంధువులవల్లకానీ, స్నేహితులవల్లగానీ ఆదరణకన్న మనల్ని పిండివేసే సమస్యలే ఎదురవుతూ వుండేవి పాత పరిచయస్తులుకదా అని ఎవరిమీదనన్నా ఆప్యాయత చూపించబోతే, అది ఆసరా చేసుకుని తమ కష్టాలు వెళ్ళబోసుకుని, పీక్కుతిని తమ అవసరాన్ని తీర్చి డబ్బుని సాధించేదాకా వదిలేవాళ్ళుకాదు ఎంత కష్టపడి సంపాదించినా ఎప్పుడు చూసినా బ్యాంక్ బాలెన్స్ రెండుమూడు వందలకన్నా ఎక్కువ వుండేదికాదు. నాకు బట్టలు కుట్టించుకోవాలంటే నెలల తరబడి ఆలోచించేవాడ్ని. ఇంటికి సౌకర్యం చేసుకోవాలంటే వారాల తరబడి తటపటాయించేవాడ్ని ఎక్కడికన్నా పోవాలంటే గంటల తరబడి రిక్షావాడితో బేరంచేసి, బేరం కుదిరితే ఎక్కటం, లేకపోతే కాళ్ళీడ్చుకుంటూ నడవటం చేసేవాడ్ని. ఇంత పదిలంగా కూడబెట్టిన డబ్బు ఎవడి మొసలికన్నీళ్ళో విని నా కష్టార్జితమంతా వాడికి ధారాదత్తం చేసేవాడిని

'రాము నాకంటే మెత్తనివాడని చెప్పానుకదా జీవితంలో పైకి రాకముందే యింతకంటే సుఖంగా వుండేవాడు పాత పరిచయస్తులమని చెప్పుకుంటూ ఎవడో ఒకడు వచ్చి కాల్చుకుతిని రూపాయలు వొలుచుకుని వెళ్ళిపోయేవాడు నేను బాధపడతానని చాలా విషయాలు చెప్పేవాడు కాదు.

'ఇవన్నీ నాకు కొంతవరకూ తెలిసిన విషయాలుగాని, తర్వాత తర్వాత మానసికంగా ఎందుకో కృంగి పోతున్నట్లు గ్రహించి, దాన్ని గురించి ఎంత తెలుసుకుందామన్నా తెలుసుకోలేక పోయాను

'తన చెల్లెలికి మంచి సంబంధం చూసి పెళ్ళి చెయ్యాలనీ, ఎంత కట్నమిచ్చయినా మంచి వరుడ్ని తీసుకొస్తాననీ నాతో తరచు చెబుతూ వుండేవాడు దానికోసమని అతను చదువుకుంటూన్న రోజుల్నుంచీ కూడా పెద్ద మొత్తానికి ఇన్సూర్ చెయ్యటం, అష్టకష్టాలూపడి ఆ ప్రిమియంలు చెల్లిస్తూ వుండటం నాకు తెలుసు

'సరస్వతికూడా యుక్తవయసుకొచ్చింది

'ఆ డబ్బంతా అతని చేతికి వస్తుంది, దాంతో అతను చెల్లెలి పెళ్ళి చేస్తాడని అనుకుంటూ వుండేవాడ్ని




'ఒకరోజున సరస్వతి వగరుస్తూ నా దగ్గరకు పరిగెత్తుకు వచ్చింది. అన్నయ్య ఎవరితోనో తీవ్రంగా ఘర్షణ పడ్డాడనీ, యిద్దరూ ఆవేశాలతో వళ్ళు మరిచి కర్రలు తీసుకుని కొట్టుకున్నారనీ, ఆ పోరాటంలో రాముకు బలమైన గాయాలు తగిలాయనీ చెప్పింది. నేను ఆతృతగా ఆమెవెంట వెళ్ళాను

'రాముకి బలమైన గాయాలు తగిలినమాట నిజమే. అతని పరిస్థితి ఆందోళన కరంగా వుంది.

'వెంటనే అతన్ని హాస్పిటల్లో చేర్పించాను

'నాలుగురోజులు చావుబ్రతుకులమధ్య నరకయాతన పడ్డాడు. తెలివి వచ్చి నప్పుడు చెల్లెలివంక పిచ్చిచూపులు చూసి కళ్ళ నీళ్ళు పెట్టుకునేవాడు. సరస్వతి బావురుమని ఏడ్చేది నా కాళ్ళమీదపడి అన్నయ్యను ఎలాగైనా బ్రతికించమని కన్నీళ్ళతో అభిషేకం చేసేది

'నా చేతుల్లో ఏముంది?

'రాముని దక్కించుకోలేకపోయాను చివరకు.

'సరస్వతి వున్న ఒక్క అన్నయ్యనికూడా పోగొట్టుకుని వంటరిదై పోయింది.

'నాకు తెలిసిం దేమిటంటే అతని మేనమామ కూతురి పెళ్ళికోసమని పీక్కు తింటే, ఆరునెలల్లో తిరిగి ఇవ్వాలనన్న షరతుమీద ఇన్సూరెన్స్ ఎమౌంట్ మీద మేక్సిమమ్‌లోన్ తీసుకుని అతని కిచ్చాడనీ, గడువు దాటిపోయినా ఆ మేనమామ డబ్బు తిరిగి యివ్వలేదనీ, దానికోసమని ఎన్నోసార్లు అతనిచుట్టూ కుక్కలా తిరిగాడనీ, చివరకు అతను మొండి చెయ్యి చూపించేసరికి కోపం ఆపుకోలేక చెయ్యి చేసుకున్నా

డని, తర్వాత యిద్దరూ కర్రలు తీసుకునేసరికి, రాము దెబ్బలకు గురయ్యాడని

'ఏమయితేనేం? నేను రాముని పోగొట్టుకున్నాను.

'దిక్కులేని దశలో మిగిలిపోయిన సరస్వతిని నేను ఆదుకోవలసి వచ్చింది.

'సరస్వతి నాకంటే వయస్సులో పది పదిహేనేళ్ళు చిన్న. అంటే అప్పట్లో పదిహేడు, పద్దెనిమిదేళ్ళకంటే ఎక్కువుండవు. నాకప్పటికే పెళ్ళయి చాలా ఏళ్ళు దాటి నలుగురు పిల్లలు కూడా వున్నారు

'అంత చిన్న వయసులో సరస్వతి యీ సంఘంలో ఒంటరిగా ఎలా జీవిస్తుంది? అందులోనూ అందగత్తె.

'ఒక ప్రక్కన నేను వ్యాపారంలో ఎదుగుతున్నాను అనుకున్నదానికంటే వేగంగా డబ్బు ఎక్కువగానే సంపాదించాను. నా చుట్టూ సమాజంలో పలుకుబడిగల మిత్రులు, రకరకాల వ్యాపకాలు, అనేక పరిచయాలు—నాకో ఉన్నతమైన సొసైటీ ఏర్పడింది.

'అయినా నా బాధ్యత మరిచిపోకుండా తరుచు సరస్వతి ఇంటికి వెళ్ళి, ఆమె యోగక్షేమాలు కనుక్కుంటూవుండేవాడిని. ఆమె తన జీవనం కొనసాగించటానికి సాయపడుతూవుండేవాడ్ని.

'ఒక మంచి సంబంధం చూసి ఆమెకు పెళ్ళిచెయ్యాలని తీవ్ర ప్రయత్నాలు చెయ్యటం మానలేదు.

'ఈ వాతావరణంలో మా యిద్దరితో ఎవరికివారికి రెండు రకాల సమస్యలు ఉత్పన్నమయినాయి.

'ఆమెకు ఒంటిగా వుండటంబట్టి యీ ప్రపంచంనుండి కాపాడుకోవటం దుస్సాధ్యంగా వుంది. ఒక స్త్రీకి 'రక్షణ లేదు' అన్న సత్యం తెలుసుకున్న సమాజం రకరకాలుగా మీదకు ఉరుకుతుంది. ఆమె బయటకు వస్తే ఎవరెవరో పురుషులు వెంటబడే వారు. ఎన్నోవిధాల ఆకర్షించటానికి ప్రయత్నించేవారు. చివరకు 'లొంగిపోకపోతే బల వంతంగా ఎత్తుకుపోతామ'ని బెదిరించేవారు. ఒకటిరెండుసార్లు అటువంటి ప్రయత్నాలు చేశారు కూడా. నేను అడ్డుగా నిలవబట్టి ఆ ప్రయత్నాలు ఫలించలేదు. అవకాశం దొరికినప్పుడల్లా ఎవరో ఒక స్త్రీ వచ్చి సరస్వతి ఒంటరితనాన్ని గుర్తుచేస్తూ, సుఖాల మీద ప్రలోభం కలిగించటానికి ఏవేవో ఉదాహరణలు చెబుతూ, ఆమెకా సుఖాలందివ్వ టానికి యీ లోకంలో ఎందరో సిద్ధంగా వున్నారని గుర్తుచేస్తూవుండేది. వీటన్నిటి నుంచీ రక్షించుకోలేక సరస్వతి తలక్రిందులైపోతూ, యీ జీవితంమీద విరక్తి పెంపొందింపచేసుకుంటూ, నిత్యం ఓ నరకం అనుభవిస్తూవుండేది.

'ఇహ నేను!

'తరుచు ఆమె ఇంటికి పోతూవుండటంవల్ల నన్ను గురించి ఎన్నో వదంతులు లేచాయి. నా ఆఫీసులో ఉద్యోగస్థులు నా రహస్యం కనిపెట్టేసినట్లు నన్ను చుల్కన




చెయ్యటానికి ప్రయత్నాలు చెయ్యసాగారు. నాకు వినిపించీ వినిపించనట్లు గుసగుస లాడుకునేవారు నేనేదో తప్పుచేస్తున్నట్లు హితైషులమని చెప్పుకునేవారు నీతి బోధలు చెయ్యటం మొదలుపెట్టారు. నా భార్య నన్నునుమానించసాగింది. స్నేహితులు లోలోపల అసూయతో దగ్ధంఅవుతూ బయటకు నంగనాచుల్లా మాట్లాడేవారు.

'ఇవన్నీ అనుక్షణం అంకుశపు పోట్లలా తగులుతూవుండేవి.

'దీనికితోడు సరస్వతికోసం నేను చూపిన సంబంధం — అన్ని హంగులూ పూర్తయి, ముహూర్తం కూడా నిర్ణయింపబడి, ఆఖరిదశలో పెళ్ళికూతురికీ, పెళ్ళి చేసేవాడికీ సంబంధం వుందన్న ప్రచారం జరిగి యించుమించు పీటలమీద పెళ్ళి ఆగిపోయినట్లు ఆగిపోయింది.

'ఈ సంఘటనతో యీ ప్రచారానికి ఓ క్లైమాక్స్ ఏర్పడింది. మా ఇద్దరి పేర్లూ గోడలమీదకెక్కాయి మా ఆవిడ పెద్ద దుమారం రేపింది. సరస్వతితో సంబంధం తెంపుకోకపోతే పుట్టింటికి పోతానని సామానులు సర్దుకుకూర్చుంది.

'ఒక్కసారి నా మనసు తిరగబడినట్లయింది. రక్తనాళాలలో ఉడుకు రక్తం ప్రవహించింది.

'ఈ ప్రపంచంలో తప్పు చెయ్యందెవరు?

'మడిగట్టుకు కూర్చుందెవరు?

'ఒకప్పుడు మానవుడు తప్పులు బహిరంగంగా చేసేవాడు. ధైర్యంగా, దబాయించి చేసేవాడు. ఒకప్పుడంటే ఎప్పుడో కాదు — మొన్నమొన్నటిదాకా — ఈ వ్యక్తిత్వాల, వ్యక్తిగత స్వాతంత్ర్యాల నినాదాలు ప్రబలేదాకా యిదే అమలుపర్చ

బడుతూవచ్చింది. చూడ్డానికి ఘూర్ణంగా, మాటుగా కనపించని — అనాగరికం, అభ్యుదయ నిరోధకం — ఇత్యాది పేర్లు పెట్టని—అప్పుడే మానవుడు సుఖపడుతూ వచ్చాడు. అప్పుడు మనిషిలో ద్వంద్వజీవికాలు వుండేవేమోగాని ద్వంద్వజీవి వుండే వాడు కాదు. ఇప్పుడు నాగరికత, సంస్కారం, అందరూ పదేపదే నోరు నొప్పెట్టే టట్లు చెప్పే మానవత పెరిగాయి. అందుకని మనిషి రహస్యజీవి అయినాడు తప్పు అప్పుడూ చేశాడు ఇప్పుడూ చేస్తున్నాడు అప్పుడు బహిరంగంగా చేశాడు. ఇప్పుడు చాటుగా చేస్తున్నాడు ప్రతివాడూ మానసిక వ్యభిచారం చేసే వాడే అందుకనే పిచ్చెక్కటాలూ, ఆత్మహత్యలూ, లేకపోతే చేతకాని అతివాదాలూ ఎక్కువై పోయాయి. పెదాలు వాగేదొకటీ, మనసు నమ్మేదొకటీ, ఆచరించేదింకొకటీ—ఇన్నిటి మధ్య ప్రతి మనిషీ అతీతుడులా వుండటానికి ప్రయత్నిస్తున్నాడు.

'ఒక బాధ్యతగా, ప్రాణస్నేహితుడిపట్ల ప్రవర్తించవలసిన ధర్మంగా నేను నెరవేర్చింది—ఈ సంఘంలో వేళాకోళానికి గురయింది

'నేను తిరగపడ్డాను.

'ఆఫీసులో ఉద్యోగులందర్నీ పిలిచాను 'మీరంతా చాలా గొప్పవాళ్ళు. నేనవి నీతిపరుడ్ని. నాలాంటివాడి దగ్గర ఉద్యోగం చెయ్యటం అవివేకం. మీరంతా రాజీ నామాలు చేసి వెళ్ళిపోండి. రేపటిదాకా టైమిచ్చాను.' అన్నాను భార్య దగ్గరకు వెళ్ళాను. 'నీకు చాలా ద్రోహం చేశాను. నీ జీవితాన్ని అన్యాయం చేసిపారేశాను. ఇదిగో ప్రస్తుతానికి నా దగ్గరున్న రెండు లక్షలూ యిస్తున్నాను. పిల్లల్ని యిక్కడ వుంచినా సరే తీసుకెళ్ళిపోయినా సరే—నేను మాత్రం చెడుమార్గానే ప్రయాణించ టానికి నిశ్చయించుకున్నాను.' అని ఆమె సమాధానంకోసం వినకుండా బయటకు వెళ్ళిపోయాను

'రాత్రి పది గంటలదాకా కారులో పిచ్చెక్కినవాడిలా తిరిగి, అప్పుడు సరస్వతి ఇంటికి వెళ్ళాను. వేళగాని వేళప్పుడు వచ్చిన నన్ను చూసి తెల్లబోయింది.

'సరస్వతీ! నా గురించి నీ అభిప్రాయం ఏమిటి?' అనడిగాను

ఆమె నవ్వింది 'ఇన్నాళ్ళూ నా అభిప్రాయం గురించి తెలుసుకోకుండానే నన్ను కాపాడుతూవచ్చారు. నా అభిప్రాయంతో నిమిత్తం లేకుండానే నాకు పెళ్ళి సంబంధం కూడా చూశారు. ఇప్పుడు దేనికి కావలసివచ్చింది?' అన్నది

'ఇప్పుడు నువ్వు నాకు కావల్సివచ్చావు గనక '

ఆమె నా వంక ఆశ్చర్యంగా చూసింది 'అంటే ?'

ఆమెకు దగ్గరగా నడిచి హఠాత్తుగా నా రెండు చేతులూ ఆమె చుట్టూ వేసి దగ్గరకు లాక్కున్నాను 'మొదట్లో నీ గురించి నాకు తెలియదు. కాని నేనేం పోగొట్టు కుంటున్నానో యిప్పుడు తెలిసింది. నాకేం కావాలో యిప్పుడు తెలిసింది ఇప్పుడు నీనుంచి విడిపోవటానికి నేను సిద్ధంగా లేను.' అన్నాను ఆవేశంగా

'బహుశా మిగతా అందర్నీ వొదులుకొవచ్చు. నీతొనే నా ప్రపంచం నిర్మించుకుంటాను.'

'వాళ్ళందర్నీ విడిచిపెట్టటం అంత సులభం కాదు. మీరు విడిచిపెట్టినా వాళు విడిచిపెట్టరు. ఏదో రూపంలో ప్రవేశిస్తూవుంటారు. అయినా మొదట వచ్చింది వారు

నేను కొంచెంసేపు ఆలోచించాను 'వాళ్ళు తొలగిపోకపోయినా నువ్వూ వుంటావు.' అన్నాను.

'అంటే ఉంపుడుకత్తెగానా?'

నేను ఉలిక్కిపడ్డాను. ఏం జవాబు చెప్పాలో తెలియలేదు. అప్రయత్నంగ నా చేతులు ఆమెను వొదిలేశాయి,

ఆమె నవ్వి, 'మీరు మానసికంగా అలిసిపోయివున్నారు. రండి' అని నా చెయ్యి పట్టుకుని మంచం దగ్గరకు తీసుకెళ్ళి పడుకోబెట్టింది తాను నా ప్రక్కన జుట్టులోకి వ్రేళ్ళు పోనిచ్చి దువ్వుతూ కూర్చుంది.

'మీకేం కావాలో మీకు తెలీదు.' అన్నది కొంతసేపటికి.

నేనామె ముఖంలోకి ప్రశ్నార్థకంగా చూశాను.

'మీకు నేను కావాలి. కాని నా శరీరం కాదు.'

నా కర్థం కాలేదు

'శారీరకావసరాలు తీర్చుకోవాలంటే మీకున్న స్థానానికి మీకెన్నో అవకాశా లున్నాయి. వాటిని గురించి ఎవరికీ తెలియనవసరంలేదు నేనూ కేవలం అందుకే ఉపయోగపడితే నా గురించి ప్రపంచాని కెదురీదవలసిన అవసరంలేదు. ఎవరి దృష్టిలో పడగుండా అప్పుడప్పుడూ గుట్టుచప్పుడు కాకుండా అవసరం తీర్చుకునిపోవచ్చు కాని నానుంచి మీకు మనశ్శాంతి లభించాలంటే యీ ప్రపంచం ఎన్ని అపోహలైనా పడనీ — మనం మాత్రం యిప్పుడు మనం వున్న భంగిమను మించి ముందుకు పోకూడదు'

నేనాశ్చర్యపోయాను. 'ఏమాశించి యిలాంటి జీవితాన్ని కోరుకుంటున్నావు? ఇందులో నువ్వు సుఖపడేదేముంది?' అనడిగాను.

సరస్వతి నవ్వింది. 'సుఖానికి అనేక నిర్వచనాలుంటాయి. ఈ భూమ్మీద మనుషులకునే ప్రతి మనిషీ ఒకే పద్ధతిన మనుగడ సాగించాలని ఏముంది? మీ గురించి నా అభిప్రాయమడిగారు ఇప్పుడు చెబుతున్నాను మిమ్మల్ని మనిషికన్నా ఎక్కువగా చూసుకుంటున్నాను మనుషులతో సాగించే కార్యకలాపాలు మీతో నాకొద్దు. మానవుడు తన మానసికానందంకోసం పరిస్థితులనుబట్టి ఎన్నో ప్రలోభాలను త్యజిస్తున్నాడు. నేను దీన్ని త్యజిస్తున్నాను.'

'కాని లోకం దృష్టిలో నువ్వు ఉంపుడుకత్తెగానే వుండిపోతే?'

'అది యీ లోకంనుంచి నాకు రక్షణనిస్తుంది. మన యిద్దరి మనసుల్లోనూ

నేను ఉంపుడుకత్తె స్థానానికి మించి ఎదిగితే చాలు.

ఆ రాత్రి ఆమె దగ్గర తల్లి ఒడిలో చంటిపిల్లాడు నిద్రపోయినట్లు మాట్లాడాను.

మరునాడు రెట్టించిన ధైర్యంతో ఇంటికెళ్ళాను.

'అయితే మీ నిర్ణయానికి తిరుగులేదా?' అనడిగింది నా భార్య.

లేదన్నాను.

నా ముఖంలోకి ఎగాదిగా చూసింది. నా కళ్ళలో ఏం చూసిందో ఏమో మెదలకుండా లోపలకెళ్ళిపోయింది.

ఆఫీసుకెళ్ళాను. అంతా తలలు వంచుకుని నిలబడివున్నారు.

'ఇంకా యిక్కడెందుకు? మీమీ ఉద్యోగాలు వొదిలి వెళ్ళిపోండి' అన్నాను కఠినంగా.

ఒక్కొక్కరూ వినయంగా నా ముందుకు వచ్చారు 'తప్పయిపోయింది. క్షమించండి' అన్నారు

నాలోనుంచి ఏదో వేదనతో కూడిన ఆవేశం పెల్లుబికింది.

'నా ఆఫీసు విషయాల్లో మీ అందర్నీ కన్నబిడ్డల్లా చూసుకుంటున్నానే. ఎంతో ఆదుకుంటున్నానే. నా సొంత విషయాలు మీకెందుకు? మీ పెళ్ళాలని నేనపవిత్రంగా చూడటంలేదే? మీ అక్కాచెల్లెళ్ళ జీవితాలతో నేనేం ఆడుకోవటంలేదే? మరి ఎందుకు నామీద మీకెందుకు కసి? ఉపకారం చేసేవాడి వ్యక్తిగత విషయాలు భయంకరమైన చర్చనీయాంశాలుగా మీ కెందుకు కనబడతాయి? ఒకడి పెళ్లాం గురించి యింకొకరు కామంతో ఆలోచించనివాళ్ళు మీలో ఎందరున్నారు? తోటివాడి పెళ్ళాం వలచి ప్రక్కలోకి వస్తే కాదనే పురుషోత్తములు మీలో ఎందరున్నారు?'

ఒక్కరూ పెదవి విప్పలేదు.

'వెళ్ళండి వెళ్ళి మీమీ పనులు చూసుకోండి'

అందరూ ఆజ్ఞను శిరసావహిస్తున్నట్లు ఎవరి సీట్లలోకి వాళ్ళు వెళ్ళిపోయారు.

వారిలో నాపట్ల భక్తిని కలిగించగలిగానని నేననను కాని భయాన్ని కలిగించాను.

ఆ మాత్రం చాలు. జీవితంలో విజయాన్ని సాధించాలంటే ఏదో ఓ మార్గం అవసరం

అంతే. అప్పట్నుంచీ సరస్వతీగురించీ ఎవరిదగ్గర్నుంచీ ఎలాంటి సమస్యా ఉత్పన్నం కాలేదు

కాని మానవత వున్నవాడికి అడుగడుక్కీ మొదలంటా నరికేసే ఎన్నో సమస్యలు ఎదురవుతూ వుంటాయి. బిజినెస్‌లో ఎన్నోసార్లు ఎక్కడికన్నా దారిపోయే టంతటి ఎదురుదెబ్బలు తిన్నాను. మనసారా దగ్గరకు చేరదీసిన స్నేహితులు మనుషులంటే అసహ్యం కలిగేటట్లు ద్రోహం చేశారు. పిల్లలు యీ తరాల అంతరాల తాకిడిలో, మారే సాంఘిక ధర్మాల్లో ప్రవాహవేగంతో కొట్టుకుపోలేక, ఎదురీదలేక

ఎన్నో సమస్యలు లేవనెత్తారు ఎన్నోసార్లు యీ ప్రపంచంమీద విరక్తి కలుగుతూ వుండేది.

అలాంటి కలతల్లో సరస్వతి కోమలహస్తం నన్ను నిద్రపుచ్చేది.

ఆమె యింటికి యధేచ్ఛగా వెడతాను. బుద్ధిపుడితే ఊళ్ళు తిరుగుతాను. ఆకలేస్తే అక్కడే భోంచేస్తాను రోజుల తరబడి గడుపుతాను.

"కాని కాని "

రాజారావుగారి కంఠంలో గద్గధికం తొణికిసలాడింది.

"ఇన్ని సంవత్సరాల దీర్ఘకాలంలోనూ ఆమె చల్లని చేతి స్పర్శ తప్ప యింకేం నాకు తెలీదు "

నాక్కూడా కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఎంత ఆపుకుందామని ప్రయత్నించినా నా శక్యంకాక చెంపలు వాటి చల్లదనంతో పావనమయినాయి.

వొచ్చిన కొత్తలో ఆయన ఎవరని అమ్మనడిగితే "నా దైవం" అనటం గుర్తొచ్చింది.

"నాన్నగారూ" అన్నాను.

ఆయన ఆశ్చర్యంగా నా వంక చూశారు.

"ఒకసారి లేవండి."

"ఎందుకమ్మా?"

"లేచి నిలబడండి. చెబుతాను."

ఆయన సిమెంటు బల్లమీదనుంచి దిగి, ఓ దేవతాస్వరూపంలా దృగ్గోచరమయారు.

నేనూ లేచి నిలబడి, వొంగి ఆయన పాదాలను కనుల కద్దుకున్నాను.

చప్పున నా బుజాలను పట్టుకు లేవనెత్తి నన్ను దగ్గరకు తీసుకున్నారు

"ఏమిటమ్మా యిదీ?"

"మీరు దైవస్వరూపులని నన్ను కూడా గుర్తించనివ్వండి."

నా వంక ప్రేమగా చూశారు. "సరస్వతికున్న చాదస్తం నీక్కూడా వున్నదమ్మా "

"అందరూ అమ్మ అంత గొప్పవాళ్ళు కాలేరు నాన్నగారూ "

ఓ అయిదు నిమిషాలు యిద్దరూ నీటికేసి తిరిగి అలా మౌనంగా చూస్తూ నిలబడ్డాము.

"ఇహ పోదాం పదమ్మా."

కారెక్కాము

ఆయన కఠినమైన చేతుల్లో స్టీరింగ్ సుతారంగా తిరుగుతోంటే కారు మెత్తగా ముందుకు సాగిపోతోంది.

(సశేషం)

# సినిమా

## హీరో! హీరో!

సకల విద్యాపారంగతుడూ, సర్వ సద్గుణ సంపన్నుడూ, కలలో కూడా తన వలన ఏ చెడూ జరగడం సహించలేనివాడూ, ఎక్కడ చెడువున్నదో ఆ చెడుకు ప్రక్షాళితం చేయడంకోసమో, దుష్టశక్తుల పరిమార్చడం కోసం హుటాహుటిని బయల్దేరకుండానే అక్కడ ప్రత్యక్షమయిపోయేవాడూ, అవసరమైతే ప్రేమించిన కన్యనుకూడా దానంచేయగల త్యాగశీలీ, కుటుంబంకోసం (టెరిలీన్ బట్టలు ధరించినా) చిరుగుల బనీన్లు తొడిగేవాడూ, పొలంలో పనిచేస్తున్నా మడత నలగని ఇస్త్రీబట్టమాత్రమే ధరించు నాగరీకుడూ, అవసరమైతే ఇరవైమంది రక్తం తాగే రౌడీలను ఒరిచేతులతో చితకబాదగలిగినవాడూ- ఇన్ని లక్షణాలూ ఉన్న వ్యక్తి ఎవరు? ఇంకెవరు మన సినిమా 'హీరో'. సినిమా కథ మరీ 'కల్పితం'గా ఉంటున్నప్పుడు ఈ చిక్కులు (చిక్కులు కాదా?) తప్పవు. కథలు సాంఘికంగా మన జీవన స్థితిగతులకు చాలా దూరంగా ఉంటూ వస్తున్నప్పుడు హీరో ఇలానే ఉంటాడు మరి! సినిమా కోసం కథ తయారుచేసు



వాణిశ్రీ, డాక్టర్ అక్కినేని ''ఆలుమగలు' లో



''స్నేహం''లో శంకర్, బేబి వరలక్ష్మి

కోవడమూ, కథ ఎన్నుకోవడమూ జరిగే టప్పుడు. కొంచెం జాగ్రత్త వహిస్తే, హీరో లక్షణాలు కాపాడుకొంటూనే కొంచెం మనతో అయిడెంటిపై అయే హీరో తయారుకాడా? అలా తయారయిన 'హీరో' చిత్రవిజయానికి సహకరించదా? చిత్రప్రముఖులూ ఆలోచించి చూడండి!

## సెక్స్ సమస్యలు!

యువకుడూ, మంచి చిత్రాలు నిర్మించా లన్న అభిలాషతో చలనచిత్ర నిర్మాణంలో అడుగిడినవాడూ అయిన వై. సునీల్ చౌదరి మేనకోడలు, బలిపీఠం చిత్రాలు నిర్మించి మంచిచిత్రాల నిర్మాతగా ఇప్పటికే పేరొందారు. ఏ సమస్యపై సినిమా తీసినా సెక్స్ ఎక్స్ ప్లాయిటేషన్ మాత్రమే ప్రధానంగా నిర్మాణం సాగించి డబ్బు సంపాదించే ప్రయత్నాలు చేస్తున్న ప్రబుద్ధు లున్న ఈ చిత్రసీమలో సెక్స్ సమస్యనే ప్రధానంగా తీసుకొని క్లీన్‌గా, కుటుం బంలో అందరూ కలిసి చూడదగ్గ చిత్రంగా నిర్మించే ప్రయత్నం చేసిన సునీల్ చౌదరి ఉండటం చిత్రసీమ అదృష్టమే అనుకో వాలి. దాసరి నారాయణరావు కథ, మాటలు, దర్శకత్వం బాధ్యతలు చేపట్టి చిత్రీకరించిన 'బంగారక్క' చిత్రం సునీల్ చౌదరిచే రంగుల్లో నిర్మించబడింది. శారీరకంగా పెరిగినా మానసికంగా చిన్నపిల్ల మన స్తత్వం పోని ఓ యువతి, ఆ కారణంగా సంసార జీవితంలో ఎదుర్కొన్న సమస్యలు చిత్రించబడ్డ ఈ చిత్రంలో మురళీమోహన్, శ్రీదేవి, ఈశ్వరరావు, అల్లురామలింగయ్య సత్యనారాయణ రమాప్రభ మొదలైనవారు నటించారు



''ఇదెక్కడి న్యాయం''లో ప్రభ, మురళీమోహన్

## 'మృగయా'కు ప్రశంస!

ప్రముఖ చిత్రదర్శకులు మృణాళ్ సేన్ దర్శకత్వంలో ఉదయభాస్కర్ ఇంటర్నేషనల్ (విజయవాడ) సంస్థ నిర్మించిన "మృగయా" చిత్రం "బెంగాల్ ఫిలిం జర్నలిస్ట్స్ అసోసియేషన్" వారి ఉత్తమ చిత్రం అవార్డు గెలుచుకొంది. ఇతర భాషా చిత్రాలలో ఉత్తమ దర్శకత్వం బహుమతి. కథానాయకుడు "మిధున్ చక్రవర్తి"కి ప్రత్యేక బహుమతి, ఉత్తమ ఛాయాగ్రహణం (కలర్)కు కె. కె. మహాజన్‌కు అవార్డూ గెలిచిపెట్టిందీ చిత్రం అంతేకాక పశ్చిమబెంగాల్ ప్రభుత్వంచే ఉత్తమ ద్వితీయ చిత్రం అవార్డు కథానాయకుడికి ఉత్తమ నటుడి అవార్డూ కె కె మహాజన్‌కు ఉత్తమ ఛాయాగ్రహకుడి అవార్డూ కూడా లభించాయి 'మృగయా' చిత్రానికి. ఒక్కుమ్మడిగా ఇన్ని బహుమతులు గెలుచుకొన్న 'మృగయా' నిర్మాతలు తెలుగువారు. గర్విద్దాం మనం!

## సృష్టిలో తీయనిది....

స్నేహమే సృష్టిలో తీయనిది అన్నాడో కవి. బాపు దర్శకత్వంలో తీసిన చిత్రం 'స్నేహం' అన్నారు సాగరచిత్ర సంస్థ వారు. ఇద్దరు వికలాంగుల మధ్య (ఒకరు కుంటి, ఒకరు గుడ్డి) గల స్నేహాన్ని ప్రధానంగా తీసుకొని తీసిన తీయని (పదాల ప్రయోగం గొడవగా ఉంది సార్ తీయని ఇక్కడ తీపికి సంబంధించిందని గ్రహించగలరు) చిత్రం స్నేహం ఇషాన్ ఆర్య (అవును,

ఛాయాగ్రహణం ఎమ్వీయల్ రచన మహాదేవన్ సంగీతం నిర్వహించిన ఈ చిత్రాన్ని సి. హెచ్. సీతారామరాజు నిర్మించారు.

## హిందీలోకూడా....

రవిరాజ్ ఇంటర్నేషనల్ శ్యాంబెనెగల్

'గడుసమ్మాయి'లో జయసుధ



పేరు పెట్టలేదు) ఇప్పుడు కేవలం తెలుగులోనే కాక, హిందీలో కూడా నిర్మింపబడుతోంది. వాణిశ్రీ ప్రధానపాత్రలో కన్పించే ఈ చిత్రంలో రావుగోపాలరావు అనంతనాగ్, వేణుగోపాల్, సులభదేశ్ పాండే, స్మితాపాటిల్, సిద్దష్, యూన్సీ గవర్రాజు, ఏ ఆర్. కృష్ణ నటించారు వనరాజ్ భాటియా సంగీతం, గోవింద్ నిహలానీ ఛాయాగ్రహణం ఆరుద్ర రచన ఉన్న ఈ చిత్రాన్ని కేశన జయరామ్ కె వెంకట్రామరెడ్డి నిర్మిస్తున్నారు.

## జీవితానౌకాయానం !

తెలుగు ప్రేక్షక జలధిలో జీవిత నౌకాయానానికి సర్వం సిద్ధం చేసింది డి. వి. యస్ సంస్థ. డి.వి.యస్ రాజు 'జీవిత నౌక' పేరిట రంగుల్లో నిర్మించిన చిత్రం ఏప్రియల్ లో విడుదల కాబోతోంది శోభన్‌బాబు, రాజబాబు, శరత్‌బాబు ముక్కామల, సాక్షిరంగారావు, జయప్రద జయసుధ, విజయభాను, రమోల నటించిన ఈ చిత్రానికి కె. విశ్వనాధ్ దర్శకులు కె. వి. మహదేవన్ సంగీత దర్శకులు



దర్శకుడు శ్యాం బెనిగల్

## మహేష్ దర్శకత్వం!

'అనగా అనగా ఒక తండ్రి' పేరుతో ఓ నవల రాసి, ప్రచురణపిమ్మట అదే పేరుతో ఆ నవలను చలనచిత్రంగా నిర్మించి విజయం పొందారు మహేష్. అంతేకాదు 'ముగ్గురు మూర్ఖులు' పేరిట వ్యంగ్య రచనలు చేసి, ఆ 'ముగ్గురు మూర్ఖులు' పేరుతో సినిమాతీసి కూడా విజయం పొందారీయన. ఇప్పుడు మహేష్ 'గంగ యమున సరస్వతి' పేరుతో తమ నూతన చిత్రనిర్మాణం ప్రారంభించారు. విశేషం ఏమంటే ఈసారి తన చిత్రానికి తనే దర్శకత్వ బాధ్యతకూడా చేపట్టడం! మురళీమోహన్, సత్యనారాయణ, గిరిబాబు, నాగభూషణం, మాడా, జానకి, రోజారమణి, సూర్యకాంతం, శుభ, జయమాలిని, మొదలైనవారు నటిస్తున్నారీ చిత్రంలో. జూన్ నెలలో విడుదలకు

కృష్ణంరాజు, శారదలు నాయకా నాయికలుగా నటిస్తున్న వర్ణచిత్రం పేరు ఇది. పి. చంద్రశేఖరరెడ్డి దర్శకత్వంలో ప్రపూర్ణా మూవీస్‌వారు నిర్మిస్తున్న ఈ చిత్రంలో రావుగోపాలరావు, మోహన్‌బాబు, అల్లురామలింగయ్య, చంద్రమోహన్, పద్మప్రియ, జయలక్ష్మి, గిరిజారాణి మొదలగువారు నటిస్తున్నారు.

## ఢిల్లీ తెలుగు ఫిలిం సొసైటీ సేవలు!

ఢిల్లీలో నివసిస్తున్న తెలుగువారి నిర్వహణలో 'తెలుగు ఫిలిం సొసైటీ' అక్కడి తెలుగు వారికి తెలుగు చిత్రాల ప్రదర్శనకు ఏర్పాటు చేయడమూ, ఢిల్లీకి

''సీత గీతదాటితే'' లో జ్యోతిలక్ష్మి





పద్మనాభం, విజయచందర్, గిరిబాబు ''కరుణామయుడు''లో

వస్తున్న తెలుగు చిత్ర ప్రముఖులకు అభినందన సమావేశాలు ఏర్పాటు చేయటమూ, వీటి వరకు తన కార్యక్రమాలు పరిమితం చేసుకోక తెలుగు చిత్ర పరిశ్రమను-తెలుగు చిత్రాలకు విదేశాలకు పంపే ప్రయత్నాలలో సహకారం అందిస్తూ ఆదర్శంగా కృషి చేస్తూంది ఢిల్లీ తెలుగు ఫిలిం సొసైటీ కార్యదర్శి శ్రీ టి రామచంద్రరావు ఢిల్లీ రాష్ట్ర సాహిత్య కళాపరిషత్ జనరల్ కౌన్సిల్ సభ్యుడిగా కూడా నియమించబడ్డారు

## ఏడు రంగుల సినిమా!

ఉదయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ ఏడు రంగుల సినిమా నిర్మిస్తున్నారు అవును 'ఇంద్రధనుస్సు'లో ఏడు రంగులేగా ఉంటాయి కె. బాపయ్య దర్శకత్వంలో నిర్మించబడుతున్న 'ఇంద్రధనుస్సు'లో కృష్ణ, శారద, గుమ్మడి, ప్రభాకరరెడ్డి, శ్రీధర్, నాగేష్, శరత్‌బాబు, సారధి, కాంచన, జయమాలిని, గిరిజారాణి, ఫణి మొదలైన వారు నటిస్తున్నారు కె. వి మహదేవన్ సంగీతం, పి భాస్కరరావు, ఛాయాగ్రహణం సమకూర్చిన ఈ చిత్రానికి నన్నపనేని సుధాకర్, టి సుబ్బానాయుడు నిర్మాతలు పేరులో రంగులే కాదు, ఈ చిత్రం కూడా రంగుల్లోనే నిర్మించబడుతోంది

## ద్వారకా ఆర్ట్ ప్రొడక్షన్స్ చిత్రం

కె ప్రత్యగాత్మ దర్శకత్వంలో ద్వారకా ఆర్ట్ ప్రొడక్షన్స్ పతాకం క్రింద పి రాఘవేంద్రరావు, పి వెంకటేశ్వరరావు నిర్మిస్తున్న చిత్రంలో మురళీమోహన్, జయసుధ, జగ్గయ్య, అల్లు



కృష్ణ, జయప్రద "ఈనాటి బంధం – ఏనాటిదో"లో

రామలింగయ్య, మోహన్‌బాబు, లక్ష్మీ కాంత్, సీతాలత వంకాయల సత్య నారాయణ నటిస్తున్నారు బొల్లిముంత శివరామకృష్ణ రచన, టి చలపతిరావు సంగీతం నిర్వహిస్తున్న ఈ చిత్రానికి దర్శకత్వంతో పాటు స్క్రీన్‌ప్లే బాధ్యత కూడా కె ప్రత్యగాత్మ చేపట్టారు.

## బాలచందర్ పర్యవేక్షణలో నూతన దర్శకుడు పరిచయం!

ప్రఖ్యాత దర్శకుడు కె బాలచందర్‌కు దర్శకత్వపుశాఖలో సహచరుడుగా ఉంటున్న ఈరంకిశర్మకు దర్శకత్వపు బాధ్యత నిచ్చింది గోపీకృష్ణా ఇంటర్నేషనల్ సంస్థ. "చిలకమ్మ చెప్పింది" పేరుతో నిర్మించబడుతున్న ఈ చిత్రానికి రచన గణేశ్ పాత్రో ఆత్రేయ పాటలు, ఎం ఎస్ విశ్వనాథన్ సంగీతం నిర్వహిస్తున్న ఈ చిత్రాన్ని చేగొండి హరి బాబు సమర్పిస్తున్నారు నిర్మాత చలసాని గోపి బాలచందర్ దర్శకత్వ పర్యవేక్షణ జరుపుతున్నారు ఈచిత్రం అంతా అవుట్ డోర్లోనే నిర్మించబడుతోంది

## దాసరి దర్శకత్వం! దాయి సంగీతం!

సంచలన దర్శకుడిగా పేరొందిన దాసరి నారాయణరావు ఆ పేరును నిల బెట్టుకుంటూనే వస్తున్నారు కొత్త తార లతో ప్రయోగం విజయవంతంగా చేసి తెలుగు చలనచిత్ర సీమలో మౌలికమైన



జయప్రద, శోభన్ బాబు "జీవిత నౌక"లో

మార్పు తెచ్చిన దాసరి, ప్రముఖ నేపథ్య గాయకుడు ఎస్ పి బాలసుబ్రహ్మణంను సంగీత దర్శకుడిగా పరిచయం చేస్తున్నారు 'కన్య-కుమారి' చిత్రం ద్వారా ఈ చిత్రానికి కథ, మాటలు స్క్రీన్‌ప్లే కూడా దర్శకుడే నిర్వహించారు శ్రీవిద్య, నరసింహరాజు, జయమాలిని, రమాప్రభ, నటిస్తున్నారు ఈ రంగుల చిత్రాన్ని నిర్మిస్తున్నది టి కాశి, టి నారాయణ రావులు

## రంగుల 'బంగారు బొమ్మలు'

బంగారు బొమ్మల్ని రంగుల్లో చేస్తున్నారు నిర్మాత దర్శకుడు వి బి రాజేంద్ర ప్రసాద్ రాజేంద్రప్రసాద్ చిత్రాలలో భారీ తనం, సాంకేతిక విలువలు కొట్టొచ్చినట్లు కన్పిస్తాయన్నది నిరూపించబడిన విషయమే అక్కినేని నాగేశ్వరరావు, మంజుల ప్రధాన పాత్రలలో 'బంగారు బొమ్మలు' చిత్రాన్ని నిర్మిస్తున్నాడీ నిర్మాత ఇప్పుడు తానే దర్శకుడు మహదేవన్ సంగీతం, ఆత్రేయ రచన, యస్, వెంకటరత్నం కెమెరా నిర్వహిస్తున్నారు

## ఎక్కడనుండి ఎక్కడకు?

అక్కినేని నాగేశ్వరరావు ఎక్కడ నుండి ఎక్కడికి పయనించాడు గుడివాడ దగ్గర పల్లెటూరునుంచి, మద్రాసుకూ, అక్కడనుంచీ హైదరాబాదుకూ-ఈ మధ్య అమెరికా ప్రభుత్వ ఆహ్వానంపై అమెరికాకూ—ఇంతేనా? కాదు, నాటకాల్లో ఆడ వేషాలనుంచీ సినిమాల్లో నటుడి వేషానికి,



డెహ్రాడూన్ లో ఆంధ్ర సమితి ప్రదర్శించిన 'నటన' నాటకంలో నటించిన దంపతులు పామరాజు సత్యనారాయణ, విజయలక్ష్మి

అక్కడనుంచీ మంచి నటుడి స్థాయికీ, అక్కడనుంచీ మహానటుడు శిఖరానికీ పయనించాడు. ముప్పైఏళ్ళ నటజీవితంలో ఎన్ని విజయాలు చవిచూచాడు! ఎన్ని సత్కారాలు పొందాడు. ఎన్ని అభినంద నలు స్వీకరించాడు. అక్కినేని నాగేశ్వర రావు ఎన్నిసార్లు ఉత్తమ నటుడిగా ఎన్ను కోబడ్డాడు ఎన్నిసార్లు రాష్ట్రపతి చేతిమీద బహుమతులందుకున్నాడు?— గుర్తించుకో నన్నిసార్లు పద్మశ్రీ అయ్యాడు, నట సామ్రాట్టయ్యాడూ ఇప్పుడు, చిన్నతనాన చదువుకోకపోయినా —జీవితంలో ప్రయా ణంచేస్తూ జీవితంలోంచే చదువు నేర్చుకుని పండితుడయ్యాడు ఇంగ్లీషు అనర్గళంగా డాక్టరేట్ లా మాట్లాడగలిగే స్థాయికెదిగిన నాగేశ్వరరావు ఇప్పుడు డాక్టరేట్ గానే ఇంగ్లీషు మాట్లాడగలడుకూడా!—ఆంధ్రా యూనివర్సిటీ 'కళాప్రపూర్ణ'తో నాగేశ్వర రావును సత్కరించి డాక్టర్ నాగేశ్వర రావును చేసింది ఆ గౌరవానికి అర్హు డయిన నాగేశ్వరరావును ప్రత్యేకంగా అభినందించడంలేదు మేము అర్హతను గౌరవించిన ఆంధ్రా యూనివర్సిటీని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాము

## కళావాహిని వార్షికోత్సవం!

ఆంధ్రుల సేవకొరకై మద్రాసులో స్థాపించబడిన తెలుగు మహాజనసమాజం యొక్క సాంస్కృతిక విభాగం 'కళా వాహిని' అయిదవ వార్షికోత్సవం 27-2-77న మద్రాసులోని అబట్స్బరీలో ఘనంగా జరిగింది. తమిళనాడు ప్రభుత్వపు విద్యాశాఖ కార్యదర్శి శ్రీ పి. జి. రంగ భాష్యం అధ్యక్షతన జరిగిన ఆ సభకు ముఖ్యఅతిధిగా ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖా మంత్రి శ్రీ మండలి వెంకటకృష్ణారావు విచ్చేశారు. ప్రముఖ రచయిత, సెంట్రల్ ఎక్సైజ్ కలెక్టర్ శ్రీ ఇచ్ఛాపురపు జగన్నాధరావు ఉపన్యసించారు. సభా ప్రారంభానికి ముందు ప్రముఖ నేపథ్య గాయకుడు యస్. పి. బాలసుబ్రహ్మణ్యం పార్టీచే గానకచేరీ జరిగింది కళావాహిని చైర్మన్ శ్రీ బి కష్ణమూర్తి కళావాహిని సేవలగురించి వివరించారు తెలుగు మహా జనసమాజం స్కూలు, కళావాహిని ఆడి టోరియం, సరస్వతిగిరి గ్రంధాలయ భవనం నిర్మాణం త్వరలోనే చేపట్టబో తున్నట్లు ప్రకటించారు శ్రీ కృష్ణమూర్తి 'కళావాహిని' సంస్థను కలిగి ఉన్నందుకు మద్రాసులోని తెలుగువారు గర్వించదగ

రీతిలో ఆ సంస్థ తన కార్యకలాపాలు నిర్వహిస్తున్న తీరును శ్రీ ఇచ్ఛాపురపు జగన్నాధరావు అభినందించారు కళావాహిని వైస్‌చైర్మన్ శ్రీ ఎల్ వి. రామయ్య తమ సంస్థకు సహాయసహకారాల్నందించిన ఆంధ్రప్రభుత్వానికీ, మంత్రి శ్రీకృష్ణారావుకూ కృతజ్ఞతలు తెలిపారు. తెలుగువారి సేవలో అహర్నిశం శ్రమిస్తున్న సంస్థ మరింతగా సహాయపడవలసిందిగా ఆయన మంత్రిగారిని కోరారు కళావాహిని జాయింట్ సెక్రటరీ శ్రీ శివప్రసాద్ కళావాహిని సాంస్కృతిక కార్యక్రమాల గురించి వివరించారు కళావాహిని సెక్రటరీ శ్రీ పి యస్ బాబు వందన సమర్పణ చేశారు కళావాహిని బిల్డింగ్ ఫండ్ కొరకు నిర్వహించిన లక్కీ-డిప్‌డ్రాలో విజేతలకు సినీతార కుమారి జయప్రద బహుమతులందజేశారు సభ పిమ్మట కూచిపూడి ఆర్ట్ అకాడమీ వారిచే వెంపటి చిన సత్యం నిర్వహణలో 'చండాలిక' నృత్యనాటకం ప్రదర్శించబడింది సభా ఏర్పాట్లూ, నిర్వహణా సమర్థవంతంగా నిర్వహించి సభ్యుల ప్రశంసలందుకొన్నారు కళావాహిని మెంబర్ ఇన్‌ఛార్జ్ శ్రీ పి. మోహనరావు

మద్రాసులోని తెలుగువారికి ఉపయోగపడుతూ, విద్యారంగంలోనూ, కళా సాంస్కృతిక రంగాల్లోనూ కృషిచేస్తున్న ఈ సంస్థలకు సహాయపడవలసిందిగా మొత్తం తెలుగుజాతినీకోరుతున్నారు కళావాహిని చైర్మన్ బి కృష్ణమూర్తి, సెక్రటరీ పి యస్ బాబు, తెలుగు మహాజన సమాజం ప్రెసిడెంట్ వి మోహనరావు, సెక్రటరీ పి నాగేంద్రప్రసాద్ మరియు మెంబర్ ఇన్‌ఛార్జ్ పి మోహనరావు. చెక్కులు,డ్రాఫ్టులు "తెలుగు మహాజన సమాజం అండ్ కళావాహిని బిల్డింగ్ ఫండ్ ఎకౌంట్" పేరుతో తెలుగు మహాజన సమాజం అండ్ కళావాహిని, 106, బిగ్ స్ట్రీట్, మద్రాసు-600 005 చిరునామాకు పంపవచ్చును 250 రూపాయలకు పైబడిన విరాళాలకు ఇన్‌కంటాక్స్ రాయితీ ఉంటుంది

## డా॥ సి. నారాయణరెడ్డికి 'కళాసాగర్' సత్కారం!

మద్రాసులో తెలుగువారికోసం అద్భుతమైన సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహిస్తూ కళాసేవ చేస్తున్న ప్రముఖ సాంస్కృతిక సంస్థ కళాసాగర్ ప్రముఖ కవి డా॥ సి. నారాయణరెడ్డికి 'పద్మశ్రీ' గ్రహీత అయిన శుభ సందర్భంలో ఆయనను ఘనంగా సన్మానించి సత్కరించింది నిర్మాత, దర్శకులుగా 'రామవిజేతా బ్రదర్స్'గా పేరొందిన కె ప్రభాకరరావు, కె బాబూరావులు ముఖ్య అతిధులుగా విచ్చేసిన ఆ సభలో కళాసాగర్ అధ్యక్షులు డా॥ ముద్దుకృష్ణారెడ్డి డా॥ రెడ్డిని దుశ్శాలువతో సత్కరించారు డా॥ నారాయణరెడ్డి ప్రతిభను ప్రశంసిస్తూ సంగీత దర్శకుడు టి చలపతిరావు, నిర్మాత దర్శకుడు గోపీనాధ్, నటుడు మిక్కిలినేని మాట్లాడారు డా॥ నారాయణరెడ్డి తనకు జరిగిన సన్మానానికి కృతజ్ఞత తెలిపారు. సన్మానం తరువాత కాకినాడ నటీనట బృందంవారిచే రవీంద్రుని కథకు కీ॥శే॥ రాంజీ నాటకీకరణ చేసిన "కాబూలీవాలా" నాటకం ప్రదర్శించబడింది

—యస్వీనారాయణ

# శ్రీశ్రీ నిర్వహించు పదబంధప్రహేళిక

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | 3 | | 4 | 5 | | 6 |
| | ■ | 7 | | ■ | 8 | | ■ | |
| 9 | 10 | ■ | 11 | | | ■ | 12 | |
| ■ | 13 | 14 | | ■ | 15 | 16 | ■ | |
| 17 | ■ | | ■ | 18 | ■ | | ■ | |
| | ■ | 19 | 20 | ■ | 21 | | 22 | ■ |
| 23 | | ■ | 24 | | | ■ | 25 | 26 |
| | ■ | 27 | | ■ | 28 | 29 | ■ | |
| 30 | | | | | | | | |

ఆధారాలు ఏప్రిల్ '77

## అడ్డం

1 దిగంబరర్షులు

7 స్త్రీ

8 ఒక దేవుడు

9 పారదారికాధికరణంలో మార్గం

11 కావాలి

12 నడిచే నాలుగోవంతు

13 తలలేని చక్రవర్తి

15 ఒకడు, ఇంకొకడు

19 పార్వతి

21. హింసతోనూ, అహింసతోనూ చెయ్యవచ్చు

23. సినీతార

24. లోపలి నిజం మిశ్రసమాసం

25 నలుగురిలోనూ, ఎనమండుగురిలోనూ ఉన్న శ్రద్ధ

## మార్చి 77 'పదబంధ ప్రహేళిక'కు సమాధానం

అడ్డం 1 మిమిమిమిమి 3 చీలిక 5 మర 6 లావా 8 జాబితా 9 కోన 10 భగవతి 12 బావలకు 15 త్రయోదశి 18 మృదుదేహ 20 భేష 21 ఖండిత 22 శిల 23 నడి 25 లుబ్ధుడు 26 కదనరంగం

నిలువు 1 మిత్రలాభమిత్రభేదాలు 2 మిధ్య 3 చీర 4 కదనకుతూహల రాగం 5 మతాబా 7 వాగ 8 జాతి 9 కోల 11 వరద 13 వలదు 16 యోష 17 శిఖండి 18 మృత 19 దేశి 23 నడు 24. కాన ఏకాక్షరపదం 14 అ

## నిబంధనల్ని మరవకండి!

ఎంట్రీలు కొట్టివేతలూ, దిద్దుబాటులూ లేకుండా జ్యోతిలోని పదబంధ ప్రహేళిక లోనే నింపిపంపాలి ఎం|టీ పంపినవారి చిరునామా పదబంధ ప్రహేళికవున్న పేజీలోనే పైన రాసి పంపాలి ఆల్ కరెక్ట్ ఎంట్రీలలో లాటరీవేసి ఒక్కరికి తెలుగు నిఘంటువూ, మరో పదిమందికి ఆ నెల జ్యోతి కాపీలు పంపబడతాయి ఆల్ కరెక్ట్ పంపిన పాఠకు లందరి పేర్లూ జ్యోతిలో ప్రకటిస్తాము ఎంట్రీలు చేరవలసిన ఆఖరు తేది 1-4-77

## మార్చినెల పదబంధ ప్రహేళిక ఫలితాలు

ఆల్ కరెక్ట్ పంపిన ఎంట్రీలలో నిఘంటువు బహుమతి గెలుచుకొన్నవారు కె వెంకటరావు, 49-33-1/A, రామకృష్ణనగర్, విశాఖపట్నం-6 ఆల్ కరెక్టు పంపిన ఇతర పాఠకులు (1) ఎస్ వీరాస్వామి, హైదరాబాద్-43, (2) కోటకృష్ణ ప్రసాద్, సికింద్రాబాద్-25, (3) గోపాల్ రెడ్డి హైదరాబాద్-4, (4) డా॥ కె శివ భూషణం, కర్నూలు, (5) భట్టారం ఉదయిని కావలి, (6) బి కామేశ్వరీ దేవి, మద్రాసు-10। (7) పి శ్రీరామరావు, మల్కిపురం, (8) కె జి విజయలక్ష్మి జయ రామరెడ్డి, ఈ తాండ్రపాడు, (9) ఎం హెచ్ వి సుబ్బారావు, ఆలూరు (10) ఎస్ ప్రదీప్, హైదరాబాద్-8, (11) గడిగ సంజీవ రెడ్డి, నూతన పల్లె, (12) కొడాలి సాంబశివరావు, మహానంది, (13) ఏ జి ఛాయ, తిరుపతి, వీరిలో మొదట పదిమందికి ఏప్రిల్ జ్యోతి కాపీ పంపుతున్నాము

---

27 అత్తమీది కోపం దీని మీదనా?

28 వేదన

30 సంగీత స్వరాలు

### నిలువు

1 దాసరి మారితే అరవంలో అలాగే.

2. —భూతేందు ధారాధరా

3 యముడు

4 అగ్ని

5 స్త్రీ వాచకం

6 అయిదులు

10. తార

14 ఇదే వరుస

16 ఒక జలపాతం

17 సర్ సి ఆర్ రెడ్డి ఇంటి పేరు

20 ఒక అప్సరస

21 సంస్కృతంలో అబద్ధం చెప్పకు

22 కర్ణం

26 లేనివాళ్ళు

27 జోడీ

29 ఇందులో కార్మికులు పనిచేస్తారు

### ఏకాక్షర పదం

18 ఇంగ్లీషురమ్ము, సంస్కృతపు నీళ్ళు

Edited and Published by V Leelavathy Raghavaiah, 40/1, Moosa sait Street Madras-600 017 and Printed by D Hanumantha Rao, at Kranti Press, 12, Francis Joseph Street, Madras-600 001